శ్రీ సావిత్రీ గ్రంథమండలి. చతుర్థ ప్రచురణము.

# దివోదాసు నాటకము

గ్రంథకర్త:
శ్రీ రాముల సచ్చిదానందశాస్త్రి

మొదటి కూర్పు 1000 ప్రతులు.

బ్ర. శ్రీ. వినపాముల లక్ష్మీనరసింహముగారి
ద్రవ్యసహాయమున ముద్రింపఁబడినది.

స్వతంత్ర ఆర్టుప్రింటర్సు.
విజయవాడ.



వెల రు 2/-

# హెచ్చరిక

ఈ నాటకము అన్ని కాపీరైటు హక్కులు గల నాయనుమతిని లిఖితపూర్వకముగఁ బొందక సినీమా, నాటక, గ్రామఫోనులవారు ప్రదర్శనాది స్వాతంత్ర్యములనుగాని, భాషాంతరీకరణ, కథాభాగ సంగ్రహణ, పరివర్తనాదులనుగాని యవలంబింపఁగూడదు.

నా లిఖితపూర్వకమగు ననుమతిని బడయక యెవరే భాగమును బ్రదర్శించినను ఇతరవిధముగ నుపయోగించుకొనినను నా నష్టమునకు నేఁజేయు సివిలు, క్రిమినలు చర్యలకుఁ బాత్రు లగుదురని తెలిసికొనవలయును.

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి,
శ్రీసావిత్రీ గ్రంథమండలి, ఓంకార మందిరము.
బెల్లంకొండపోస్టు, గుంటూరుజిల్లా.

# నివేదనము

అస్మత్పితృపాదులు కాశీఖండాంతర్గతమగు దివోదాసచరిత్రమును బురాణరూపమునఁ బ్రవచించుచుండ విను భాగ్యము కల్గుటయు, నందలి కథావిధానమునకు సమాకృష్టచిత్తుఁడ నగుటయు, నాకు బాల్యముననే సంభవించినది. పిదప నా సాహితీవ్యాసంగావసరమున నైతము హృదయము హత్తుకొని యా కథ మఱువరానిదై యుండెను.

శ్రీ మైలవరం రాజాగారు, శ్రీ మోతే నారాయణరావు జమీందారుగారు మున్నగు నాట్యకళాపోషకులు నెలకొల్పిన తమ సంస్థలయందు నేను రచించిన 'సావిత్రి' మున్నగు నాటకములఁ బ్రదర్శించి, నన్ను మిగులఁ బ్రోత్సహించి యుండుటచే, నాకు దివోదాసచరిత్రమును గూడ నాటకముగ వ్రాయు నభిలాష కలిగియుండెను.

కాని నేఁటి యభిరుచులతీరు వేఱగుటచేత వ్రాసిన నాటకములఁ బ్రచారమునకుఁ దెచ్చుటకుఁగాని, నూతననాటకరచనోద్యోగమునకుఁగాని కుతూహలినిఁ గాకుంటిని. అలవడిన సినిమాకథారచనమును గూడ విరమించితిని.

అయినను గారణాంతరమునఁ దగినంత ప్రోత్సాహ మలవడుటచే నే నీ నాటకరచనమునకుఁ గడంగి, తిరిగి కథాసందర్భము లన్నిఁటిని బరిశీలించితిని. విద్వాంసుఁడు, ధార్మికుఁడు, తపస్వి, మహాయోగియునై రాజ్యపరిపాలనాదులయం దసమానుఁ డనఁదగియున్నను, సపరివారముగ నీశ్వరుని, సకలదేవతలను, బాతాళలోకాసుల నెల్లను నెడలనడఁపఁబూనుకొనుట రిపుంజయుని ధార్మికతకు హాని కలిగించునేమో యనియు, సుప్రసిద్ధకథాంశమును మార్చుట యెట్టులో యనియు, ఉదాత్తమై, రసవంతమై, కథ యెట్లు రాణించునో యనియు, నియ్యది మోయలేని బరువుగ నున్నదే యనియు నా మన స్సెంతయుఁ గుంటువడఁజొచ్చెను.

పిమ్మట నీశ్వరానుగ్రహమునను గురుదేవుని కృపావిశేషమునను, మిత్రుని ప్రోత్సాహమునను నా మనోజాడ్య మడంగి, కష్టములపాలై

మిక్కిలి గాసిపడు లోకము నుద్ధరింపవలె నన్న ధర్మోద్ధరణము కావ
లయునని, ధర్మమూలములే యర్థకామము లని, తన్మూలములే సర్వ
సౌఖ్యములన్న విశ్వాసమున, సర్వవర్ణములవారికి నిజవర్ణోచిత ధర్మ
పరత్వమే సకలార్థసాధన మను శాస్త్రమర్యాద ననుసరించి, ఈశ్వరుఁ
డేల యని నిరాకరించినను, రాజు పూర్వమీమాంసకుండగు ధార్మిక
ప్రభువు కాఁగలఁడన్న నమ్మకమున రిపుంజయునిచేఁ దొలుదొల్త నీశ్వర
నిరాకరణము చేయించి, తరువాత నితర దేవతలఁగూడ నావల కంపఁదగు
నట్లొనరించితిని. మిగిలినభాగములన్నియు ముందుకుముందే కనులఁ
గట్టిన ట్లగపడఁజొచ్చెను. తరువాత దివోదాసు సకలదేవతాస్వరూప
ధారణమున బలమఱి రాష్ట్రమునను రాజధానియందును లక్ష్మీనారాయణ
గణపతిమహేంద్రముఖ్యుల కల్పనావిశేషములకు నివ్వెఱపడుచు వందురఁ
దగినను, ధైర్యము వదలక, పుణ్యకీర్తినాముఁడగు విష్ణుసన్నిధాన
మున, ఈశ్వరనిరాకరణమునఁ గల తనలోపమును దానొప్పుకొని,
తండ్రికడఁ గుమారునివలెఁ జరించి, విశ్వరూపసందర్శన మొనరించి
శ్రీహరి యనుగ్రహము వడసి, ఈశ్వరభక్తుఁడై, చచ్చి పుట్టుస్వభావము
గల కర్మఫల మీశ్వరసమర్పణద్వారమున బునరావృత్తివిరహితమగు
మోక్షసాధన మగుననియు, నదియే పరమపురుషార్థ మనియు, నయ్యదియే
భరతదేశౌన్నత్యహేతు వనియు నెఱింగి, యీశ్వరానుగ్రహమున
దివోదాసు, మహోన్నతమగు మోక్షసామ్రాజ్యము నందికొని
మఱి పదివేలసంవత్సరములు ప్రజల నందఱి, జననమరణరహి
తమై, నిరతిశయానంద మనఁదగిన మోక్షమార్గమునఁ బ్రవర్తింపఁ
జేయు మహాభాగ్యశాలియై, లోకసంగ్రాహకస్వధర్మభూషణుఁడై యుల
రాయన ట్లొనరించి కర్మబ్రహ్మసమన్వయరూపమున నీ నాటకమును
బూర్తిగావించితిని. కాశీఖండములోని దివోదాసుకథలోఁగల కడపటి
భాగమును వదలి రసపుష్టికై సంపూర్ణమగు స్వాతంత్ర్య మవలంబించితిని.
కథావస్తువునఁగల మార్పులుగాని, పాత్రకల్పనలుగాని నాటక మర్యాద
ననుసరించి, యొనరించి నాటకమును ముగించితిని.

పిమ్మట ఆగిరిపల్లి పాఠశాలావార్షికోత్సవావసరమున దయ చేసిన శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, శ్రీ కొల్లూరు సోమ శేఖరశాస్త్రిగారు మున్నగు బహుశాస్త్రపారంగతులు, బహుభాషా కోవిదులగు మహనీయుల యెదుటఁజదివి, యచట నచట వారియభి ప్రాయములసేకరించి, వారలప్రోత్సాహము నందికొనుభాగ్యమునందితిని.

పిదప బ్రాహ్మణగురుకులాశ్రమవార్షికోత్సవసందర్భమున, విచ్చే సిన ఆస్తికమహాశయులును, విద్వద్వర్యులును గల మహాసభలో నే నీ నాటకముఁబఠించి సభ్యజనసమాదరణ పాత్రుఁడ నైతిని.

అంతట నేను బ్రాహ్మణగురుకులాశ్రమప్రతిష్ఠాపకులును, దదా శ్రమసర్వోపద్రష్టలును, వివిధశాస్త్రపారంగతులును, అగు బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రులుగారు, మదీయాధ్యాత్మికవిద్యా దేశికులగుటయును, నే నీ నాటకమునఁ బొందుపఱచిన శాస్త్రీయసంప్ర దాయములను వెలువరించుటకుఁ దగిన యధికారసంపత్తిని నాకు సమ కూర్చినట్టిసద్గురువర్యులగు శ్రీవారికే యీనాటకమ్ము నుపాయనముగనంకి తము జేయఁదలఁచితిననియు, దీనికి ముద్రణభాగ్యమెట్లొదవునో యనియు సభాముఖమున నివేదింప, స్వధర్మానుష్ఠానతత్పరులును, వదాన్యశిరో మణులునగు బ్రహ్మశ్రీ వినపాముల సీతారామయ్యగారు "మీ సంకల్పము సముచితమనియుఁ బండితజనసమాదరణపాత్రంబగు నీ నాటకమునకు ముద్రణకార్య మాగునా" యనియు సాదరముగఁ బలికిరి.

పిదప వారే ముద్రణభారమంతయు వహించి, నా నాటకమును, వెలయింపఁ జేసిరి. అట్టి శ్రీ వినపాముల సీతారామయ్యగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

నే నిటీవల బెజవాడ శ్రీ రాజరాజేశ్వరీనాట్యమండలివారు ప్రద ర్శించు నాటకములను జూచి సంతోషముతో నొకనాఁడు నాట్య మండలి పోషకులగు శ్రీమతి రాజేశ్వరీదేవి శ్రీ సూరిబాబుగార్లతోఁ బ్రస్తావవశమున నాట్యకళాప్రాదుర్భావవికాసాదులను గుఱించిన గోష్ఠీరూపమగు ప్రసంగావసరమున దివోదాసుచరిత్రమునుగుఱించి యొకించుక ప్రసంగించి మూలకథను దృశ్యరూపముగఁ జేయు సంవిధా

నాదికమును గూర్చియు ముచ్చటించి కాశీఖండములోని దివోదాసు కథనుగూడ వినిపించితిని.

నాటకరంగమునందును, సినీమారంగమునందును బాల్యము నుండియు విశేషానుభూతిసం గీర్తిప్రతిష్ఠలను గడించిన శ్రీమతి రాజేశ్వరీదేవి సూరిబాబుగారలు విశేషముగ సంతసించి పౌరాణికముగను సాంఘికముగను ఈ కథ నాటకరంగమునకును, సినిమారంగమునకును మిక్కిలి యుపకరించుననియు, దీనిని మీరు నాటకరూపమున వ్రాసిన నేము శీఘ్రముగఁ బ్రదర్శింపఁగలమనియు, నన్ను మిగులఁ బ్రోత్సహించిరి. వారి యాదరపూర్వకమగు ప్రోత్సాహమే నా యనారోగ్యస్థితిని సైతము మఱపింపఁజేసి, నాకు నూతనోత్తేజము గలిగించి, మఱల నాటకరచనమున కమృతదోహదమును గలిగించినది. తన్మూలముననే నవ్యనాటకనిర్మాణము, గ్రంథముద్రణము, కవి పండిత ప్రశంసలు, గురుదేవభజనము, కృతిసమర్పణమహోత్సవము, మున్నగు నదృష్టములన్నియూ గలిగినవి. ఇట్టి మహోత్కృష్టకార్యప్రోత్సాహకులగు శ్రీరాజేశ్వరీ సూరిబాబు దంపతులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను. నా నాటకరచనాభారము తగ్గినందులకు సంతసించుచు సత్వరముగఁ బ్రదర్శనభాగము వహించి దీని ప్రాశస్త్యమును బహుముఖముల వ్యాప్తిగావించి లోకాదరణపాత్రు లగుదురుగాక యని మిక్కిలి యాశించుచున్నాను.

నేను గోరినంతనే యనుగ్రహబుద్ధితో, నా నాటకమునకుఁ బీఠికను వ్రాసియిచ్చిన ధ్వన్యాలోకాంధ్రీకరణకర్తలును, సాహిత్యశిరోమణులును, పూర్వోత్తరమీమాంసాశాస్త్ర విజ్ఞాతలు నగు బ్రహ్మశ్రీ విద్వాన్ భాగవతుల కుటుంబశాస్త్రి ఎమ్. ఏ. మహోదయులకును, నా నాటకము నెక్కువ యాదరాభిమానములతోఁ బరిశీలించి, నన్నాశీర్వదించిన జగన్నుతులును సంస్కృతాదిభాషాకోవిదులు నగు పండితవర్యులకును, గవివతంసులకును నా కృతజ్ఞతాపూర్వకవందనములు. నాగ్రంథరచనమునకుఁ బ్రోత్సహించి నాకు మిక్కిలి దోడ్పడిన పండితులును సరస కవివతంసులును నా మిత్రులు నగు బ్ర. చతుర్వేది అమరేశ్వరశాస్త్రి

మహాశయులకును, గ్రంథముద్రణసమయమున నే ననారోగ్యముగ నున్నను నాభారమంతయు వహించి, నాకు మిక్కిలి తోడ్పడిన నా చిర మిత్రులును ఉత్తమపండితులును, సుకవిభూషణులునగు బ్ర॥ విశ్వనాథ వేంకటేశ్వరశాస్త్రిమహోదయులకు కృతజ్ఞతాపూర్వక వందనములు. తొలుదొల్త నా వేదాంతవిద్యావ్యాసంగమును మిక్కిలి ప్రోత్సహించి రెండుసంవత్సరములు నా కుటుంబభరణమునకుఁ దోడ్పడిన కీ॥ శే॥ శ్రీవిశ్వ దాతకాశీనాథనాగేశ్వరరావు పంతులుగారికిని, ఇటీవల నావ్యాసంగము నకుమిక్కిలి సాయపడిన తత్త్వరహస్యవిదులును, వదాన్యశిరోమణులును వైశ్యకులాలంకారులునగు శ్రీచందా కాంతయ్యశ్రేష్ఠిగారికిని నే నెంతయు గృతజ్ఞుడ నగుచున్నాను. నా నాటకమున నేను జేసిన మార్పులలోఁగాని రసౌచిత్యాదులలోఁగాని, మఱియేయితరవిధములఁగాని కనఁబడిన దోష ములను దయతో నాకుఁ దెల్పిన వానినెల్లఁ బరిశీలించి తగురీతిసవరించు కొందును. సహృదయులెల్లరు దయతో నన్నుఁ గరుణింతురుగాతయని ప్రార్థించుచున్నాను.

రెండవ యంకము మొదటను తరువాత యంకారంభముల యందును ప్రవేశకవిష్కంభాదులుగనే వ్రాసియుఁ బ్రకృతకాలమర్యాద ననుసరించి రంగములుగ మార్పుగావించితిని. వానిని విజ్ఞలోకము విష్కంభాది దృష్టితోనే చూడఁగోరుచున్నాను. ఇతిశమ్

ఇట్లు

పండితవిధేయుఁడు

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి.

—o:0:—

# భూమిక

నాట్యమొక చాక్షుషక్రతు వని కాళిదాసమహాకవి పల్కినాఁడు. తత్కృతఫల మనంతముఖమని భరతమునినుడి. భరతహృదయజ్ఞతకు సహృదయతాపరిపాక మపేక్షితము. సహృదయునికే కళారాధనమున నధికారము. సత్యకళ యానందైకప్రయోజనము. ఉత్తమానందము ధర్మాపేతముగాదు. ధర్మము-ఆనందము-పురుషార్థములలో నుత్తమములు. ఉత్తమపురుషార్థప్రయోజనమే నాట్యకళ. ఇట్టి కళయే, 'నాట్యమేవ రసః,' 'రసఏవ నాట్యం' 'రసో వై సః' అను నాలంకారికుల రచనలకు లక్ష్యము.

శ్రీ సచ్చిదానందశాస్త్రిగారింతకుఁబూర్వమే నాటకరచనమున సిద్ధహస్తులైనారు. వీరి పూర్వరచనలన్నియు ధర్మప్రబోధకములు. ఈ నాటకముత్తరమీమాంసామననఫలితము. శాస్త్రమునకును కళకును సామరస్య మిటఁ గుదిరినది.

దివోదాసునందలి కథావస్తువు దివ్యమానుషసంశ్రయముగఁ గన్పడినను ప్రధానముగ మానుషాశ్రయమే యగును. ఇందలి సన్నివేశములు దివ్యములు. భారతీయభావనాభావితులు కానివారి కవి యసంబద్ధములు కావచ్చును. కాని భారతీయుల కిందలి సంఘటనలన్నియును సుస్వాదుఫలములే. ఉపనిషత్పురాణములలోఁ బరిచయము గలవారి కిందలి సంఘటనలన్నియు సాధారణములే.

నాయకుఁడు సుక్షత్రియుఁడు, ధర్మశీలుఁడు. చోదనాలక్షణమగు ధర్మమునను, స్వధర్మమునను వీడఁడు. మహాశక్తిసంపన్నుఁడు. ధర్మమునకొకటే జగద్ధారణకర్తృత్వమును ప్రత్యక్షముగఁజూపి ధర్మానుష్ఠాతృ-పూర్వమీమాంసావిశ్వాసముచే విశ్వేశ్వరునేగాక, తానువాసమున దేవతాళిఁగూడఁ ద్రోసిరాజని, తానే సర్వదేవతామయుఁడై తన ప్రజల నోమిన యాదర్శనృపతి. నాటకమునందంతట నీతఁడు పాఠకుల యాదరానుకంపలకే పాత్రుఁడైనాఁడు. ఈశ్వరవిలాసమునను, దేవతాద్రోహమునను, దుదకీశ్వరుని కోపమునఁబట్టు మానవమాత్రుఁడగు దివోదాసునకు

భూషణమే యగును గాని దూషణముగాదు. అందుచేతనే దివోదాస నామముకూడ నీనాటకమున కెంతయుఁ దగినది.

సత్యమున కిందు వైరము, పూర్వమీమాంసకు-ఉత్తర మీమాంసకు; శుష్కకర్మికి - జ్ఞానికి. తుదకు నాయకుఁడగు నుపనిషత్పురుషునకు విజయము. ఉపనిషత్పురుషానుగ్రహమున ధార్మికుఁడగు దివోదాసునకు సామ్రాజ్యవైభవము.

ధర్మవీరము రసము - ధర్మావిరుద్ధమగు శృంగార మంగము- పంచమాంకమునందలి రౌద్రవీరములును, నవమాంకమునందలి హాస్యమును నలంకారములైనవి. నిర్వహణమున నద్భుతాంశ మద్భుతముగనే యున్నది.

పాత్రపోషణము సూత్రపాత్రమే యగును - పరప్రియతచే దివోదాస ప్రజానురాగైకతత్పరత, ధర్మదీక్ష, ఉదాత్తత, స్వదోషజ్ఞత యనున వెంతయు నుచితముగ వర్ణితములైనవి. అనంగమోహిని యాదర్శ గృహిణియై, షడూర్మియుక్త యగు కులధర్మపత్ని యైనది. ఈశ్వరుని స్వార్థత్యాగము; భక్తానుకంపత, అన్నపూర్ణ గూఢదృష్టి, భృంగి యౌద్ధత్యము, గణపతి ధీశాలిత్వము ననునవి రసోచితముగఁ జిత్రితములైనవి.

అభ్యుదయసాహిత్యమున సభ్యున్నతస్థాన మీనాటకమునకుఁ దగును. ఆధునికభారతపరిస్థితి, యిందు చిత్రితమైనది. రాజ్యాంగవ్యవస్థలలోని గుణదోషములు చర్చితములైనవి. అరాజకత్వ హేతువులు నిర్దిష్టములైనవి. ధార్మిక ప్రణాళిక ననుసరించి, భారతీయసంస్కృతి కనుగుణమగు రాజ్యాంగప్రణాళిక సూచితమైనది. కంటకోద్ధరణమున మార్గ ముపదిష్టమైనది. ఆధునికుల కీమార్గములు నచ్చకపోవచ్చును. సత్యాన్వేషుల కివి తప్పక హృదయంగమములు కాఁగలవు. కేవల సత్యాహింసాశబ్దములతో నూరేగు నాయకులకును, దినదినసంస్కరణముల నపేక్షించు స్వచ్ఛందచారులకును, నీనాటకప్రయోగ మొక జ్ఞానాంజనశలాక కాఁగలదని మాశ.

భాష సరళము, నాటకోచితమును. సుఖమైన శయ్య. ధారాశుద్ధి యకుంఠితము. నాటకమునకు మఱేమికావలయును? "ఏను బురాణయోగిని" దీని బోలినపద్యములు సహృదయహృదయాహ్లాదకరములు గావా? ఇందలి సరసములును సమయోచితములు నగు లోకోక్తులు హృదయావర్జకములే యగును.

ఈ కృతికి భర్త (శ్రీ) వేంకట్రామశాస్త్రిగారు. ధార్మికలోకమునకుఁ జిరపరిచితులు. ధర్మప్రాణులు. క్రియాశూరులు. గురుకులాశ్రమ సంస్థాపకులు. (శ్రీ) శాంకరాద్వైతభావనాభావితపవిత్రహృదయులు — అధీతిబోధాచరణప్రచారణదక్షులు. వీరి కీ కృతిని గృతినిచ్చి సుకృతులైనారు (శ్రీ) సచ్చిదానందశాస్త్రిగారు.

శ్రీ వినపాముల సీతారామయ్యగారు ధర్మపోషణనిరతులు. ఆస్తికులు, ధనికులు. "ఆపన్నార్తిప్రశమనఫలా స్సంపదో హ్యుత్తమానాం" అనువాక్యమును గుర్తించిన దాతలు. ఈ గ్రంథమును లోకమున కందఁ జేసినందుకు వీరికి వందనములు.

ఈ నా భూమిక (శ్రీ) శాస్త్రివర్యులకు నాపైఁగల వాత్సల్యమునకు భూమిక యగుగాక.

విద్వాన్ శిరోమణి,

భాగవతుల కుటుంబశాస్త్రి, ఎమ్. ఏ.

మచిలీపట్టణాంధ్రజాతీయ కళాశాలా ప్రాచ్యభాషోపన్యాసకులు.

ఓమ్ శ్రీసద్గురు శ్శరణమ్.

# కృతిపతిప్రశంస

శా. శ్రీవత్సాఖ్యమహర్షిగోత్రభవులన్ శ్రీవత్సకల్పుల్, సుధా
భావుల్ పొల్చిరి వంశకర్త; లటఁ దిప్పాభట్టు సాఁగించె స
ద్భావుం డా ముదిగొండ వంశము; నిఁకన్ బాపాయపాలెంబు నెం
దా విద్యాసిధి, సుబ్బనప్పు వడసెన్ బ్రాగ్రాగ్రహారంబుగన్.

ఉ. ఆ ముదిగొండ వంశకలశాబ్ధి సుధాకరమూర్తి, శేషమాం
బామహిళార్యరామబుధవర్యు లొనర్చిన భూరిసత్తప
శ్శ్రీమహితావతారమణి; శ్రీయుత వేంకటరామశాస్త్రి వి
ద్యామరదేశికుండు, విమలాత్ముఁడు, మద్గురుఁడొప్పు మెప్పునన్.

సీ. తర్క-వేదాంత శాస్త్రవిశారదుండయి
యతులితధీశక్తి నలరు ఘనుఁడు
ఆత్మకార్యము లగ్రహారకార్యము లెంచి
వేయికన్నులఁ జక్కఁ బెట్టు దిట్ట,
వఱల స్వధర్మంబు వైశ్వదేవంబుతో
నిరతాగ్నిహోత్రముల్ నెఱపు సుకృతి
పండితాతిథి శిష్యబాంధవుల్ సహపంక్తి
నడర నెప్పాట సాపడెడిగేస్తు

గీ. శ్రుతులు స్మృతు లెన్ని నడచెడు సుజనమాళి
తత్త్వమును శ్రోతలకుఁ బంచదార సేయు
రమ్యవాక్చేత, వేంకటరామశాస్త్రి
కరుడు గట్టిన విజ్ఞానఘనుఁడు, గురుఁడు.

గీ. పరగఁజేసెను బ్రాహ్మణగురుకులంబు
వెలువరించెను భారతీనిలయ మవల
ఆస్తికమహాశయాదృతి నంది యాతఁ
డెల్ల పురుషార్థహేతువు లివియ యగుట.

శా. రామబ్రహ్మబుధేంద్రుసేవఁ దనరున్ బ్రాప్తించెనో, తత్త్వవి
ద్యామాన్యుం డగు విశ్వనాథగురుబోధన్ గల్గెనో, శంకర
స్వామిన్ స్వామిగఁ గొల్చుటన్ వెలసెనో బ్రహ్మాత్మభావోన్నతుల్
సామాన్యుండును దత్ప్రబోధసుధ నాస్వాదించినన్ ముక్తుఁడౌ.

క. ఆవాగ్ధారావాహిని,
జీవస్థితి నడఁచివైచి, చిత్రములటులన్
గావించు, గంటఁద్రుటియటు,
సేవింపంజేయు జనులఁజిన్మయుగ గురున్

గీ. అట్టి మహానీయు చరణాబ్జ మాశ్రయించి
పదియు నైదేండ్ల పైనుండి భాష్యపఠన
మొనరఁగావించి, శ్రవణాదు లనువుపఱచి,
చిత్తశాంతి యొకింత గాంచితిని నేను.

చ. అఱువదియేండ్లు పైఁబడియె నర్మిలి సేవ యొనర్తునందునా ?
వఱలెడు పర్ణశాలఁగల స్వర్ణము సన్మణు లిత్తునందునా ?
గురుల ఋణం బిసీ, యెటులొకో యిఁకఁ దీర్పగ నంచుఁ గుందు నా
కరుదుగఁ గల్గె మజ్జనిఫలాయిత, కావ్యకుమారి, యాదటన్.

క. కవికిన్ గావ్యంబునకున్
లవమున్ భేదంబు లేదిలన్, గవిదేహం

బవియు న్నవయుం బొలియుం
గవితా దేహంబు నిలుచుc గలకాలంబున్

క. ఇది సుకృతమంచుc దలcచితి,
నొదవెన్ గృతికన్య, గురున కొప్పనటంచున్
మది మురిసితి, వంశోన్నతి
పొదలు నటం చెంచి మిగులc బొంగి పొరలితిన్.

సీ. ఓంకారమందిర శాంకర మండపం
బపరకైలాసమై యలరుచుండ,
ఋషివరేణ్యులు వోలె నెసcగు నాత్మానంద
ముఖ్యయతీంద్రులు మొనసియుండ,
గీర్వాణగురు లనc గెరలుచు బుధవరుల్,
కవిసత్తములు ప్రీతిc గ్రాలుచుండc,
దన శోడుసీడcగాc దనరి గంభీరత
నలరు పిచ్చయశాస్త్రి యండనుండc

గీ. బిన్నపెద్దలు, బంధుగుల్, విశ్వనాథ
శాస్త్రియును, రామశాస్త్రియు, శంకరుండు
దండ నుండంగ, నేc గృతిదాత నగుచు
భవ్యపాదు గురుం గొల్చు భాగ్య మడరె.

శా. కర్మబ్రహ్మములే నిరంతరము నీ కన్దోయిగా నొప్ప, నా
కర్మబ్రహ్మమయంబుగాc దనరు మత్కా-వ్యాత్మజారత్నమున్
ధర్మోదార నొసంగుచుంటెని భవత్పాదాబ్జభృంగీగతిన్
నిర్మోహున్ నినుc దాc గరంచుత భవానీదేవి స్థాణుంబలెన్.

ఉ. నందనుఁగా ననుంబడసి నా జనకుం డిడెఁ దొల్లి సచ్చిదా
నంద మఁటన్న నామమును; నా కది సెల్లక నేతిబీరయన్
జందమునొందె, నేఁడు శివసన్నిభ! సద్గురువర్య! సచ్చిదా
నందునిఁ జేసి, సార్థకత నాకు ఘటించితి తత్త్వమూర్తివై.

శా. ఎన్నాళ్లైనదొ స్వస్థితిన్ వదలి నే నెన్నెన్ని దేహంబులన్
గన్నానో, యిటు లెన్ని గర్భనిరయాఘాతంబులం గొంటినో
నన్నున్ స్వస్థితిఁ దేర్చినాఁడవు, గురూ! నా సచ్చిదానందనా
మౌన్నత్యంబుఁ దలిర్పఁ జేసితివి దీన్యద్భృంగకీటస్థితిన్.

శా. సీతారూపిణియైన సీతమ భవచ్ఛ్రీపాదసేవారతిన్
జేతఃప్రీతి యెసంగ ధర్మపరతాశ్రీ సౌఖ్యసంతానవి
ఖ్యాతిన్ విస్తరిలం జరించి చనె నా కాంతాలలామంబు చి
న్మాత్రజ్యోతిగ మిమ్ము నిల్పి; యిపు డమ్మాన్యన్ మదిన్ గొల్చెదన్

శా. నిన్నాదర్శము గొన్న శేఖరునకున్ నీ సోదరింగూర్చి, తీ
నన్నున్ నీ జనకుండు తత్త్వనిధి బంధం బూడ్చి యాత్మీయతన్
మన్నించెన్; గృతిఁ దండ్రి కిత్తు జయరామా! నీవె యిందున్న నా
వన్నెల్ చెప్పఁదరంబె, యైన నిట నో బ్రహ్మణ్యా! లేకుంటివే?

ఉ. వియ్యము నెయ్యమున్ మదికి వింత యొనర్పవు, లౌకికంబులౌ;
దయ్యము వోలెఁబట్టి ననుఁ దాలిమిఁ దూల్చెడి జీవభావమున్
వ్రయ్యలు సేయఁజాలితి వవారితబోధశరాళి; నట్టి నీ
తియ్యఁదనాని కేది తుల? తేర్పుము కావ్యమయాత్మఁగొన్మఁకన్.

క. మునుపులగనియై, బుధనుతి
వరలు దివోదాసకృతిని బ్రముదం బెసఁగన్
గురుదేవ! నీ కొసంగితిఁ
గరుణన్ గొని యేలు వంశగౌరవ మెసఁగన్.

## ముద్రణద్రవ్యదాతృ

# ప్రస్తావన

మ. సకలాంధ్రావని నాట్యరంగములఁ బ్రేక్షావన్మహఃప్రేక్షణో
త్సుకతాపాదకముల్ రచించితిని బో, తొల్దొల్త 'సావిత్రి' నా
టకముఖ్యంబులు; బ్రహ్మతత్త్వ మటఁ జాటంబోవమిన్ బక్వబు
ద్ధికి నా కయ్యవి గూర్పఁ బోవు సుఖశాంతిశ్రీసమాధానముల్.

మ. "ఎటు నాచిత్తము శాంతిలున్? మఱల నేదే నాటకం బొండు వ్రా
యుటకో, వాటిలె షష్టిపూర్తియును, ధైర్యోత్సాహముల్ దూలె; లం
పటకున్ మ్రొగ్గదు బుద్ధి; తత్త్వ మెటు మీమాంసింప నాకౌనొ? సం
కట మెట్లీఁగెద?" నంచు డిందువడి చింతంజేయ నాచేఁ దుదిన్.

గీ. కలము నట్టించెఁ దనకటాక్షంబు నించి,
సుకవి తన కాశికాఖండసుకృతి నొకటఁ
దా రచించిన యాదివోదాసచరిత
మౌచితిస్ఫూర్తి దృశ్యకావ్యముగఁ గూర్ప

గీ. సమహితాత్ముఁడు, ధర్మనిష్ఠాగరిష్ఠుఁ,
డాత్మవిద్యాగురుండు, తత్త్వార్థదర్శి
కనులపొరఁ బుచ్చి, గమ్యమార్గమును జూపెఁ
బ్రథితముదిగొండ వేంకటరామశాస్త్రి.

చ. ఉడుగని కర్మతంత్రగతి, యోగగతిన్ బహుధావిభూతి యే
ర్పడిన, నడంగు నద్ది యచిరంబ; యహంకృతిమూల మాట-నె
య్యెడ, నిఁక నీశ్వరైకగతి, నేతదనన్యగతిన్ విభూతి యే
ర్పడిన, నడంగ దద్ది, సుచిరం బగు నంచుఁ గృతిన్ వెలార్చితిన్.

చ. అనఁగ ననంగ నెట్టెటొ సమాప్తినిఁ గాంచెను నాటకంబు; తృ
ప్తిని గనె నామనంబు; వినిపించి, తదంకితముం బొనర్చి, భ
క్తిని బ్రణుతింప సద్గురుఁడు దీవెన లిచ్చెను; మెచ్చి రార్యు! లై
నను ఫల మున్నె ముద్రణ మొనర్పక; యెట్లొకొ యంచు నున్నెడన్.

సీ. పృథుయశోధనము నార్జించె నాంగ్లప్రభూ
దత్తముద్ధారకోదగ్రపదవి
వరజగద్గురుపుష్పగిరిమఠామాత్యుఁడై
మాన్యాగ్రహారసంపదలు పెంచె
తనకార్యదర్శిత్వమున సనాతనధర్మ
పీఠి బ్రోగించె దిగ్వ... ...
అల మంగళాద్రిమాహాత్మ్యసత్కృతి కధీ
శ్వరుఁ డయ్యెఁ గవిసార్వభౌమువలన
గీ. నెవ్వఁ డాబుధమౌళి మద్వృత్త మెల్లఁ
గని, విని, ద్రవించి, యధిగతోత్కంఠుఁ డగుచుఁ
గొడుకునకు నెట్టి యాదేశ మిడెనొ యేమొ!
పడియె నారొట్టె నేతిలోపల, బిరాన.
మ. తనయంతన్ బ్రియమారఁ దానె "సుకవీంద్రా! మీ 'దివోదాస'ము
ద్రణపుణ్యాంశము నేని మా కొసఁగ రాదా?" యంచు సప్రశ్రయా
ర్థనముం జేసెఁ దదాత్మజుం; డతనిఁ బ్రస్తావించి, శోధింతు దు
ర్మనుజాళిస్తుతిపాఠపాళి నపవిత్రం బైన నా నాలుకన్.
సీ. ఆరగించెదరు మృష్టాన్న మెప్పాట న
భ్యాగతుల్ శిష్టు లెవ్వాని పంక్తి;
అనుదినం బభ్యాహితాధికార్థము లొంది,
దీవింతు రెవని సంతప్తి బుధులు;
భయ మీఁగి, తరుణయజ్వాలు దీర్తు రేఁటేఁటఁ
గ్రతువు లెవ్వనిసత్ప్రాపకంబులలిమి;
దురదృష్ట ముడిగి, కాంతురు జీవనాలంబ
మూర్తు లెవ్వని యాశ్రయంబుకతన;
గీ. ఆ వదాన్యుఁడు, కవిపండితాభిమాని
ముద్రిత మొనర్చె మద్గ్రంథమును దనంత,
పేరు వివరింప నేల? గుంటూరు విప్ర
ముఖ్యుఁ డనినంత నెఱుఁగంగఁబోరె బుధులు.

ఉ. ప్రాజ్ఞులకున్ జిరాయురభయాభ్యుదయంబులఁ గూర్చు నాజగ
త్ప్రాణుని, శీతభాను, నలభాను నెఱింగినయట్లు-పుణ్యశో
భానిరవద్యుఁ బూజ్యు, వినపామ్ములనంశ్యుని, సీతరామయన్
ధీనిధి, శ్రీనిధిన్, గుణనిధిన్ జగమెల్ల నెఱుంగునే గదా!

సీ. కొనిన, నమ్మిన, దాఁచికొనిన, నిచ్చినఁ దండ్రి
యాజ్ఞ యెట్లో యట్ల యాచరించు;
భక్ష్యభోజ్యము, లన్నపానీయములు తల్లి
యెవి దెల్పు, వానిఁ జేయించు దినము;
జపతపోవ్రతసహస్రము సేయు, గురుఁ డెన్నఁ
డెటుల నాదేశించు, నటుల విడక;
అక్కచెల్లెండ్ర కెల్లాలు వేనిని మెచ్చు,
నట్టిసారెలు కట్టఁబెట్టు విలిచి

గీ. అతసి, మహితాత్ము, వినపాములాన్వయాప్తు
తాబ్ధిరాకాశశాంకు, నధ్యాత్మనిరతు
నరసమాంబికానారసింహసుతుని,
సీతరామాఖ్యు నెంతుఁ బ్రఖ్యాతయశుని.

గీ. సజ్జనవదాన్య ధార్మికసమితియెడల
నతిశయోక్తులుగా నొప్పు నాదికవుల
యభినుతు లనెల్ల సీతరామార్యునెడల
నొప్పు నిశ్శంకముగ స్వభావోక్తు లగుచు.

చ. అహమిక నొంపఁజూచు నహితాత్ములపైఁ బరఁగించు నీ విని
గ్రహమునఁ బండితాశ్రితనికాయముపై నెలయించు నీయను
గ్రహమున, నారసింహతయు, రామతయున్ నిజమూర్తిఁజూపు నీ
మహిమకు సీతరామ! గొనుమా, పలుమా ఱివె మాజోహారులన్.

మ. కవులున్, గాయకులున్, సుహృత్తులు, రహఃకార్యార్థులున్ రాజబం
ధువులున్ బైనిడుకార్యభారముల నెందున్ దీర్చుచో, రాత్రులుం
బవళుల్ సాలని సీతరామబుధుఁ డాత్మజ్ఞాననిష్ఠాతిభా
రవహత్వంబున నేమఱం డనినఁ దత్ప్రజ్ఞత్వ మాదర్శమౌ.

మ. తనయున్ దండ్రియె గెల్చునో కొడుకె, పురుషార్థశ్రీసుఖావాప్తిఁ దం
డ్రిని లీలన్ దనయుండె గెల్చునొ, వితర్కింపంగ మా కేల ? యై
నను సిద్ధించుత తండ్రికోర్కియె; శుభాంతం బైన యేతత్క్రమం
బునె గాంచున్ వినపాములాన్వయపితాపుత్త్రిత్వభావ్యున్నతుల్.

మ. "తనువుల్ ద్వైతముఁ దోఁపఁ జేసినను, మా దాంపత్య మద్వైతమే
యని చేతఃకృతిభాషణంబుల నెగా, కాత్మాభిధానైక్యయు
క్తిని జాటించి భజింత్రు గేహినులు లక్ష్మీనారసింహార్యుఁ ద
త్తనయున్ శ్రీవినపాములాన్వయజు, సీతారామ ధీమన్మణిన్

మ. సదయున్ శ్రీశు భజించి మీ కనిన యుచ్చైర్మానుషానంద మ
య్యాది, య్యేకోత్తరవృద్ధిఁ గాంచి తుది బ్రహ్మానందమై పర్వ, భూ
ప దివోదాసటు, మీరలుం గనుఁడు ప్రాప్తవ్యాక్షయానీదృశా
భ్యుదయం బో వినపాములాన్వయపితాపుత్త్రుల్! సుధాంభోనిధుల్!

గీ. పైడికంచాల బువ్వంపుబంతులందుఁ
బురిటిపులగాల విందు సంబరంబులందుఁ
దమ్ము మనుమలమనుమ లాత్మజులు గొలువ
నలరుదురుగాత ! వినపాములాన్వయజులు.

---

# అభిప్రాయములు

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, ఆంధ్రవ్యాసేత్యాది బిరుదాంకిత,

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

శా. శ్రీనాథుం డవిముక్తఖండమున వ్రాసెన్ వాసిమీఱంగ ను
ద్యానంబట్లు రసంబొసంగెడు దివోదాస ప్రసూనాంశ మ
ద్దానింబూని కవీంద్రశేఖరచిదానందుండు దృశ్యంబుగా
నానందంబు మహాప్రవాహమగుచున్ వ్యాపింపఁ జేసెన్ రహిన్

తే. అల్ల ధన్వంతరియె విధిప్రార్థనమునఁ
గాశి నేల దివోదాసుగా జనించె
ననుచుఁ జెప్పుదు రార్యు లేఁ డైనఁగాని
యద్దివోదాసుఁ డెంతైన నుద్దిమొఱయు.

తే. సచ్చిదానందశాస్త్రి విజ్ఞానగరిమ
సత్తమోత్తమ పాత్రమై యొప్పువాని
నాయకునిఁ జేసి యిటు మహానాటకముగఁ
దచ్చరిత్రము చిత్రించెఁ దజ్ఞు లెన్న.

చ. వెనకయ వెన్నుఁ డాదిగను వేల్పులు నల్పముగాని దోష మా
జనపతిపట్టఁ జేసిరని స్కాందము చెప్పుచునుండ నట్లుకా
దని ఘనులైనవారియెడ నాగముసూపక చక్కనైనదా
రినిఁ గలిగించి దృశ్యము వరించి నుతింపఁగఁ జేసె వాసిమై.

మ. పదియంకంబుల నాటకం బది యటన్ భాసిల్లు రంగంబులున్
హృదయాహ్లాదకరంబులై వచనముల్ హృద్యంబులై పద్యముల్
పొదలుం బెక్కులు పెద్దపెద్దలకు సంమోదంబు పుట్టించు న
ప్పదియార్యాన్నపసిండి పండితకవిద్వర్ణ్యప్రబంధం బిలన్

ఉ. పండితదృశ్య మిద్ది యసి పల్కఁగవచ్చెడు దృశ్యమాటచే
సిందినసత్పదార్థమున నిచ్చలు మోదము హెచ్చఁ జేయుచున్
బంధువునాఁ బఠించుతఱి భావము భావములందుఁ గల్గు న
ట్లుండు విశాలమై రచన యుత్తమకావ్యము జాతిరత్నమై.

## మధ్వశ్రీ అవధానిశిరోమణి, కాశీ కృష్ణాచార్యులుగారు

క. ఏనాఁడో నీ కవిత నా
కానందముఁ గూర్చె సచ్చిదానందకవీ !
ఈనాఁడు నొడువనేలా ?
నానాఁ డది వివిధరసఘనంబయి యొసఁగన్.

## వ్యాకరణశిరోమణి విద్వాన్ జ్యోతిశ్శాస్త్రవిశారద
## బ్ర॥శ్రీ కుప్పా ఆంజనేయశాస్త్రిగారు

పుడమిని మార్గముల్ సుఖముపొందఁగ నెన్నిగొ కల్గు వానిలోఁ
గడప నశక్యమై యొసఁగుఁ గర్మపుమార్గము-ప్రాణికోటికిన్
జెడుగువో మంచివో కృతులఁ జేయక తప్పదు గాన శాస్త్రముల్
దడవుచు వానినే శ్రుతిహితమ్ముగఁ జేయఁగ మేలు చేకురున్.

కాదనఁబోము కష్టములు కర్మములంగల వన్న వాదమున్
లేదొక లోప మందరయ లేశము భక్తిలతావిమిశ్రితం
బై దయివార నద్ది విపదాతపముం బరిమార్చి, తేల్చెడిన్
శ్రీదయితాంఘ్రితామరసచిన్మయదివ్యమరందవాహినిన్.

ఈమహనీయతత్త్వమును నెంతయు భావనఁజేసి చేసి, నే
డీ మహి భక్తికర్మపరిహీనతఁగాంచి దయార్ద్రులైన శ్రీ
రాముల సత్కవీంద్రులు నిరంతరభావితశాస్త్రసారమున్
భూమదమున్. రచించిరి రిపుంజయనామకనాటకంబుగాన్.

అరయం బెక్కులు పుట్టుగిట్టు ధరఁ గావ్యాభాసముల్ వానిలోఁ
బురుషార్థంబొకొ నీతియొక్కొ రసమో సూన్యంబొ, యుస్సీ! యుఁకన్
విరివిన్ సద్గుణసేవధుల్లలిత సావిత్రీ దివ్యవాసము
ఖ్యరసాపూరితకావ్యము ల్వెలయుఁ, గల్యాణంబు దైవాగదే.

రాజు లేకుండిన రాష్ట్రంబులకు నేమి
గతులౌనొ యీనాటకమ్ము దెలుపు
వేదోక్తకర్మము ల్వెలయకున్నను నేమి
గతులౌనొ యీనాటకమ్ము దెలుపు

దేవభక్తియ లేని దేబెల కేమేమి
గతులౌనో యీనాటకమ్ము దెలుపు
పాపమన్నను భీతి పడకున్న నేమేమి
గతులౌనో యీనాటకమ్ము దెలుపు
ఇందు లేనట్టి సద్గుణ మెందు లేదు
ప్రౌఢకవయిత శ్రీరామవంశమౌళి
సచ్చిదానంద సత్కవిచంద్రుఁడిట్టి
కృతుల రచియించుఁగాతఁ బెక్కింటి సంక.

విద్వాన్ కావ్యతీర్థ

మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు - నంద్యాల

క. సాదరముగఁ దా మిడిన ది
వోదాసును జదివితిన్, బ్రబుద్ధమనీషా
వాదములచేతఁ దత్త్వా
ర్థోదయసంకలిత మగుచు నొప్పెను సుకవీ!

మ. స్వమతాస్తిక్యముఁబట్టి పుట్టిన యపూర్వజ్ఞానసంపత్తి య
న్యము సర్వంబును ద్రోసి పుచ్చెదు మహాహంకారముల్ బెంచఁ ద
త్కృత్రిమ ముచ్ఛేద్య మటంచుఁ దాత్త్వికవిమర్శన్ సచ్చిదానందభా
వముఁ జక్కం బ్రకటించినారలు కవిబ్రహ్మణ్య! మీసత్కృతిన్.

మ. కవితాశిల్ప మనల్పమై కథ కలంకారంబుఁ జేకూర్ప నం
దవు శాస్త్రార్థవిమర్శనాదికములం దౌచిత్య మొప్పారఁ, బ
ర్యవసానంబున కావ్యమై మిగుల నయ్యద్వైతసిద్ధాంతమే
మిపులన్ జాటిన మీయుపజ్ఞ ప్రతిబింబించెన్ దివోదాసులోన్.

తే. స్వమత సిద్ధాంతముల వ్యాప్తిపఱచుకొఱకు
నన్యమతనిరాసనముకో ననువుపఱతు
రట్టివాని ఖండించి యనన్యమోక్ష
సరణిఁ గనఁబఱచితివయ్య శాస్త్రివర్య!

## అభినవ తిక్కనేత్యాది బిరుదాంకితులు

## బ్ర. శ్రీ. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు - నెల్లూరు.

తమరు లోకజ్ఞులు - నాటకరచనవిషయమున లబ్ధప్రతిష్ఠులు. ఇంతతోఁ దనియక, అద్వైతవేదాంతమునందుఁ గృతశ్రములై పూర్వమీమాంసామతనిరాసపూర్వకముగా ఈశ్వరాపేక్షకతానుమానశాస్త్రార్థమును, ఈ రూపకమునఁ బ్రవేశపెట్టి యీశ్వరుఁడు లేఁడన్న వారలను జయించుటకుఁ గలుగు నెవరెట్టిదో మిక్కిలి చక్కఁగా నిరూపించియున్నారు. ఈనాటి విద్యార్థులు, విద్యార్థినులు మీ నాటకము చదువుటచే విదితవేదితవ్యు లగుదురనుటకు సందేహము లేదు. ప్రతిపద్యమును ధారాశుద్ధికలిగి, గుణవంతముగా నున్నది. కాని, పూర్వకావ్యమున నిన్ని పద్యము లుండ నక్కర లేదని తలంతును.

## శ్రీమత్పరమహంస పరివ్రాజకేత్యాది బిరుదాంకిత

## దక్షిణామూర్తి ఆశ్రమస్వాములవారు — బనారసు.

బ్రా॥ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రికి - నారాయణస్మరణపూర్వకముగా వ్రాయు పత్రిక—

దివోదాస నాటకమును చూచినాను. పరమానందముతో ఆతఁడు రాజ్యము చేసిన కాశిలో, గంగకట్టునఁ జదివితిని. బ్రహ్మశ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి వాక్కు, అందరికీ సులభముగా, సంక్షేపముగా, నాటకరూపము (వాక్యరూపము) విస్మయావహముగ నున్నది. "ఓటి పడవతో సముద్రయానము, ముంజకట్టల మంచె" ఇత్యాది వాక్యాలు అసభ్యములు గాను, పరమానందదాయకములు గాను ఉన్నవి. వెయ్యేల! దివోదాసుని గురించి పిన్నా[illegible] వ్రాయవలెను.

[illegible] శ్రీ [illegible] శిష్యునివాక్య ములు [illegible] ని, [illegible] స్వభావముగా [illegible] మైనది, [illegible] గ్రంథము [illegible] ధానమున శ్రవణ, మనన, నిదిధ్యాసన [illegible] శాస్త్రి వాక్కు [illegible] దని [illegible] చుకొన [illegible] లవలెను. [illegible] వచ్చును. [illegible] శ్రీ [illegible] పోయి. లక్ష్మి రసి [illegible] నిత్యము [illegible] నారాయణ [illegible] శ్రీ వేంకట రామ [illegible] నారాయణస్మరణం.

# తర్క వేదాంత విశారద

## బ్ర|| శ్రీ బులుసు అప్పన్నశాస్త్రి మహోదయులు-భట్నవిల్లి

ఆర్యా! తాము పంపిన "దివోదాస" నాటకము నా మూలచూడము సవిమర్శముగఁ జూచితిని-గృహనిర్మాణ కార్య వ్యగ్రుడనైన నేను-అవశ్యదర్శనీయ మైనదైనను ఇతరకార్యభారముచే కిల విలంబముగఁ జూచి మొదలిడితిని. తదాది అతివేలరసభరిత మైన యీ నాటకము నన్ను అవిచ్ఛిన్నోత్తరసత్సన్నివేశపఠనప్రవృత్తుని జేసి తన్ను గానే సాంతముగఁ జదివించుకొని యాహారవిహారాది కార్యకలాపమునుగూడ అతివేల మొనర్చినది. సార్థకవిశేషణవిశిష్టలక్షణముపోల సత్సన్నివేశసంపన్నమై విరాజిల్లుచున్న యీ నాటకరాజము-పౌరాణికము, సాంఘికము గూడనై, ఆస్తికదర్శనసాంప్రదాయ బోధకమై పరమపురుషార్థప్రాధాన్యప్రతిపాదకమై సహృదయహృదయానురంజకమై యలరారుచున్నదని నా నిశ్చితాభిప్రాయము.

మరియు నీ నాటకమునందుగల - పండిత పామరసామాజికానురంజకసుప్రసిద్ధ లలితాది లలిత నాటకత్రయ సమాన కర్తృత్వము "సత్యమేవ వక్తవ" యనుచున్నది. ఇట్టి సత్సాంప్రదాయప్రబోధకదృశ్యకావ్యముల నిర్మించి, అజ్ఞానధ్వాంతపరీత, పరభాషావేషాదివేశపోషాసక్తమున నిద్రాణమైయున్న భారతప్రజానీకమును జాగరితి మొనర్చుచున్న శ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారికి విశ్వకల్యాణ సంధాతయగు విశ్వేశ్వరుడు ఆయురారోగ్యముల నిచ్చి యంతఃప్రేరకుడై యీ విధముగనే-శిష్టప్రాయసదాచారసముద్ధరణప్రయత్నమును చేయించుగాక యని కోరుచున్నాను.

## తర్క వేదాన్తాలంకార శాస్త్రపారీణులు,
## ఆంధ్ర విశ్వవిద్యాపరిషత్సంస్కృతపండితులు,
## బ్ర|| శ్రీ|| కొలూరు సోమశేఖరశాస్త్రిగారు-వాల్తేరు

వైదికమతము సుప్రాచీనము. బౌద్ధము మున్నగు నాస్తికమతములుకాని, సాంఖ్యము మున్నగు ఆస్తికమతములుకాని, దీని నాధారముగఁజేసికొనియే బయలుదేరినవి. కావుననే వీరు తమతమ సిద్ధాంతములు వేదసమ్మతములని నిరూపించుటకు కొంతవఱకు ప్రయత్నించిన ట్లగపడుచున్నది. కాగా విషయగాంభీర్యమునుబట్టియు, కాలవిశేషమును బట్టియు, వైదికమత పరిజ్ఞానమందు లోకమున కాదరము సన్నగిల్లినది. వైదికమతము సుబోధము కాకుండుటయే దీనికి కారణము. ఈ విషయమును గమనించియే, జైమిని, శంకరులు మున్నగువారు, వేదవ్యాఖ్యానమునుజేసి, వైదికమతమును స్పష్టముగ నిరూపించిరి. కాని అదియు, శాస్త్రార్థబహుళము, సంస్కృతభాషాజటిలమును అగుటవలన సంపూర్ణముగ లోకమునకు విశదము కాజాలకుండెను. ఇట్లుండ కొంతకాలముక్రిందట, కృష్ణమిశ్ర పండితులు "ప్రబోధచంద్రోదయము" అను నొక సంస్కృత నాటకమును

రచించి, వైదికమతమునందలి, ఉత్తరభాగసిద్ధాంతమును నిరూపించియుండెను. రానురాను సంస్కృతభాష విరళప్రచారము కలదగుటవలన నదియు లోకమునకు సరిగ నుపకరింపకుండెను.

ఈ విషయమునంతను గమనించి, శ్రీయుత శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు మృదుమధుర శైలిలో "దివోదాసుడు" అను నొక నాటకమును రచించిరి. ఇందలి ప్రధాన నాయకుడు ప్రసిద్ధుడే.

ఇందు వైదికమతము సప్రమాణముగను సరళముగను నిరూపింపఁబడినది. తొలుత పూర్వమీమాంసాసిద్ధాంతము ననుసరించి, ఈశ్వరు నంగీకరింపఁ బనిలేదనియు, కర్మలవలననే సర్వము సిద్ధించుననియు, నిరూపింపబడినది. పిమ్మట, బాదరాయణసిద్ధాంతము ననుసరించి ఈశ్వరు నంగీకరింపవలయుననియు, ఆతనివలననే సర్వము సిద్ధించుననియు, నిరూపింపబడినది. కాగా వైదికమతమంతయు, సంగ్రహముగ నిరూపింపబడినదనియే చెప్పవచ్చును.

సావిత్రి, లలిత, మున్నగు గ్రంథములను రచించి లోకమునకు సుపరిచితులగు వీరినిగురించి, విపులముగ వ్రాయుట అనవసరము. వీరు సంప్రదాయానుసారముగ వేదాంతమును సద్గురువుల సన్నిధిని అభ్యసించినవారు. కాన వీరి ఈ నాటకము లోకమునకు ఉపకరించునని నా తలంపు.

## తర్క-వేదాంత సార్వభౌములు
## బ్ర॥ శ్రీ॥ మండలిక వేంకటశాస్త్రిగారు

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిలుగారిచే రచింపబడిన దివోదాస బిరుదాంకితుడగు రిపుంజయుని నాటకమును చాలవరకు చదివినాను. నాతిదీర్ఘములగు నంకములచే సంధిసంధ్యంగములను చక్కగా కూర్చి, అపూర్వంబగు కథాసన్నివేశ మొనర్చిన వీరిచాతుర్య మెంతయు ప్రశంసనీయము. ఈ నాటక ప్రథమాంకమున ప్రాచీనసంప్రదాయసిద్ధరాజావశ్యకతనుగూర్చి అనేక యుక్తిప్రయుక్తులను చక్కగా ప్రదర్శించి, "క్షత్రియునకు క్షత్రియ ధర్మ"మను శ్రుత్యర్థమునకు నాటకమును ఉదాహరణము చేసిరి. ఈశ్వరాపేక్షలేక కర్మయే ఫలప్రద మను మతమును ప్రథమమున నిర్వహింపఁజేసి, యుత్తరభాగమున నీశ్వరావశ్యకతాసిద్ధాంతమును ప్రదర్శించి వీరి శాస్త్రీయపాండిత్యమును నాటకమునుగూర్చు నవ్యతను ప్రదర్శించినారు.

చదువరుల కీ నాటకము భక్తిజ్ఞాన వైరాగ్యములను కలిగించుననుటలో సందియము లేదు. వీరి రచనలు ధర్మప్రబోధకములై విరాజిల్లు చున్నవి.

ఈనాటకము రసికజనమానసాహ్లాదమును గూర్చుచు చిరకాలము వర్ధిల్లుగాత యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

# శ్రీ వ్యాకరణాచార్య కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు బందరు

దివోదాస నాటకమును రచించిన బ్రహ్మశ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు మాకుఁ జిరపరిచితులు. వీరు వైదిక కుటుంబమున జన్మించి సూత్రభాష్యాది గ్రంథములను నియమముతో గురువుల సన్నిధిని నధ్యయన మొనర్చిన శ్రోత్రియులు. మరియు నుభయ భాషలయందు గ్రంథములను రచించుటయందు నేర్పరులు. వీరు రచించిన సావిత్రి మొదలగు నాటకములు జగద్విదితములు. వీరు రచించిన దివోదాసనాటకమును నాకందఁ జేయఁగ నచ్చటచ్చటఁ జూచితిని. దివోదాసుని యీశ్వరాదిదేవతానిరాకరణమును వీరు సప్రమాణముగ సమర్థించు సందర్భమునఁ బూర్వమీమాంసకసిద్ధాంతమును గరతలామలకముగ నిరూపించుటఁజూడఁ గర్మమీమాంసకసిద్ధాంతమునందు వీరి కుండు నభినివేశము విదితమగుచున్నయది. కర్మమీమాంసకసిద్ధాంతమునందు శ్లో॥ విగ్రహో హవిషాంభోగ ఐశ్వర్యంచ ప్రసన్నతా ఫలప్రదాన మిత్యేతత్ పంచకం విగ్రహాదికం॥ అను శ్లోకోక్త విగ్రహాది పంచకము, "ఫలదేవతయోశ్చ" అను నధికరణమునందు నిరాకరింపబడినది. సగుణముగ నాచరింపఁబడిన కర్మయే ఫలప్రదమగుచుండఁ గర్మఫలప్రదాతయగు నీశ్వరు నంగీకరించి కర్మవైగుణ్యము నంగీకరించుట యనుచిత మని కర్మమీమాంసకుల యాశయము. దివోదాసుఁడు ఈశ్వరనిరాకరణము నంగీకరించినచో నాస్తిక్యదోష మాపాదించు నను భయముచే బ్రహ్మమీమాంసకసిద్ధాంతానుసారముగ నీశ్వరు నంగీకరించియు ద్వంద్వ ప్రభుత్వ మనుచిత మను హేతువుచేఁ గర్మభూమినుండి నిష్కాసన మొనరించి కర్మమీమాంసకసిద్ధాంతమునకు మెఱుఁగు పెట్టినాఁడు. కర్మమీమాంసక సిద్ధాంతముయొక్క గూఢాశయముగూడ నీశ్వరవిగ్రహాదుల నంగీకరించుటయే కనుకనే దివోదాసుని చరమావస్థయందుఁ బుణ్యకీర్తి భూమికను ధరించిన శ్రీమహావిష్ణువు ధర్మానుష్ఠాన ఫలరూపమగు బ్రహ్మలోకావాప్తి ననుగ్రహించినాఁడు. ఇట్టి గూఢాశయములఁ దమనాటకమునందుఁ బ్రతిబింబింపఁజేసిన శ్రీ శాస్త్రిగారి మీమాంసాద్వయసిద్ధాంతవిజ్ఞానము మిగులఁబ్రశంసనీయము. మరియు నీనాటకము తమ సద్గురువులగుఁ దర్కవేదాంతవిద్యాపారీణ బ్ర॥ శ్రీ ముదిగొండ వేంకట రామశాస్త్రిగారికి గురుదక్షిణగాఁ గృతిసమర్పణ మొనర్చుట గడు ముదావహము. ఇట్టిశాస్త్రీయసిద్ధాంతరహస్యములను నాటకరూపమునరచించి భక్తిపూర్వకముగ గురుపాదసన్నిధిని సమర్పించిన బ్ర॥ శ్రీ॥ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారిని శ్రీవిశ్వేశ్వరుఁడు సర్వశ్రేయస్సులచే ననుగ్రహించుఁగాత.

# శ్రీ విద్వత్కవిసార్వభౌమ-అభినవ పండితరాజ,
# విద్యావాచస్పతి-విద్యత్కవిరత్నేత్యాది బిరుదదశకాంచిత
# బ్ర॥ శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు
## ముంగండ అగ్రహారం.

ఆస్థ్రి విద్వత్కవివరేణ్యా! శ్రీరామసచ్చిదానందశాస్త్రి వతంసా!!

తమ దివోదాస నాటకరాజము నామూలచూడముగ బరిశీలించితిని-నాటక లక్షణముల నిందుకేనియు వీడక సందర్భశుద్ధితో సహృదయహృదయాహ్లాదకముగ గాశీఖండగతదివోదాసచరిత్రమును జక్కగ వర్ణించిరి-హృదుమధుర గంభీర వచనము లతో నన్ని సందర్భములలోను రసపుష్టి నొనర్చియుండిరి-ఆధునిక రాజకీయ విధానము లను హృదయమున నిడికొని ధర్మాభినివేశమహిమను శ్రీ లక్ష్మీనారాయణాదుల ప్రచ్ఛన్నవేషధారణాదిసామోపాయప్రయోగములద్వారముననే యీశ్వరద్వేషనివర్త నము నొనర్చుటతోఁ బ్రకాశింపఁజేయుచు దివోదాసునికి పదచ్యుతి మున్నగునవి లేకుండ విజ్ఞానమార్గము ఘటించిన రీతిని బాగుగ నిరూపించిరి-వేదచోదితధర్మమార్గైకశరణునకైన నీశ్వరద్వేష మిక్కట్టులను గలుగజేయునని వెల్లడి యగుచుండ ధర్మద్వేష దేవద్వేషములు రెండును ఘటించినపుడు దేశాధినేతలకును దేశమునకు నెట్టి యిక్కట్టులు ఘటించునో యీ చరిత్రము స్పష్టము చేయుచున్నది-కలివికృతిమ స్త్రీపురుషులకుగూడ నీ గ్రంథము కొంతవరకైన యీ యీ వికృతులను బోనాడి స్వధర్మనిరతిని గలుగ జేయునని నా యభిప్రాయము-ఇట్టిదివ్యగ్రంథమును రచించినందులకు మిక్కుటముగ విబుధవరేణ్యులందరు నభినందింతురని నా విశ్వాసము-బంగారమునకు బరిమళమబ్బి నట్టులు తమ యీ దివ్యకృతికన్యకకు వివిధ తత్త్వపరిజ్ఞానపారమ్యము నొంది స్వధర్మా నుష్ఠానమున మునితుల్యులై తత్త్వజ్ఞానమున జనకాదితుల్యులై యౌపనిషదపురుషులు గానే యెన్నదగిన మా మిత్రవరులు బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రులవారు భర్తలగుటయు, ధర్మోద్ధారమునకే రేయింబవళ్ళు నిరంతరదీక్షతోఁ బాటుపడుచు స్వీయ ద్రవ్యము నందులకై సర్వదా వినియోగించుచు సామరస్యముతో లక్ష్మీసరస్వతీవల్లభులఁ బాలించుచు స్వీయకీర్తికాంత నన్నిదిశలకుఁబంపి నటింపజేయుచున్న యన్వర్థ బిరుదాం కితులగు బ్రహ్మశ్రీ విసపాముల లక్ష్మీనరసింహముగారు స్వీయద్రవ్యవినియోగమున నీ దివ్యకృతిని బ్రకాశింపజేయుటయు నన్నియంశముల నీ కృతికన్యక ధన్యులైనందుల కెంత యభినందింపవలెనో మా లేఖిని వ్రాయలేకున్నది-ఇట్టి కృతికన్యకం గన్న తాము ధన్యతము లని యెంచుచున్నాను.

## అద్వైత ప్రబోధక సంఘాధ్యక్షులు, శ్రీ శంకరాచార్యోత్సవ సభాకార్యదర్శి

## బ్ర. శ్రీ. బి. నారాయణభట్టుశాస్త్రిగారు - హౌసుపేట

మహాశయా! రసభరితమైన తమ దివోదాస నాటకము నామూలాగ్రము చదువగా నాకు గలిగిన ఆనందము నింతని చెప్పుటలో అతిశయోక్తిలేదు. పంచాశత్ఖండ మండిత జగత్ప్రసిద్ధ స్కాంద పురాణములోని కాశీఖండాంతర్గత దివోదాస చరిత్రమును, పఠితల యొక్క హితాతిశయమునకై నాటకరూపముగా రచియించి తమ నిరర్గళకవితాధోరణిని లోకులకు దెలియపరచుట కాక ఐహికాముష్మికవివేకోత్పాదకకర్మబ్రహ్మకాండ సామరస్య సంపాదన సమర్థమనుటలో సందేహములేదు. సావిత్రీ నాటక లలితనాటక రచయితలగు బ్రహ్మశ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిలవంటి లోకోపకారదక్షులచే జను లుద్ధరింపబడుదురని నా యభిప్రాయమును ఆనందముతో వెల్లడించుచున్నాను. ఇట్టి రచనాకృషి చేయువారు విరళులని చెప్పవచ్చును.

### శ్రీ వ్యాకరణాచార్య

## గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు - నెల్లూరు.

దివోదాసు అను రూపకమున నాటకరచనమునకు ఆవశ్యకమగు "కథాసంవిధానకము పాత్రౌచిత్యము రసపోషణము మున్నగు విషయములు సముచితముగ నిర్వహించుటచే కవయిత శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు తమ యసాధారణ ప్రతిభను వెల్లడించిరి. నిర్వహణసంధియందు అద్భుతరసపరిపోషణ మిందు మిక్కిలి శ్లాఘ్యము. రూపకరచనమునకు ప్రధానమగు కాంతాసమ్మితముగ జేయవలసిన త్రివర్గబోధనమున ఈ కవయిత పోయిన పోకడ గణనీయము.

పురాణప్రసిద్ధమగు ఇతివృత్తమును గ్రహించి స్వప్రతిభావిశేషమున అన్ని విషయముల సుబోధముగ ఈ నాటకమును రచించుటచే ఈ కవి క్రమముగ నాంధ్రభాషామతల్లికి ఇట్టి గ్రంథరూపమగు అమూల్యాలంకరణములను చిరకాల మర్పింపగలడని నమ్ముచున్నాడను. గ్రంథముద్రణమునకు సాహాయ్యము జేసిన వదాన్యశిరోమణులు ధర్మైకనిరతులు బ్రహ్మశ్రీ వింజాముల లక్ష్మీనరసింహముగారి కీర్తిచంద్రికలు ఇట్లే చిరకాలము బహుగ్రంథముద్రణముచే పరమేశ్వరానుగ్రహమున ఆధాత్రివనికి సంతసమును గూర్చుగాత.

### బాలవ్యాస, వ్యాకరణాచార్య

## బ్ర॥ శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు-పిఠాపురం

మీరు పంపిన మీ దివోదాసు నాటకమును జూచితిని. చక్కనిశైలి, ఇతివృత్తము గలిగియున్నది.

ఈశ్వర నిరాకరణము జేసినరాజు తానెంత పరిపాలనసమర్థత గలవాడైనను తుదకు నిర్వీర్యుడై ప్రజా విద్వేషమునకు పాలగుననియు, దేవతానుగ్రహము తొలగినపుడు లోకులకు ఈతిబాధలు వ్యాధులు మున్నగు మితిమీరిన అనర్థములు అలముకొనుననియు, స్త్రీ పురుషుల చిత్తవృత్తులు వ్యత్యస్తమై నీతి దప్పియుండుననియు, ఈశ్వరానుగ్రహమును సంపాదించుకొనునపుడీ యనర్థములన్నియు నివర్తించి లోకస్థితి చక్కబడుననియు, మొదలగు విషయములు పాత్రౌచిత్యముతో లలితముగా నిరూపింపబడినవి.

రసావహమైన యీ నాటకము హృదయాకర్షకమైయున్నది.

విద్వాన్, కవితిలక, కవితా విశారద,

## శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు

భారతకథ దుష్యన్త చరిత్రమును దృశ్యముగ నొనర్చుటకై కాళిదాసు కొన్ని మార్పుల మనోహరముగ నొనర్చినట్లే శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిలుగారును శ్రీనాథుని దివోదాసు కథను శ్రవ్యముగా నున్నదానిని తీర్చి దిద్ది దృశ్యముగ నొనర్చి పండితప్రశంసకుం బాత్రులైనారు.

అతిగహనమైన శాస్త్రవిషయమును ప్రజలకు సుబోధక మగునటుల నాటకముగ రచించుట యందలి శ్రమ సామాన్యము కాదు. కాళిదాసంతవాఁడు "ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్" అన్నాడు. కావుననే ఈకవిగారు పండితుల మెప్పు గాంచుటకై కాబోలు కవులకుఁ బండితులకుఁ దమకావ్యము నంపినారు. కావ్య పరమప్రయోజనమగు మోక్షమే యిందుఁ బ్రతిపాదింపఁబడినది. 'ధర్మజిజ్ఞాసామూలమెల్ల లౌకికము సత్సంపత్తి తద్బ్రహ్మజిజ్ఞాసాసాధ్య'మని దివోదాసునా దింగోనే కవి సూచించినారు. నిష్కామకర్మము మోక్షప్రాప్తిహేతు వని దశమాంకమున 119 వ పుటలో విష్ణుమూర్తి దివోదాసుని చెయ్వుల సమర్థింపఁజేసెను."

"దివోదాసా! ఇదియే తెలియదగిన ధర్మసూక్ష్మము. నీ నీశ్వరుని బహిష్కరింప కున్నను స్వార్థరహితమగు నీ ధర్మపాలనము, నీ యోగనిష్ఠ, తపోబలము, సర్వస్వము ప్రజారక్షణకై వినియోగించితివి. ఆ ప్రజలు, దేశము, కాలము, సర్వము నేనే. కావున నాకే చెందినవి. దాననే నేనెంతయు సంతృప్తి నందితిని."

దీనిని విని దివోదాసు విష్ణువువలన దత్త్వోపదేశము కోరగా 'నీ వారణాసీక్షేత్రమున నుపదేశ మొసంగింప క్షేత్రపతి విశ్వనాథుడే యర్హుఁడు' అని విష్ణుమూర్తి చెప్పి యట్లు చేయించెను. గోచరమగునదియు దృశ్యమని, ధ్యానింపఁజేయు నాపియే ద్రష్టయని ఇట్టి నిరతిశయానందాత్మక దనిర్వికల్పసమాధి నోలలాడి నిఖిలవేదాంతప్రతిపాద్యమగు తత్త్వరహస్యమును గాంచెను.

ఈ మహాత్మ్యమునకు కృతిభర్త నేకటరాయశాస్త్రిగారగుట కృతి మిక్కిలి రాణించినది. కృతి చిరస్థాయియై విశ్వవిద్యాలయముల వెలయుఁగాత.

## న్యా య వే దా న్తా చా ర్య

## బ్ర॥శ్రీ॥ మద్దులపల్లి మాణిక్యశాస్త్రిగారు, విజయవాడ.

ఈ దివోదాస నాటకమును నేను ఆమూలాగ్రము అక్షరశః సావధానముగా గుణదోషపరిశీలనదృష్టితోఁ జూచితిని. కావ్యసంపూర్ణలక్షణములకంటె నాటకమందు విశేషముగా ఆయా పాత్రల ఔచిత్యము, రసపోషణ విశేషముగా చేయవలసియున్నదని విజ్ఞులకు తెలిసినవిషయమే. అందుచేతనే "నాటకాంతం కవిత్వం"మని కవిత్వమునకు నాటకరచనయే పరమావధి యని ఆర్యోక్తి చెప్పుచున్నది. ఈ దివోదాస నాటకమందు ఔచిత్య, రసపోషణలు, పాత్రధర్మములు, చక్కగా, అలంకారశాస్త్రమున కనుగుణముగా, ప్రాచీన సంస్కృతనాటకముల కవిరుద్ధముగా ప్రతిపాదింపబడినవి. ఇందు ప్రతిపాదింపబడిన చరిత్ర అతి పవిత్రమైనది. అందలి పాత్రల నామస్మరణమే అత్యంత పవిత్రదాయకమని స్పష్టపడుచున్నది. ఈ నాటకరచయితలైన శ్రీ సచ్చిదానందశాస్త్రిగారికి పూర్వోత్తరమీమాంసాసిద్ధాంతములయందు, రాజనీతి మొదలగు లోకవ్యవహారములయందు అనుభవానుభవమైన ఉన్నతమైన పాండిత్యమున్నదని నాందీ శ్లోకము మొదలు కొంత భాగము చదువగనే స్పష్టపడును.

మఱియు ఈ నాటకము భారతీయులమైన మనకు ఈ చరిత్రద్వారా మన ప్రాచీనులయొక్క ఔన్నత్యమును, ధర్మపరతను సూచించుచు, నాటకపద్ధతిని అతిసులభముగా తెలియజేయుచున్నది. ఈ నాటకమును చదివినమాత్రముచేత నాటకమర్యాదను చక్కగా తెలుసుకొనవచ్చును. తత్రాపి విద్యార్థుల కత్యంతోపయోగకరమగుటచే పాఠ్యగ్రంథముగా కళాశాలలయందు నిర్ణయింపవలసినదని విద్యాభిమానుల కం కరంబునకు కోరుచున్నాను.

ఇదియునుగాక ప్రబోధచంద్రోదయ నాటకములో నాటకపద్ధతితో తత్త్వమును ప్రతిపాదించినట్లు ఈ నాటకముకూడ అంతకన్న సులభమైన పద్ధతితో తత్త్వమును ప్రతిపాదించుచున్నది. దీనినిబట్టి శ్రీ శాస్త్రిగారికి శంకరసిద్ధాంతము చక్కగా నారూఢమైనదని పూర్వమీమాంసాశాస్త్రము ఇంతవరకు గ్రాహ్యమని, పిమ్మట ఉత్తర మీమాంసాశాస్త్రము గ్రాహ్యమని చక్కగా విదితమైనట్లు, దీనినిబట్టి స్పష్టపడుచున్నది.

మరియు మహాకవి భవభూతి విరచితమైన మాలతీమాధవనాటకమందు పది అంకములలో స్పష్టముగా విషయమును ప్రతిపాదించినట్లు, శ్రీ శాస్త్రిగారు అట్లే ఈ దివోదాసు నాటకమందు పది యంకములలో విభాగముగా విషయమును స్పష్టముగా ప్రతిపాదించిరి. ఈ కారణములనుబట్టి, ఈ నాటకము పండితపాఠకులకు అత్యంత పరిగ్రాహ్యమగునని, విద్యార్థుల కత్యంత సాహాయ్యకమని, గనుక ఈ నాటకరత్నము చిరకాలము పాఠ్యప్రణాళికయందు విరాజిల్లుట కత్యంతార్హమైనదని నా దృఢవిశ్వాసము.

## సాహిత్యాచార్య, లాక్షణికశిరోమణి, సాహిత్య విద్యాభాషాప్రవీణ, శాస్త్రవిశారద

## బ్ర॥శ్రీ॥ జమ్ములమడక మాధవరామశర్మగారు, గుంటూరు.

కావ్యభాషను అనుసరించే కవి రచన కేవలము కథాప్రకటనకై కాదు. అందుకే అయితే అవే ఉన్నవి. మనోరసంలో విలువుం పొందని ఒకవిషయాన్ని పృథక్కరించుకొని కవి రచన ఆరంభిస్తాడు. దివోదాసు కాశీఖండములోనికథ. కాశీఖండకథలు అటు ఇటు ఎన్ని మెలికలు తిరిగినా గమ్యమును అందించుతూ ఉంటవి. ఆగమ్యము కాశీప్రశస్తి, శైవవ్రతనిష్ఠ. దివోదాసుకథ శైవక్షేత్రమాహాత్మ్యమును నిరూపిస్తుంది. ఈ దినాలలో మళ్ళీ ఆ మాహాత్మ్యకథనం అవసరమయినదని ఈ రూపకరచయిత భావించగా ఈ "దివోదాసు" గ్రంథసృష్టి వచ్చింది.

కవి కతిపయభావప్రభావితుడయినాడు. ఈ వయసులో పూర్వమీమాంసా రక్తికలగడం వలన ఈ గ్రంథంలో కొన్ని శాస్త్రీయవిషయాలకు కథార్హువచ్చింది. అధీత పూర్వమీమాంసులు వేదధర్మాభిలాషులు. ఒకప్పుడు వేదధర్మము భారతదేశానికి రూపంఇచ్చింది. ఈనాడున్నూ అదేరూపసంపద ఇవ్వాలికాని, అభారతీయంగా వచ్చిన, ప్రకృతదేశోపద్రవాలు, ప్రజాపాలనము, సర్వోదయకార్యక్రమము, స్త్రీల స్వాతంత్ర్యము పేరంటము, రూపమును, సంపదనూ ఇవ్వవని కవి నమ్మకం.

శంకరవిజయమన్న సంస్కృతకావ్యంలో విద్యారణ్యుడని పేరుపెట్టుకొన్న ఆ రచయిత విప్లుతలోకంలో కుమారిలభట్టు ధర్మవ్యవస్థను ఏర్పరచడం నిబంధించాడు. ఆ గ్రంథభావనానంతరం ఈ గ్రంథానికి ఈ కవి ఈ రూపం ఇచ్చారు. సచ్చిదానంద శాస్త్రి శంకరతత్త్వముపై అభిలాష కలవారు కనుక ఆ ఛాయను దీనిలో నిబంధించడానికి యత్నించారు.

ఈ దివోదాసురూపకంలో ధర్మవీరము ముఖ్యరసము. ఈ వీరస్థాయి ఉత్సాహం ఈశ్వరునిలో ఉంది. అతడు గ్రంథనాయకుడు. కాని సచివాయత్తసిద్ధి. ఆ సచివుడు బ్రహ్మ. సకలతంత్రమును బ్రహ్మ నిర్వహించాడు. రిపుంజయుడు ప్రతినాయకుడు. బ్రహ్మ పన్నుగడలో అతడు మెతకపడి లొంగడము అతని దివోదాసుగా మార్చింది. ఈశ్వరునిపక్షాన బ్రహ్మ నిశ్చయించిన ఒక ధర్మనిశ్చయం మొదటిబీజం. అది మధ్యలో అనుకూలంగా వ్యాపించి తుదకు నిర్వాహం పొందింది. ఈవిధంగా ఈ కావ్యాన్ని చూస్తే ఇది ఒకవిధమయిన లక్షణసమన్వయ శోభ కలదని గుర్తించవచ్చు. ప్రతినాయకుని గుణవిశేషాలను విశదంగా వర్ణించి అతని జయాన నాయకోత్కర్ష చెప్పడంకూడా ఒకరీతి ఉన్నది కాబట్టి ఆ దృష్టితో దీన్ని సమన్వయించుకోవచ్చు.

దీన్ని ఎవరయినా రంగభూమికి దింపితే నావంటివాళ్ళకు నిద్రలేకుండా చూడాలని కుతూహలం ఉంటుంది. నటకాములు ఈ పని చేయవచ్చు.

## ఆంధ్ర క్రైస్తవ కళాశాలాంధ్రోపన్యాసకులు

## బ్ర. శ్రీ పుచ్చా వరదరామకృష్ణయ్యగారు, ఎం. ఏ., గుంటూరు.

బ్రహ్మశ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారిచే రచింపఁబడిన "దివోదాసు" అను నాటకమును సంపూర్ణముగఁ జదివితిని. గ్రంథకర్త విద్వత్కవి. మహానదీప్రవాహముంబోలు వీరి కవిత్వము సహజమగు ధారాశుద్ధి కలిగియున్నది. పాత్రపోషణము, రసపుష్టి, కథావిధానము, నాటకమునం దెంతో నైపుణ్యముతో నిర్వహింపఁబడినవి.

మీమాంసాశాస్త్రపాండిత్యము కవికి విశేషముగఁ గలదు. పూర్వోత్తర మీమాంసాశాస్త్ర సంప్రదాయములను నాటకమునందు సామర్థ్యముతో నిరూపించి కవి కృతకృత్యులైరి.

ఇట్టి సద్గ్రంథమునకు సాహాయ్య మొసంగిన బ్రహ్మశ్రీ వినపాముల సీతారామయ్యగారి ఔదార్యము ప్రశంసార్హము.

ఈ నాటకమును విశ్వవిద్యాలయమువారు పాఠ్యగ్రంథముగ నియమించి భాషాసేవ యొనర్చెద రని విశ్వసించుచున్నాను.

## బ్రౌ శ్రీ విద్వాన్ జి. జె. సోమయాజి బి. ఏ., ఎల్. టి., గారు

### రీడరు, ఆంధ్రశాఖాధ్యక్షుడు, ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తు, విశాఖపట్నము.

దివోదాసు నాటకమును చూచితిని. ప్రాచీనకథను కొన్ని నవీనచ్ఛాయలతో కలిపి హృదయంగమముగా రచియించితిరి. దివోదాసు పరిణామము చక్కగ నిర్వహింపఁబడినది. శైలి గ్రాంథికము, రమ్యముగనున్నది. కథ చమత్కరింపఁబడినది.

మీ గ్రంథమును పాఠ్యగ్రంథ నిర్ణాయకసభవారు ఆమోదింతురుగాక.

## బ్రౌ. శ్రీ విద్వాన్ సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు, బి. ఏ.,

### నిజాం కళాశాలాంధ్రోపన్యాసకులు, హైద్రాబాదు.

దివోదాసనాటకము నాంది మొదలుకొని భరతవాక్యాంతము దీక్షగ చదువుకొంటిని. ఆద్యంతము నిర్భరరసానందమున నోలలాడితిని. ప్రాచీన వస్తు సామగ్రిని ఈ తీరున సూక్ష్మాతిసూక్ష్మముగ నాధునిక సంఘమును బరిశీలించి దేశకాల పాత్రములను గుర్తించు సమతను సమ్యగ్దర్శనమున కావ్యరాజమును నిర్మించుట మీకే తగినది. మీరు నాటక రచనమున సిద్ధహస్తులు. నిశ్చయముగ నీ నాటకము విశ్వవిద్యాలయములలో ప్రతి విద్యార్థియుఁ జదివి తమ భావవేగములను సంస్కరించుకోదగిన తీరులు పెక్కు లిందుగలవు. ప్రజాస్వామికరాజ్యముల పాలనాతంత్రముల స్వరూపస్వభావముల ఛాయ లిందు ఆనుషంగికముగఁ బొందింప

బడి సర్వులయాదరమును బడయదగియున్నది. విశ్వవిద్యాలయాధికారు లీ నాటక ప్రాముఖ్యమును గమనించి విద్వాన్, బి. ఏ. తరగతులకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించుచో కవి శ్రమ గుర్తించినవా రగుదురనుట యటుండ విద్యార్థిలోకమునకుఁ బెక్కువిధముల మే లొనర్చినవారు కాఁగలరని నా యాశయము.

## 'సరసకవి' 'కవిశేఖర' 'సాహిత్యరత్న'

## బ్ర. శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు, అడ్వొకేటు.

### కవితా నికేతనము, అత్తితోట అగ్రహారము, నెల్లూరు.

స్కాందపురాణాంతర్గతమైన కాశీఖండములోని దివోదాసచరిత్రమే యీ రూపకమున కాధారమైన ప్రఖ్యాత వస్తువు. పంచాధికాంకములు కలదగుట నిశ్యాది మహానాటక మనిపించుకొనవలసియున్నది. నాయకుఁడు మహాకులీనుఁడు - ఔజ్జ్వల్యభాగ్య తేజస్విత్వ వైదగ్ధ్య మహామహిమాఢ్యుఁడు - తన ప్రయత్నమునుండి చలింపనివాఁడు - మహాసత్త్వుఁడే - 'ఏనహామున్ రాత్రియు సర్వదేవచయగామిన్ వ్యాపింపనే యంతటన్?' అని సర్వదేవతాస్వరూపుఁడై ప్రజాపరిపాలనము నిర్వహింప సమకట్టినవాఁడు. లోక కల్యాణప్రవీణుఁడై ప్రపంచమును బరిపాలింప వలయునన్న పట్టుదలతోఁ బ్రవర్తించినవీరుఁడే దివోదాసుఁడు. 'సుఖంబుఁదపంబును రోగసంపదకై దనువును సైతముకై వదలి ధారుణి నోమనె?' ఒక్కని శాసనమునసే రాజ్యము నిర్వహింపఁబడవలయుననియు, అన్యాధికారములు అడ్డుచెప్పుటలు అభిప్రాయనిరోధములు ప్రభుత్వమునకుఁ గాని పనులనియు విశ్వసించి విశ్వనాథుని వారణాసి వెడలించు టొక్కటి యీతనిదోసము. కాశీవియోగ సంతప్తులగు అన్నపూర్ణా విశ్వనాథులను బాసటగావచ్చిన లక్ష్మీనారాయణులు దేవేంద్రాదులు దివోదాసుని పదభ్రష్టుం గావించుటకు పన్నుగడ పన్ని తమ కార్యము సాధించుకొందురు.

దివోదాసుని బుద్ధి లోకకల్యాణప్రవణమేయయ్యు వానికి ఈశ్వరభక్తియందు విశ్వాసమేలేదు. కర్మఫలములగు పుణ్యపాపములే సుఖదుఃఖనిర్వాహకములని వాని ప్రత్యయము. ఈ ప్రత్యయమే వాని పదచ్యుతికిఁ గారణమైనది. ఒకవిధముగా నీతని ధీరోదాత్తుఁడని యనవలయును. ఈ వీరుని యద్భుతకార్యముల చిత్రణముతో వెలసిన యీ రూపకములోని యంగిరసము వీర మనవలయునుగాని, యోగినీపరికల్పిత శివ శారదా విలాసములయం దుత్పన్నములైన హాస్యశృంగారసములు ఒక్కటి రెండుచుట్లు ఎక్కువైనవా యన్న సంశయము నాకొదవినది.

సింహావలోకన మొనర్తుమేని, యీ రూపకకథాసంవిధానము నిపుణముగా నిర్వహింపఁ బడినదనుట నిశ్చయము. చతుర్థాంకములోని యనంగమోహినీ, దివోదాసుల యేకాంతగోష్ఠి రసవ త్తముగాఁ జిత్రింపఁబడినది. నవమాంకములోని స్త్రీస్వాతంత్ర్యోద్యమము నుద్దేశించిన యోగినీశివశారదావిలాసము ప్రౌఢహాస్యప్రపూర్ణమై నేఁటి

యాంధ్రనారీలోకమునకు గుణపాఠము నేర్పునదే కాక, ఇదానీంతనభారతీయనాగరిక ప్రపంచమున కంతటికిని ఆచార్యకమైయున్నది. నాట్యకీయపద్యవిద్యలో సచ్చిదానందుఁడు కృతహస్తుఁడుగదా! ఇంక మనకుఁ గావలసిన దేమున్నది? ఈ కవి దీర్ఘాయురారోగ్య భాగ్యములతో వర్ధిల్లి యింకను రసవత్తరములైన రూపకముల సృజించి తెల్గువారి కిచ్చునట్లు జగన్మాతయగు సావిత్రీదేవిని వేఁడుకొనుటయే మిగిలినపని.

## బ్ర. శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ.

కేనోపనిషత్తులోని "బ్రహ్మహ దేవేభ్యో విజిగ్యే తస్యహ బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త త ఐక్షన్తాస్మాకమే వాయం విజయోఽస్మాకమే వాయం మహిమేతి" ఇత్యాదికథను దివోదాసు నాటకము స్మరింపఁజేయుచున్నది. అగ్నివాయ్వాదుల యహంకారము పరమాత్మముందు మోకరింపవలసి వచ్చినరీతి నుపనిషత్తు వర్ణించినది. ధర్మాహంకారోద్దీపితుఁడై పరమేశ్వరుని ధిక్కరించిన దివోదాసుఁడు తిన్ననిమార్గమునకు మరలుటను శ్రీ సచ్చిదానందశాస్త్రిగారు రమ్యముగా వర్ణించిరి.

మోక్షపథమునం బ్రసన్నులై విహరించువారికి ధర్మాస్తిక్యేశ్వరాస్తిక్యములు రెండు నొక్కటనియు, దైవధిక్కారము చేసిన శుష్కకర్మ కాని, ధర్మవిరుద్ధాచరణోపేతమైన భక్తి కాని రాణింపవనియు నార్షసిద్ధాంతము. కర్మభక్తుల నుచితరీతిని సేవించి, వేదాన్తవిజ్ఞానసుసంస్కృతాంతరంగులైన శ్రీ శాస్త్రిగారీ రీతిలో నన్యతరాభావమున నేకతరమై సార్థ్యమును గుర్తించి సమకాలికులకుఁ దరణసాధనమును జూపుటకై యీ నాటకమును బ్రసాదించియున్నారు.

బ్రహ్మానందములోనే కాక తత్సబ్రహ్మచారియైన కావ్యరసములోఁగూడఁ బ్రశస్తకృషి గావించిన శ్రీ శాస్త్రిగారి భావములు, వాక్కులు రసభరితములై, యమృతోపమానములై యలరారుచున్నవనుటలో నాశ్చర్యములేదు. వీరు చిరకాలము క్రిందటనే సుప్రసిద్ధమైన "సావిత్రి" నాటకమును రచించి, సకల రసిక హృదయావర్జకముగావించి, యాంధ్రనాటకకర్తలలో నగ్రశ్రేణి యందు స్థానము సంపాదించిరి. ప్రకృతనాటకమందలి భాషాశయ్యేతివృత్తపాత్రపోషణాదు లన్నియు లోకోత్తరములై, నిర్దుష్టములై, యౌచిత్యవిలసితములై యుదాత్తములై యుండుటచే నిది ప్రదర్శితమైనప్పుడు ప్రేక్షకసామాజికుల నానందపరచుటయే గాక శ్రద్ధగా పఠించువారికి భాషాజ్ఞానము, నాటకమర్యాదాపరిచయమును గల్గించునదై కళాశాలావిద్యార్థులకుఁ బాఠ్యగ్రంథముగా నుండుటకు సర్వవిధములఁ దగియున్నది.

## మహాకవి శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు

## సికిందరాబాదు

సమాదరపూర్వకముగా విమర్శనార్థమై పంపబడిన యీ కృతి కార్యస్థాన మలంకరించినది. ఈ నాటకమును రచించినవారు బ్ర॥శ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు వీ రీవఱకే సావిత్రీ, లలితా, బృందా, ప్రభృతి నాటకములను రచించి కవిపండితపామరులను మెప్పించి బహుబహుమానముల నంది ప్రశంసలఁ గన్నవారగుటచే వీరినిగురించి ప్రత్యేకించి వ్రాయఁ బని గానరాదు.

ఈ దివోదాస నాటకము పది అంకములుగలది. ఇది యీనాటి కన్నులమాదిరి కల్లబొల్లిమాటలతోఁ బచ్చిసింగారముతో, హద్దుపద్దులులేని భావములతో, నీతి నియమములను విడనాడి రచింప బడినదిగాదు. ఇందు రాష్ట్రమునందు రాజు లేకపోయినప్పుడు గలుగు కష్టనష్టములు, రాజెటువంటి సమర్థుఁడుండవలెనను విషయము, పాలకుని ధర్మములు, ప్రజాధర్మములు వివేకినాయకులులేని సంఘములస్థితి, స్త్రీల కెంతవరకు స్వాతంత్ర్యముండవలె? ఎంతవఱకున్న దేశము సుఖముగానుండును? ప్రజలకు ప్రభువులకు నుండు పరస్పరసంబంధము, దైవ, పండిత, తిరస్కారజనితహానులు, ప్రజారాజ్య మననేమి? దానివలన గలిగెడి చిక్కులు, కేవల కర్మసిద్ధాంతములోని మంచిచెడ్డలు మున్నగున వనేకము చాల సులువుగా మనోహరముగా వర్ణింపఁబడినవి. వేదాంత విషయము సుగమముగా బోధింపబడినది. ప్రాచీనార్వాచీన రాజనీతి సామరస్యముగూడ నందందు సమకూర్పఁబడినది. సలక్షణకవనము, సరళశైలి, సరసభావములు చక్కని దేశీయ జాతీయములుగలిగి ధర్మప్రబోధకరమై యానందకరముగానున్నది. ఈ నాటి నాటకములలో నిట్టిది పొడగట్టదు. విద్యార్థు లిందుఁదెలిసికొనదగిన విషయము లనేకములు గలవు. స్త్రీలు, నవనాగరికులు, నాయకులు, కర్మఠులు ముఖ్యముగాఁ జదువదగినదని మా భావము.

(దివ్యవాణి)

# పాత్రలు

## పురుషులు

దివోదాసు
విశ్వనాథుఁడు
విష్ణువు
బ్రహ్మ
ఇంద్రుఁడు
బృహస్పతి
గరుత్మంతుఁడు
వీరభద్రకుమారులు
గణపతి
భృంగి
విష్ణుమిత్రపండితుఁడు
రామశర్మ
సేనాపతి
భటుఁడు
పౌరులు

## స్త్రీలు

అనంగమోహిని
అన్నపూర్ణాదేవి
లక్ష్మీదేవి
గౌరీసోమిదేవమ్మ
లక్ష్మి
శివశారద
గిరిజ
వకుళ
చేటి

★

# నాంది

శా. శ్రీసౌఖ్యంబు లనంతసంతతులుగాఁ జెల్వారనీ! ధర్మజి
జ్ఞాసామూలక మెల్ల, లౌకికము, సత్సంపత్తి తద్బ్రహ్మజి
జ్ఞాసాసాధ్య మటంచు దాని నెవఁ డాసల్ సేయునో, యా చిద
భ్యాసుల్ విశ్వమయాత్ముఁ జేయు శివు, నే ధ్యానింతు నశ్రాంతమున్

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి, పుష్పాంజలి నిడి]

సూత్ర : విబుధవరవిలసితమై కవిరాజవిరాజితమై క్రిక్కిరిసియున్న యీ మహాసభ నెట్లు సంతుష్టి నందజేయఁగలుగుదును? [యోజించి, తెరవంకఁ జూచి] మారిషా! ఇటురమ్ము!

మారిషు : [ప్రవేశించి, నమస్కరించి] ఆర్యా! పిలిచితి రెందులకు?

సూత్ర : ఈ సభ్యమహాశయుల నానందింపజేయుమార్గము నందుకొనఁ గలందులకు.

మారి : లలితకళావిశేషభాసురములగు నాట్యవిలాసములలో, బ్రహ్మానందసబ్రహ్మచారియగు కావ్యరసామృత మొసంగి, యెల్లర నానందవివశులఁ జేయు మీకు నేను మార్గ మందఁజేయుటయా?

సూత్ర : "బాలా దపి సుభాషితమ్" అను నార్యోక్తి వ్యర్థము కాఁగూడదు. ఇప్పుడు ప్రదర్శింపఁదగు నాటక మెయ్యదియా యని యాలోచించుచుంటిని.

మారి : బావా! దీని కాలోచన యేల? అన్ని యానందములకు మూలకంద మాత్మానందమే యని యెన్నిమాఱులు వచింపలేదు? అట్టి బ్రహ్మానందమే భరతభూలక్ష్మికి మకుటాయమాన మనియు, సర్వోత్కృష్టమనియు, నదియే ప్రాణికోటి కంతటికి జీవగఱ్ఱ యనియు నెల్లరెఱుంగఁదగు నాటకమును నటింపఁజేసి, నీప్రజ్ఞావిశేషమును లోకమునకుఁ జాటవలయును.

సూత్ర : మంచిది. కాని మూలములేని టీక యుండునా? మారిషా! అట్టి యుత్కృష్టనాటక మేది?

మారి : కలదు.

సూత్ర: ఏది? చెప్పుము.

మారి :

మ. పటుమేధానిధిఁ బండితప్రవరుఁ దత్త్వజ్ఞుఁ, స్వధర్మాధ్యుఁ బ్రా
కటశీలుఁ, ముదిగొండవంశమణి వెంకట్రామశాస్త్రిఁ, మహో
త్కటభక్తిఁ భజియించి తత్కరుణ నందన్, సచ్చిదానందుఁ, డా
దటఁ గావ్యంబు రచించి, దాని కధినేతన్ జేసె నా సద్గురున్.

సూత్ర : [సంతసముతో] సావిత్రీనాటకాద్యనేకగ్రంథకర్తయుఁ దత్త్వ
జిజ్ఞాసువు నైన శ్రీరాములసచ్చిదానందశాస్త్రిగారిచే గురుప్రసా
దముగ వెలయింపఁబడిన దివోదాసనాటకము, కంఠస్థమైనను
స్వగళగతమణిమాలను మఱచి వెదకువానికి జ్ఞప్తిచేయువడువున
నాగ్రంథమును జ్ఞాపకము చేసినందుల కెంతయు సంతసించు
చున్నాను. ఆకవికావ్యము లాంధ్రలోకమునకుఁజిరపరిచితములు.
ముంజేతికంకణమున కద్దమేల? మనప్రదర్శనమే యానాటకౌన్న
త్యము నెఱింగించును. ఇదిగో, ఇటు వినుము.

గీ. శిశిర మేచుఁచు సుమవాటి చెలువ మడఁపఁ,
దఱియుచు వసంతుఁ డా లతఁ దనుపునట్లు
కలఁగు భూసతిఁ దేర్పఁగా ఘనుఁ డొకండు
వరలు నీక రాజు, రాజశేఖరుని కృపను.

మారి : శివునియాజ్ఞలేక చీమయైనను గుట్టదనుమాట నిక్కము గాక
పోదు.

సూత్ర : అందుకనియే యీశ్వరాజ్ఞకై బ్రహ్మకైలాసమున కరుగు
చున్నాఁడు. ఇంక మనము పోయి, మనపనులలో జాగరూకులమై
ప్రవర్తింతము, రమ్ము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

ఓం.

శ్రీ సద్గురుశ్శరణమ్.

# దివోదాసనాటకము

## ప్రథమాంకము.

[కాశీపట్టణములోని విశ్వేశ్వరమందిరమున అన్నపూర్ణాసమేతుఁడై విశ్వనాథుఁడు సింహాసన మధిష్ఠించియుండ బ్రహ్మ, గణపతి సమీపమునఁ గూర్చుండి యుందురు. శూలపాణియై భృంగి దూరముగ నుండును.]

విశ్వ : చతుర్ముఖా! నీ ప్రయత్న మేమైనది? లోకస్థితి యెట్లున్నది?

బ్రహ్మ: ప్రభూ! ఏమని విన్నవింతును.

చ. అఱువదియేండ్లనుండి ప్రజ కన్నము లేదు తినంగఁ, ద్రావఁగా
దొరకదు నీరమేనియును, దూఱిరి కొండలు, చేరి రంబుధిన్,
దురితము లేఁగ వింక, నెటుఁదోఁపదు భూపతిఁ గాన మెందు, నో
వరద! శివా! మహేశ్వర! కృపన్ జగ మేలుము నీవె దిక్కుఁగన్.

విశ్వ : కమలసంభవా! భూపరిపాలనాయోగ్యుఁ డగు సుక్షత్రియుఁ డెందును గనుపడకుండెనా? అట్టివానిని నీవు సృష్టింపవలసియే యుండునా?

బ్రహ్మ: దేవా! లోకమంతయుఁ బరిశీలించితిని. సకలవిద్యావిశారదుండును, అణిమాద్యఖిలయోగశక్తిసంపన్నుండును, మిక్కిలి తపశ్శాలియు నగు మనువంశప్రదీపకుం డొక్కరుండు కానం బడుచున్నవాఁడు.

విశ్వ : అయిన నతఁడే యేల ప్రభువు కాఁగూడదు ?

బ్రహ్మ: కాఁదగినవాఁడే కాని,

ఉ. క్షాత్రము గల్గుమేటి గుణగణ్యుఁడు ధీయుతుఁడు రాజ్యమేలఁగాఁ
బాత్రుఁడగున్ రిపుంజయుఁడు, బాహుబలాన్వితుఁ; డన్యుఁ డెవ్వఁడీ
మాత్రమువాఁడు లేఁ; డతఁడు క్ష్మాపతి గానగుచో, మహేశుఁ డీ
ధాత్రి వసింపరా దనును; దారి గనంబడ దేమిసేయుదున్.

అన్న : పితామహా! దేవదేవుండగు విశ్వనాథప్రభువు సయిత మీ వారణాసిని వీడవలసి వచ్చునా ?

బ్రహ్మ: అది ప్రభువులే నిర్ణయింపవలయును.

విశ్వ : కమలాసనా!

చ. చెదరెడు గుండె మానవులు చెందెడు కష్టము లాలకింప, నెం
దొదవఁడు నేత; యున్న నృపుఁడొక్కఁడు నాకిటు లానవెట్టు, సా
గదు పరిపాలనం బతనిఁ గాదన, మృత్యుముఖంబునం బ్రజల్
వదలుటెగాఁగఁ దోఁచెడిని, వారిజసంభవ! యేమి తెల్పుదుర్.

విరించీ! ప్రస్తుతము కావలసినది ప్రజారక్షణము. దానికిఁగావల
సిన వాఁ డుత్తముఁడైన సుక్షత్రియప్రభువు. అట్టి సమ్రాట్టును
నిర్ణయించు నవసరమున నన్యవిషయము లంతగఁ బాటింపఁదగి
నవి కావు. మా కోఱకుఁ బ్రజలలో శాంతిని నెలకొల్పఁజాలు
బాహుబలవీర్యసంపన్నుని ధర్మాధర్మవిచారణాశీలుని సర్వాధి
నేతను జేయకుండుట యుక్తముకాదు. ఇంక నాలసించిన
లోకము బెగ్గిలక మానదు. చతురంగబలసమేతునిఁజేసి సకల
రాజవైభవములతోఁ జతురుదధివేలావలయితంబగు ధరాతలం
బున కెల్ల రిపుంజయుని జక్రవర్తినిఁ జేయుటయే మా యభి
ప్రాయము.

అన్న : ప్రభూ! రిపుంజయునకుఁ బట్టముగట్టు మనుట మీ రీ కాశీ
పట్టణమును వదలఁ దలంచుటయేగదా?

విశ్వ : అవును.

గణ : అంతటి యవసరము?

విశ్వ : ధర్మభ్రష్టమైన రాష్ట్రమునకు రాజులేని కొఱంతఁ దీర్చుటయే.

గణ : నిఖిలధర్మఫలరూపమగు మోక్షసామ్రాజ్య మెల్లర కొసంగు
నీ రాజశేఖరప్రభువుల, నీ పుణ్యరాశి యగు వారణాసి నుండ
రాదనుటకంటె ధర్మభ్రంశము, కష్టము వేఱొకఁ డుండునా ?
ఇంతటి వివేకశూన్యుఁడగు రాజు, రాష్ట్రమును బ్రజలను రక్షింప
నేర్చునా? ఔరా! ఏమి యీతని దురాగ్రహము.

ఉ. సాహసమెట్టిదో భువనజాలము సర్వసుపర్వపాళి న
వ్యాహతలీలఁ బ్రోచు ప్రభు; నాద్యుని నాగమవేద్యు, లోకవి
ద్రోహులఁగూల్చు విశ్వపతిఁ దోలఁ దలంచె రిపుంజయుం డహో!
లాహిరిఁ గొన్నవాఁ డితఁ డిలాతల మేలునె, మేలుఁగూర్చునే?

కాన నీతఁ డెంతమాత్రము ప్రజాపాలనమునకుఁ దగినవాఁడు కాఁడనియే నా యభిప్రాయము.

అన్న : ప్రభూ ! ఆనందవనవాసియై వివిధవిద్యావిశారదుం డగు రిపుంజయుండు చతుర్దశభువనాధినాథు లగు మీ శక్తిసామర్థ్యములు పరిగణింపక మిమ్ముఁ జటినుఁడి వెడలిపొమ్మనుటకంటె వేఱొకద్రోహ ముండనేరదు. ఇది యంతయు సర్వశక్తిసంపన్నుఁడనన్న యాతని దురహంకారముకాని యన్యముకాఁజాలదు.

విశ్వ : దేవీ! ఆత్మకార్యనిరతులకుఁ దత్కార్యాచరణమున నహంకార మలంకారము కావచ్చును.

అన్న : అది కాదననేరను. కాని యాత్మతపఃఫలదాతలని కూడ మిమ్ము విచారింపని యీతని యహంకార మలంకార మగునా ? అది దురహంకారము కాఁగలదు.

ఉ. చూడమె భూతలేంద్రులను, సొంపుగడింపరె, దేవతాదృతిఁ
బీడిరె, యేలరే వసుధ, విశ్రుతులై బహువర్షసంతతుల్,
వాడిమగం డితం డొకఁడె వచ్చెనె భూపతిగాఁగ, నెల్లరన్
బోడిమి దేల్చు నీశ్వరుని బొమ్మనునే? యిటనుండి యద్దిరా !

ఇంతియేగాక ప్రభుత్వము చేఁజిక్కకమును పే యవసరముఁజూచి మనల నంపఁజూచు నితఁ డింకఁ బట్టభద్రుఁడైన గండుమీఱి, దానవుల నైతము మఱపింపక మానఁడు. లోకముతోఁబాటు "తడఁబడఁడే నాఁటి కొక్కదైవము లేఁడే" యన్నమాట మనకుఁ గూడ వర్తింపకపోదు. ఏ హరియో, సిరియో, తోడ్పడక తప్పదు. కానఁ దేనె పూసిన కత్తివలె నున్న యీతని విషయము విచారించి ప్రభునిర్ణయ మొనర్చుట నా యభిప్రాయము.

విశ్వ : దేవీ! ఇంతదూరము విచారింపకుము. ధర్మచింత లేని కేవల రాజస తామసాహంకారులు రాక్షసులు. వారి కెన్నఁటికి నిష్కృతికలుగదు. అట్టివారు దురహంకారులు. ఈ రిపుంజయుని తపోబలవిద్యానీయమాదు లసమానములు. మిక్కిలి సాత్త్వికములు. అట్టి సాత్త్వికగుణసంపన్నుఁడు కాలవశమున నేఱమీఱినను సొట్టలువడిన బంగారుకలశము చక్కబడున ట్లాతఁడు స్వశక్తిసన్నగిలినఁబశ్చాత్తాపమునఁబరిశుద్ధుఁడైవివేకికాకపోఁడు.

గణ : ప్రభూ ! మీరెంత చెప్పినను బరమేశ్వరుని నిరసించువాఁ డెన్నఁడును లోకేశ్వరుఁడు కానేరఁడు. తన్మూలమున రాజానుమతమగు ధర్మమెల్లర కాత్మధర్మమై "యథారాజా తథా ప్రజా" యనునట్లు జనులందఱు నిరీశ్వరవాదులై లోక మింతకంటెను గష్టములపాలై మిక్కిలి శోచనీయము కాకమానదు. రిపుంజయాగమమునకు మృత్యుంజయుఁ డానందవనమును వదలుటయే ఫలమగును గాని యన్యము కానేరదు.

విశ్వ : కుమారా! రిపుంజయుఁడు నీవనుకొన్న వేదవిహితకర్మానుష్ఠానవిరహితులగు బౌద్ధులవంటి నిరీశ్వరవాదియు, శూన్యవాదియుఁ గానేరఁడు. "వేదవిహితకర్మానుష్ఠానమే సర్వము సమకూర్ప నీశ్వరుఁ డేల" యను మీమాంసకుఁడగు శుద్ధకార్మికుఁడు, ఇట్టి వాఁడు తానేగాక ప్రజలందఱ స్వధర్మపరులఁ జేయఁగలఁడు.

ఉ. ఈశ్వరు నన్నునొప్పక నిరీశ్వరుఁడైన రిపుంజయుండు ధా
త్రీశ్వరుఁడైన, ధర్మముల వృద్ధినొనర్చి సుఖంబుఁగూర్చి, వి
శ్వేశ్వరుఁ గాశిఁ బాసి మఱచి యెల్లపు డెల్లరుఁ దన్నుఁగొల్వ నీ.
విశ్వము నేలు నిష్ఠదె వివేచనసేయఁగ క్షేమ మన్నిటన్.

గణ : మీరు చెప్పిన ట్లాతఁడు లోకమును ధర్మబద్ధముఁ జేసి తన్మూలములగు నర్థకామముల ననుభవింపఁ జేయునచ్చును. అంతమాత్రమున జనోద్ధరణము దేశోద్ధరణము కానేరదు. పంచక్రోశపరీతమగు నీకాశీక్షేత్రమునఁ బ్రజలకేకాదు, సర్వప్రాణుల కనాయాసముగ మోక్షసామ్రాజ్యమును గరతలామలక మొసరించు తమ

సాన్నిధ్యము లేకపోవుటచే భరతదేశము నికృష్ట మగుననుటకు సందియ ముండదు.

ఉ. ముక్తిరమాధికేతనము పున్నెపుఁ బంటల కిక్క కౌశికా
భక్తజనావనుండ వగు పాలకవర్యుఁడ వీవు లేక, యా
సక్తి నినుఁ భజించు జనసంఘము లుండునె? కోర్కినిండునే ?
త్యక్తమొనర్చి నీగరిమ, ధాత్రికిఁ గల్గిన కీర్తి మాత్రువే?

విశ్వ : కుమారా! నీ చెప్పిన దంతయు యథార్థము. స్వపరాభ్యుదయ విజ్ఞానము లేని యథేచ్ఛాచారులచే సర్వవిధముల లోక మల్లకల్లోలమైనది. ఈ సమయమున ధర్మమునుద్ధరింప క్షత్రియుఁడే సమర్థుఁడు. క్షేత్రము బాగుపడి ధర్మవృక్షము నాటుకొనినఁ బుష్పఫలప్రాయము లగు భక్తిముక్తుల కవకాశము కలుగును. ఆతఁడు కొంతవఱ కొనర్చిన మిగిలినదాని కవసరమైన మనము పాటుపడుదము. ఈతఁడు నన్ను నిరాకరించినంత మాత్రమున నిరాకరింపఁబడువాడనుగాను. నే నీశ్వరుఁడను, సర్వాత్మభూతుడను గాన నింక నా రిపుంజయుని బ్రభువును జేయుటయే ముఖ్య కర్తవ్యము. ఏలన

ఉ. కష్టపరంపరల్ మిగులఁ గాఱియవెట్ట, జనుల్ క్షుధార్తులై
నష్టముఁజెంది రెందఱో, వనంబులఁ గొండలనుండి రెందఱో,
సృష్టి సగంబునోయె, నృపశేఖరు నొక్కరు నిల్పి లోకసం
తుష్టి నొనర్పనేఁ, భువనధూర్వహతల్ మన కొప్పియుండునే?

బ్రహ్మ: సిక్కము వచించితిరి. విశ్వనాథుల కిది భరింపరాని తలబరువు. స్వయముగనే దింపుకొనవలయును.

గణ : అయిన మీ యిష్టానుసారము కానిండు.

విశ్వ : విరించీ! ఇంక నా తుదిపలుకు లాలకింపుము.

శా. దేశం బార్తిఁగలంగె, ఱేఁడొకఁడు సందీపింప యోగ్యుండు చిం
తాశూన్యంబయి మానవావళికి స్వాస్థ్యం బబ్బు, నారాజు ధా
త్రీశుం జేయుము; ధర్మదృష్టి నత డెంతేఁ బ్రోచు నీధారుణిన్,
గాశిం బాసెద నేము మా గణము నిక్కార్యంబు గట్టెక్కఁగన్.

ఇంక నాలసింపక సర్వవైభవములతో నా రిపుంజయుని మర్త్య లోకమహీపాలునిఁజేసి పట్టాభిషేకసమయమునఁ బ్రజలకుఁ బ్రభువునకుఁ బరస్పర మనురాగ ముప్పతిల్లఁబల్కి లోకమునకు మేలుఁగూర్చుము. త్వరగఁబొమ్ము.

బ్రహ్మ: అన్నపూర్ణాదేవీ! విశ్వనాథప్రభూ! గణపతికుమారా! రిపుంజయునకు దివోదాసనామ ముంచి పట్టాభిషేక మొనర్చెద. ఆజ్ఞయిండు, పోయివచ్చెద.

విశ్వ: మంచిది, అటులే చేయుము.

బ్రహ్మ: [నమస్కరించి నిష్క్రమించును].

[తెర వ్రాలును]

## ప్రథమాంకము - రెండవరంగము

[భృంగి - గణపతి ప్రవేశింతురు]

భృంగి: గణపతిబాబూ! అన్నపూర్ణావిశ్వనాథులు, చతురాననుఁడు, మీరు, చేసిన యీ రాజనిర్ణయము కొండను ద్రవ్వి, యెలుకను బట్టినట్లుండుటయేగాక, మిక్కిలి యపాయకరముకూడ కాఁగల దని నా యభిప్రాయము.

గణ: ఎందుచేత?

చ. భువనములెల్ల నీరయినఁ, బోయిన బ్రహ్మలు వందలాదిగా,
శివుఁడును గాశి యెప్డయినఁ జేడ్పడెనే? భవు నోంప భస్మదా
నవుఁ డిటు మాటి వచ్చెనో యనంబొడసూపెడు వీఁడు రాజె? భూ
ధవుఁ డభవాపరాధి యయి తన్పునె? ధారుణి సొంపు నింపునే?

గణ: భృంగీ! శంకరుఁ డఖిలలోకాభయంకరుఁడు. మహార్ఖ్యమున నెవ్వఁడేని మితిమీఱి ప్రవర్తించినఁ దుద కాతనికి భస్మాసురు నకుఁ బట్టిన గతియే పట్టఁగలదు.

భృంగి: పరమేశ్వరుని సయితము, తఱుమఁదలఁచు నా రాజకుమారునే

గాకున్న, సమర్థుఁడగు నేయితరజాతీయునైన క్ష్మాపతి నేల చేయరాదు ?

గణ : క్షత్రియేతరులలో, రాజ్యపరిపాలనాదక్షు లుందురా ?

భృంగి: ఏమి ? ఏలయుండరాదు !

గణ : ఉండవచ్చును. కాని,

ఉ. ఒక్కనికిఁ స్వకీయ యగు నుగ్మలి వేఱొకరుండు పొంది పె
న్మక్కువఁజూపి యేలినను మాన్యతగల్గునె? భార్యయానె? రా
జొక్కఁడె ధారుణీపతి, మఱొక్కఁడు భూవిభుఁడేఁ స్వధర్మముల్
దక్కనె, భీతిఁగూర్చి పరధర్మ మధోగతి నందఁజేయదే?

భృంగి: అయిన నది యటుండనిండు. ప్రజలరాజ్యము, ప్రజలసుఖము, ప్రభునిర్ణయముకూడఁ బ్రజలకే యుండవలయును.

గణ : అటులనా ? అయిన వారిలో సమర్థు లేరి ?

భృంగి: కోట్లకోలఁదిగ స్త్రీపురుషు లుండ, నందఱు నసమర్థులుగనే యుందురా? అయిన ముల్లుఁదీయుటకు ముండ్లుండ, దబ్బనాలేల? గడ్డపాఱలేల ? ప్రజల పనులలో దేవతలప్రవేశ మనవసరము.

గణ : భృంగీ ! నీకున్న స్వపరకార్యవిచారణ యీ పురాణపురుషు నకుఁగూడ లేదన్న మాట.

భృంగి: బ్రహ్మకు సృష్టి, ప్రమథపతికిఁ గాశీక్షేత్రపాలనము, భక్తరక్షణము, స్వకార్యములు.

గణ : ఎంత తెలివిగలవాఁడవు? భృంగీ ! ఇంక రేపటినుండి గంగ కావల నూళ్లుగూడ లేవందువు గాఁబోలు. ఓయీ !

మ. ఒక వారాణసిగాదు భూతలముగా దున్నట్టి లోకాల కే
లిక విశ్వేశ్వరుఁడే, సమస్తమును దేలించుఁ సుఖశ్రీల, నీ
సకలంబుఁ దనరూపుగాఁదనరు, నా సర్వాత్మ కన్నన్న లం
దక గావింపరు దివ్యు లవ్విధిరమానాథాదు లేకార్యముల్.

అందుచేతనే విధాత మర్త్యలోకవిషయముల విన్నవించుటయు, మహేశ్వరుఁడు మనుజపతిని నిర్ణయించుటయు జరిగినది.

భృంగి: అయిన నా రాజ్యపాలనాయోగ్యత క్షత్రియునకే యేల ?

గణ : సహజబలపరాక్రమాదులు, వేదశాస్త్రవిజ్ఞానము, సత్కర్మానుష్ఠానపరాయణత్వము, దైవశక్తులు, బాహుజునియందుఁ బ్రధానముగ విరాజిల్లఁ దగియుండుటచేత.

భృంగి: చదువుకొని పండితులైనవారు, స్వసామర్థ్యమున శక్తిసంపన్నులైనవారు నెందఱు లేరు ?

గణ : ఎందఱెన్ని చదివినను, ఎవ్వరెన్ని శక్తులార్జించినను, వారెల్లరితరవిధముల వన్నెకెక్కెరేగాని, మనదేశమున, రాజ్యపాలనమున, రాజన్యుని మించినవా రెవ్వరును లేరు.

భృంగి: అయిన నీరాజ్యలక్ష్మి నంచెలంచెలుగ నడిపించువా రెల్లప్పుడు రాజపురుషులే యందురా ?

గణ : యుగయుగములను వందలు, వేలు, లక్షల సంవత్సరము లీయుత్తమక్షత్రియుల బాహుబలముననేరాజ్యలక్ష్మివిరాజిల్లినది.

భృంగి: ఇట్టి పరిపాలన యెప్పుడును బరాధీనము కాలేదా ?

గణ : భృంగీ ! తెలియనివానివలె నడిగెదవేల ?

ఉ. సృష్టి సతంబు కష్టములఁ జెడ్పుచుఁ గీడ్పుచు, నాశమంచు, వి
భ్రష్టముగాక యుండ నెవి, పార్థివపాలన నిల్చి యెప్డు సం
తుష్టి నొసంగునే? నృపులు దుర్ణయులై బహుకాలముల్ శ్రమా
విష్టులుగారె? యీ పుడమిచేడె నొకండుగఁ గేల నిల్పునే?

కావున రాజ్య మెప్పుడు రాజాధీన మన్న నియమము లేదు. వారిని వదలి యలసులై, వేదశాస్త్రాదరము లేక, స్వధర్మనిరతులుగాక, యఖిలావభాసకమగు నాత్మబల మెఱుంగక ప్రద్యోతమానుఁడగు సూర్యుని మఱచి, దర్పణప్రతిబింబితుని భాస్కరునిగఁ దలంచు నజ్ఞులవలె, నన్యదీపితమగు బుద్ధియే స్వతంత్రమని, దీని బలమే బలమనుకొన్న బౌద్ధులకుఁజిక్కి, మనోబుద్ధివృత్తులకువలె, నచలనామధారిణి యగు భూతలలక్ష్మికిఁ జాంచల్యమును, స్థిర కస్థిరత్వమును గలిగి, స్వర్గరాజ్య మొక

ప్పుడు నహుషునకుఁ బోలెఁ గ్రమక్రమముగఁ బ్రజలదౌర్భాగ్యమున నీ భూతలరాజ్యలక్ష్మి వైదికధర్మవిరహితుల కాటబంతి గాఁజొచ్చినది.

భృంగి: అనఁగా దేశము పరాధీనమైన దన్నమాట !

గణ : ఒక దేశమేగాదు. ధర్మము, సంపద, శీలము, వేషము, భాష, సర్వముఁ బరాధీనమే.

భృంగి: ఇదియంతయు జనుల దురదృష్టము. పోఁగొట్టుకొన్న రాజ్యమును, ఔన్నత్యమును దేఁగల సహజతేజోబలధైర్యశాలి, దేశమున నొక్కఁడును లేనప్పుడు, సర్వప్రజాసంఘశక్తి మీఁద నిలిచి, మిక్కిలి సమర్థులై, పలుకుఁబడిగల నాయకులు, స్వారాజ్యలక్ష్మికందుకము నందుకొని, యన్యదుర్లభ మేలచేయలేరు? దేశప్రశస్తి నేల స్థిరపఱుపలేరు ?

గణ: ప్రజాశక్తిని నమ్మినిలుచుట, మొగిలికజ్జలమంచెమీఁద నిలిచినట్లే.

భృంగి: ఎందుచేత?

గణ : సామాన్యజను లెప్పుడు, అల్పహృదయులు, అల్పజ్ఞానులు, ఆశాపరులు, అర్థాసక్తులు. అట్టివారి చేయూఁత యస్థిరము.

భృంగి: ఏల ?

గణ : మనము నిల్పినవారు మన కన్నియుఁ జేయవలయునన్న యాశతో స్వల్పకార్యములను, స్వల్పలాభములను గోరి, యధిపతు లన్న యాదరములేక, యన్నింటికి నధికారులఁ ద్వరపెట్టుచు, 'ఒకఁ డేటికన్న, నొకఁడు కాటి' కనెడి సంఘర్షణములతో నెందును నైకమత్యములేక, క్రోధవివశులై, యుద్రేకమునఁ నూఁగుచుండుట వలనఁ బాలకపీఠములు సైత మెల్లపుడు నుయ్యాల లూఁగుచుండును.

భృంగి: అటులైన నీ సంఘబల మెప్పుడైన నోటిపడవతో నీటిప్రయాణ మన్నమాట.

గణ : సందేహమేమి?

భృంగి: సామాన్యజనశక్తికంటె, దృఢశక్తిగల నాయకుల నైపుణ్యము ప్రజలను నయమార్గమున నడిపింప నేరదా?

గణ: నేరదు.

భృంగి: ఎందుచేత?

గణ: భిన్నగతులలోఁ బేరపరిస్థితులు పీడాకరములై, యాత్మావయవములంబోలు అనుచరవర్గము సైతము, కాంతాకనకములకుఁ గన్నుగుట్టి, స్వార్థపరత్వమున స్వాంతములు చెదరి, పాలనాబల విరహితులై యుండఁ బాలకులకు స్థైర్య మెక్కడ? కార్యనిర్వహణ మెక్కడ? ప్రజలకు సౌఖ్య మెక్కడ?

శా. ఈ రాజ్యస్థితి చక్రనేమిగతి నెంతేఁ గ్రిందు మీఁదౌచుఁ, బ
ల్మాఱుల్ మాఱునుమాటిమాటితొలిలీలన్ గాలఁగాఁజొచ్చు, భూ
దారుండెయ్యెడురాజు దైవకృప, నేతత్స్వార్థివప్రక్రియల్
మేటల్ మీఱునొ? భద్రముల్ గనునొ? మేల్కొల్లెల్లఁ గావళ్ళలన్.

కావున, ఈశ్వరధనుస్సువలె నెత్తనలవిగాని యిమ్మహారాజ్య చక్రముక్రిందఁబడి, మహాశూరు లనఁదగిన సంసారు లెందరెందఱో నిస్సారు లగుచుందురు. ఇంక నీ విచారణతో మనకుఁ బ్రయోజనము లేదు. పోవుదము రమ్ము.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

## ప్రథమాంకము - మూడవరంగము

[ రిపుంజయుని ఆశ్రమప్రాంతము ]

బ్రహ్మ: [ప్రవేశించి, పరికించి] ఓహో! ఈప్రదేశ మెంత మనోజ్ఞము! ఎంత యద్భుతము!

మ. సెలయేళ్లెయ్యెడఁ బంటకాలువలుగాఁ జెల్వారె, నందందుఁ దీ
వల నాడించుచు వాతపోతము లొనర్పన్ బూలపూజల్, దమిన్
ఫలదానంబు లొనర్ప వృక్షములు, చెంతన్ లేళ్లతో నాడెదుర్
బులు లోహో! ఋషివాటికాగరిమ కే భూముల్ భువిన్ దీటగున్?

ఇట్టియుత్తమప్రదేశములవసించి వెలయించుతపోనిధులచేఁదపస్వి లక్షులశక్తిమంతు లగుటయేగాక యపరబ్రహ్మాండనిర్మాతలు కూడ కాఁగలరనుటకు సందియముండదు. రిపుంజయుం డిప్పటి కనుష్ఠానమును దీర్చుకొని యుండును. [అనుచు లోనికిఁ బ్రవేశించుచుండ]

రిపుం: [బ్రహ్మనుజూచి సంభ్రమముతో నెదుర్కొని, సవినయముగ] రిపుంజయనామధేయుఁ డిదే పితామహునకు నమస్కరించుచున్నాఁడు. [అని నమస్కరించును].

బ్రహ్మ: సమస్తసన్మంగళాని భవంతు. మనువంశోత్తమా! సేమమా?

రిపుం : తమ యనుగ్రహమున. లోనికి దయచేయుఁడు. [అని శిలావేదిక నుపవిష్టుని జేయును].

బ్రహ్మ: కుమారా! ఇటు కూర్చుండుము.

రిపుం : [ సముచితాసనాసీనుఁడై ] సర్వవేదస్వరూపులును నిఖిలసృష్టికర్తలు నగు తమ దర్శనభాగ్యమున మిగుల ధన్యుఁడ నైతిని. మహాత్ము లూరక రారు గదా!

బ్రహ్మ: ఊరక యేల? కోరికలు దీరుటకొఱకే.

రిపుం : తాము సకలసురజ్యేష్ఠులు. నేనొక మానవపరమాణువును. అట్టి నావలనఁ దమకోరిక దీరుటకాదు. ఇక నా కోరికఁ దీర్చుటకే.

బ్రహ్మ:కుమారా! ఇయ్యది నీకోరిక తీరుటమాత్రమే కాదు. సావధానుఁడవై వినుము.

శా. లోకం బాకులమయ్యె ధర్మవితతుల్ లోపించె, భూకాంత యెంతో కన్నీ రురలంగ గద్గదికతో నూఁగాడు నెమ్మేన నా
కై కై మోడ్పు ఘటించి, యేమనక నీకై పో నను౯జూచె, నే
నా కల్యాణి భరంబు వాపుటకు నిన్నాశింతు రాజాగ్రణీ!

చ. ఇనకులసంభవుండవని, యీడ్యతపోబలధైర్యసంపదల్
గనిన గుణోత్తముండవని, క్ష్మాత్ర మెలర్పఁ జరింతువంచు, నీ
మనుగడ, వంశవర్తనము మాకు రుచించుట, మర్త్యలోకర
క్షణమున నిన్నుఁ గోరితిమి క్ష్మాపతి వీవె రిపుంజయాధిపా!

మహారాజా! నీకోరినతీరుననే యీనిర్ణయము. కాన నింక నీ యభ్యంతర ముండఁగూడదు. కాలహరణమైన నీలోకస్థితి నామనస్సును మిక్కిలి కలంచుచుండును. ఆలసింపక యింకఁజక్రవర్తి పదవి నలంకరింపుము.

రిపుం: మహాత్మా! ప్రస్తుత మీ లోకకల్లోల మెల్లవారికి సంతాపజనకము కాకమానదు. అందును సకలజగత్స్రష్టలగు మీ కనన్యసామాన్య మనుటకు సందియముండదు. దేవా! నేను సర్వదా మీ యాజ్ఞాబద్ధుఁడనే. కాని కార్యనిర్ణయమున నాకు మోమోటమి లేదు. చెప్పినవిషయమే యైనను గాలాంతరమగుట మఱలఁ జెప్పెద. సావధానముగ నాలకించి పిమ్మటఁ గార్యనిర్ణయమునకుఁ గడంగుఁడు.

చ. ఒకకడ రాజు లిద్దఱుగ నుండుట లెందును బాడిగాదు, మా
మకహృదయం బెఱింగితిరి, మంచియొ, చెడ్డయొ యింక వారణా
సికిఁ బ్రభువైన విశ్వపతి శీఘ్రముగా భువి వీడి పోవలెః
సకలము నాది కావలెను, క్ష్మాతలి నేలవలెః సురాగ్రణీ!

ఆర్యా! అన్యాధికారములు, అడ్డుచెప్పుటలు, అభిప్రాయనిరోధములు ప్రభుత్వమునకుఁ గానిపనులు. నాకత్తి కడ్డులేక, నాభుజాబలముపైఁ బ్రభుత్వము వెలయవలయును. నా యాజ్ఞ నిరంకుశముగ నుండవలయును. ఇందుల కీ విశ్వనాథుఁడేల? భైరవాదు లేల?

ఉ. ఒక్కఁడుగాఁడె శేషుఁడఖిలోర్విని మోయఁడె? సూర్యుఁడొక్కఁడై
దిక్కులు పిక్కటిల్లఁ దన దీధితులః బ్రసరింపఁజేయఁడే?
యొక్కటిగాదె వార్ధి, సకలోర్విఁ జలంబుల దన్పుకున్నె? నే
మక్కఱ యీశ్వరుం డొకఁడనై ధరణీభరముః భరింపనే?

పితామహా! ఇంతయేల? నా నిశ్చితాభిప్రాయ మాకర్ణింపుఁడు.

ఉ. కోరినకోర్కెఁదీర్చి యొనఁగూర్చెదవేని జగత్ప్రభుత్వ మీ
భూరమణీమణిః సకలభోగములః గనఁజేయనే? ప్రజః
సారతరాత్మధర్మముల నల్పు గుణాఢ్యులఁజేసి భోగవి
స్తారసుఖోన్నతుల్ వెలయ స్వర్గమొనర్పనె మర్త్యలోకముః.

బ్రహ్మ: రిపుంజయమహారాజా! నీ పరిపాలనానియమమునకు సుక్షత్త్రియో
చితమగు రాజ్యభారనిర్వహణోత్సాహమునకును మిక్కిలి సంత
సించుచున్నాను. నే నెప్పుడో నీ యభిప్రాయమున కనుమతించి
తిని. విశ్వనాథప్రభువుచేతఁగూడ నంగీకరింపఁ జేసితిని. అందుల కే
యీ కాలహరణము. ఇంక విశ్వేశ్వరుఁడుగాని సంబంధులుగాని
యెవ్వరు నిందుండరు. నీవే ప్రభుఁడవు. లోకోత్తమమగు నీ
భూలోకపరిపాలనము బహుపుణ్యలభ్యము. నీవు సర్వసమర్థుఁ
డవు, మిక్కిలి సుకృతివి, ఇంక నీ చతుస్సముద్రముద్రితమహీ
రాజ్య పరిపాలనమును గైకొనుము. మనఃపూర్వకముగఁ
గైకొనుము. [అని రిపుంజయుని చేతఁగలశోదకము నుంచి] మహారాజా!

చ. త్రిభువనగణ్య మీభరతదేశము దీన నొసర్పఁ బుణ్యముల్
ప్రభువులు వేల్పులింద్రులును భక్తులు జ్ఞానులు నౌదు, రిట్టి స
ద్విభవవిరాజితంబయిన విశ్రుతధాత్రి భరించి విష్ణుస
న్నిభతఁ దనర్చి యెల్లరును నిన్ గొలువన్ దమి నింపు రాడ్వరా!

ఒక మహీపాలనమే గాదు. సర్వసామర్థ్యములతో సార్వభౌమో
చితములగు సర్వోపకరణములు నీకు సమకూర్చుచున్నాను.

మ. అల దేవేంద్రుని లెక్కకుంగొననిమాహాత్మ్యంబు, రాజ్యాంగముల్
విలసత్సౌధచయంబు కాఁదగిన మేల్విన్నాణముల్ సేర్చితిన్
లలనారత్న మనంగమోహిని గదున్ లావణ్యరాశిన్ ముదం
బొలయన్ గూర్చితి, నన్ని గైకొని ప్రియంబొప్పన్ బ్రజన్ బ్రోవవే.

రిపుం: పితామహా! అనన్యసామాన్యమగు మీ వాత్సల్యాతిశయమున
కే నెంతయు సంతసించుచున్నాను. నా యభిప్రాయమును దా
మంగీకరించుటయేగాక విశ్వనాథప్రభువుచేతఁగూడ నంగీకరింపఁ
జేసినందులకు మిక్కిలికృతజ్ఞుఁడను. స్వకులోచితమైనను నెన్నఁడో
జాఱిపోయిన యీ సర్వంసహాపాలనమును గాంతారత్నముతో
సకలరాజ్యాంగములతో సర్వసంపదలతో నాకొనగూర్చుచున్నం
దులకు మీ కెంతయు బద్ధాంజలి నగుదును. [అని నమస్కరించి]

అలసుడనుగాక యపమార్గమునఁజనక యీసామ్రాజ్యపాలన మునకై నా సర్వశక్తులు వినియోగింతును.

చ. మనుకులసంభవుండనయి మాన్యతదున్నతి వమ్మెనర్తునే?
పనిగొని యందునిందుఁ జని పామరుల ట్లఖిలోపభోగముల్
గనుటె ప్రభుత్వ మందునె? సుఖంబు దపంబును యోగసంపదల్
దనువును సైతముల్ వదలి ధారుణి నోమనె, చింతఁగాంతునే?

బ్రహ్మ : మహారాజా! నీవింతకుఁ జాలుదువని యెంచియే యీ భూభార మెల్ల నీభుజాస్కంధమున నుంచితిమి. కార్యభారము తీరినది. ప్రస్తుతమింక నిశ్చింతతో నుందును. కాని, యింకొక్క విషయము తెలిసినదైనను తిరిగి తెలుపుచున్నందుల కన్యథా తలంపకుము.

రిపుం : మహాత్మా! చెప్పవలసిన విషయములు వేయియైనను జెప్పుఁడు.

బ్రహ్మ : మహారాజా! దేశము, దేశీయ ప్రజలు పడుబాధ లెంతవఱకు మఱచుద మన్నను మఱవనేరకున్నాను.

సీ. పరిపాటి దప్పిన పాలకాధములచేఁ
దూలి తాలిమి, సోలె భూలతాంగి
బందిపోట్లుగఁబడి ప్రమందంచు జనులచేఁ
దల్లడిల్లుచునుండె ధైర్యలక్ష్మి
క్రమవిక్రయాంఖ్య విక్రయనేతల కతాన
మొదలూడి చెడె న్యాయహృదయగరిమ
నియమనిర్మూలననిపుణులౌ ప్రజలచేఁ
దాఱుమాఱయిపోయె ధర్మపథము

గీ. సౌఖ్య మనుమాటయే నిల్చె జగతిలోనఁ
బ్రాణ మిది మాకు సురలకు భరతభూమి
యెట్లు దేలింతొ ప్రజ, నమ్ము నెట్లు దేల్తొ
సర్వభారంబు నీయది సార్వభౌమ!

రిపుం : దేవా! తమ వాత్సల్యాతిశయము మహత్తరాశీర్వాదబలము

నన్ను సర్వకార్యనిర్వాహకుని గావింపఁగలదు. ఇంతయేల ?
నా నిశ్చితాభిప్రాయ మాకర్ణింపుఁడు.

సీ. జననసముద్భవక్షాత్రసంపద ధాత్రి
యమృతరక్షాసిద్ధి నందకున్నె?
సహజధైర్యస్థైర్య శస్త్రాస్త్రసంపత్తి
స్థిర స్థిరత్వంబూని మురియకున్నె?
అనలంకృతాత్మభూషణయోగసంపత్తి
యణిమాదిసిద్ధుల నలరకున్నె
అనితరదుస్సాధఘనతపోధనశక్తి
నభిలషితార్థంబు లడరకున్నె?

తే॥ గీ. రాజు రాజ్యంబు వేఱున్నె, తేజమెసఁగఁ,
బాపవిధ్వంసకాత్మీయపరమధర్మ
భవనసుఖోన్నతులం దేల్చి ప్రజల కెలమి
రాకపోకలు గూర్తు నీ రాజ్యమునకె.

ఇంతియే కాదు,

గీ. వేదపురుషధ్వజప్రభల్ వెలయ దిశల
నఘశమము పటాపంచలై యడఁగకున్నె
కేతనపటంబు ఛత్రమై క్రేన మెఱయ
పుడమిచేడియ సంబరపడకయున్నె?

బ్రహ్మ : సంతసము. మిక్కిలి సంతసము. [రాజుపైఁ జేయి వేసి] మహా రాజా ! రాజరాజ్యముల కభేదముగ ధరిత్రిని సర్వసంపన్న నొనర్చి ప్రజలకెల్లర కైహికసుఖోన్నతుల సమకూర్చుటయేగాక యాముష్మికములగు స్వర్గాధికమత్పత్యలోకనివాససౌఖ్యముల సమకూర్పఁదలంచిన నిన్నెంతయు నే నభినందించుచున్నాను.

రిపుం : ఆర్యా! మీదయకుఁ బాత్రుఁడను.

బ్రహ్మ : [ముందుఁజూచి ఉత్సాహముతో] కుమారా ! అతఁడే నాగ రాజు, వాసుకి, తన కుమార్తె ననంగమోహినిని నీ కిచ్చుట

కాతురుఁడై యెదురు చూచుచున్నాఁడు. సిద్ధమైన నీ సౌధరాజమున నిన్నుఁ బ్రవేశపెట్ట మంత్రిసామంత పురోహితులు భద్రగజముతో నెదురుచూచుచున్నారు. ఇంకఁ బ్రాసాదప్రవేశము, పరిణయము, పట్టాభిషేకము జరుగఁగలవు. సుఖముగ రాజ్యపాలనము చేయుచుండుము. నే నింకఁ బోయివచ్చెద.

రిపుం : పితామహా! సర్వశుభకార్యములు తామే జరుపవలయును. పట్టాభిషేకానంతరమే తమ పయనము. రండు పోదము.

[అని యిరువురు నిష్క్రమింతురు.]

—

# దివోదాసనాటకము

## ద్వితీయాంకము

భృంగి: [ప్రవేశించి] ప్రజ లాత్మీయులని ప్రజాసౌఖ్యములెల్లఁ బ్రభుమూలకములని యెంచి, మహారాజున కీవిధాత యెట్టిరాజ్యోపకరణముల సమకూర్చెను! ఎట్టి నగరనిర్మాణము గావించెను!

సీ. దిక్కరుల్ నగరి నల్ప్రక్కుల నలరెనా
ఘనభద్రవేదండకాండ మలరు
సప్తాశ్వునశ్వముల్ జగతిఁ బొల్చెననంగఁ
జిత్రోత్తమహయాళి చెంగలించు
మేరువుఁ గరఁగించి మేల్మిఁ జేసిరో నాఁగ
నతులితస్యందనప్రతతి వెలుఁగు
నుక్కువిగ్రహముల కొదవించి ప్రాణముల్
వరలించి రన భటపటలి దనరు

గీ. హరిహయోన్నతమందిరమా? యనంగఁ
జెలఁగు సౌధంబు, వారణాసికిఁ బదింత
లైన సమ్రాట్పురం బిట నమరఁ జేసి
యధిపునకుఁ గాన్క నిడె, ధాత యలరి యౌర!

ఇట్టి సమ్రాట్పురమే లేకున్న నీ నరపతి పరిణయోత్సవమునకేతెంచిన త్రిలోకవాసులబాధలు మా మహాదేవుఁడే విచారింపవలసి వచ్చెడిది. ఆ నాగకన్యామణుల విలాసములు, ఆ మణిదీపముల ధగద్ధగలు, కల్యాణోత్సవవిశేషములు, సర్వజగదానందకరము లనుటకు సందియము లేదు.

శా. మొల్లంబోచుఁ ద్రిలోకవైభవము లామూలంబుగా నిందు వ
ర్తిల్లెన్, ఱేని వివాహ మానలువ సంప్రీతిన్ గనంజేసె, రా
జిల్లెన్ ధాత్రికి నూత్నవైభవము, సుశ్రీమీఱె నల్వంకల
న్పల్లెల్ పట్టణముల్ సమస్తజన మానందంబు నొందెం గదన్.

ఇంతవఱకు నిది మిక్కిలి ప్రశంసనీయము. కాని "కొండంత రాగము, పిచ్చుకుంటు పదము" అన్నట్లు కాకుండ, మహారాజు రాజ్యపాలనావిధానమే యింకఁగనుంగొనవలసి యున్నది. పట్టాభిషేకాంగములుకూడ నిర్వర్తించుకొని, ప్రభువప్పుడే, సమ్రాట్పీఠ మలంకరింప మహాసభ కేతెంచుచున్నవాఁడు. అక్కడి విశేష ములుకూడ విచారించి వచ్చెద.

[ నిష్క్రమింతురు. ]

## ద్వితీయాంకము - రెండవరంగము

[ మహారాజమందిరము. ఆస్థానమంటపము, పురోహితులు, మంత్రిసామంతులు, సేనాపతులు, పౌరజానపదులు మున్నగువారు ప్రవేశించియుందురు.]

[ తెరలో ]

శ్రీ శ్రీ శ్రీ సద్యశస్సమలంకృతాఖిలదిగ్దిగంతరరాడ్వంశమండల మండనాయమాన, విబుధజనశోష్యాయమాన మనుకులకల శాంబుధిరాకాసుధాకరులకు జే, శ్రీ శ్రీ శ్రీ సర్వవిద్యావిభాసుర, సకలాస్త్రశస్త్రప్రవీణ తపోయోగబలసంపన్నాన్వర్థాభిధానాంకిత రిపుంజయమహారాజులకు జే, శ్రీ శ్రీ శ్రీ నిఖిలలోకస్తుత్య, సర్వాగమవిజ్ఞానవిభవవిరాజిత త్రిభువనోన్నత, చతురుదధివేలావలయిత మహామహీసామ్రాజ్యాధినాథులకు జే.

[ అని కైవారములు చేయుచుండ, వేత్రహస్తులు మార్గముచూప బ్రహ్మతో రిపుంజయమహారాజు ప్రవేశించి, సమీపమున బ్రహ్మయుఁ బ్రక్కనఁ బట్టపుమహిషియు సింహాసనమునఁ దాను గూర్చుందురు. ఎల్లరు జయజయధ్వానములతోఁ బుష్పాక్షతలు చల్లి పారితోషికములు సమర్పింతురు. ]

బ్రహ్మ: [కలశోదకమును జల్లి రాజదండము నిచ్చుచు] మహారాజా! పండితవర్యులారా! మంత్రిసామంతులారా! పౌరజానపదులారా! మహోత్కృష్టమును సకలజగత్కల్యాణకారణమునగు మీ సామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవసందర్భమున సంతోషపూర్వకముగ, నేఁజెప్పఁబోవు వాక్యము లన్నియు, సావధానముగ వినఁగోరుచున్నాను.

అందఱు: [కరతాళధ్వనులు చేయుదురు]

బ్రహ్మ: మహాజనులారా! నేఁడు మిక్కిలిసుదినము. చాలకాలమునుండి దేశమున కధినాథుఁడులేక ప్రజలకైకమత్యము లేక కలిగిన కష్ట పరంపర లెల్లరకును దెలిసినవిషయములు. ఇట్టి మీయందఱి బాధానివారణకై విశ్వేశ్వరుని యనుమతిఁగూడఁ బడసి సర్వ సమర్థుండును సార్థకనామధేయుండు నగు రిపుంజయరాజవర్యుని సకలధరాతలాధీశ్వరునిగాఁ గోరి, యీపట్టాభిషేకమహోత్సవ మును జరుపుచుంటిమి. ఇట్టిశుభసమయమున నాయానందము నించుక వెలిఁబుచ్చుకొందును.

అందఱు: [కరతాళధ్వనులు చేయుదురు.]

బ్రహ్మ: మహారాజా! నృపవరాదరము నరులకుమాత్రమే కాదు, సురలకునుగలదు. అందుచేతనే నేఁడు దిక్పతులుకూడ నిన్ను దేశ రక్షణపటిష్ఠునిఁ జేయ నీపట్టాభిషేకసమయమునఁ బ్రభుమణివగు నీకుఁ దమతమ యాత్మాంశముల నర్పించుచున్నారు. ఇట్లు ని న్నాదరించు దేవతలకు నీకు నైకమత్యసూచకముగ నేనును నీకొక నవీననామము నొసంగెద. నీరిపుంజయనామధేయస్థానమున దీని నలంకరించుకొనవలయును.

దివో: మహాప్రసాదము.

బ్రహ్మ: సార్వభౌమా!

ఉ. చేసినయట్టి సత్తపము, చెందిన యయ్యణిమాదిసిద్ధులున్
వీసరవోవకుండఁ బృథివీవరవర్యుఁడ వైతి వీ దివో
దాసను నామమూని సురధామమునంబలె ధాత్రి నీ ప్రజల్
వాసిఁ జెలంగ సంపదల వర్ధిలు మిత్తియశస్సమృద్ధితోన్

దివో: [అవనతశిరస్కుఁడై యాదరము నూపును]

బ్రహ్మ: సార్వభౌమా! సకలశక్తిసంపన్నుఁడవు, నీకై నీవే సర్వమెఱుంగఁ గలవు. అయిన నాసంతసమును వెలిబుచ్చెద.

మ. కరులశ్వంబులు సారథుల్ రథములున్ గణ్యంబులౌ సైన్యముల్
బురిచుట్టున్ విలసిల్లు, మంత్రులు కడున్ బుద్ధ్యన్నతుల్, వీర లే

మఃఖపా టందని దండనాయకులు, క్షేమంబొప్ప సైన్యాధిపుల్
కరముల్ మోడ్చుచునున్నవారు గను నీకన్నన్న వర్తింపఁగన్.

ఇంతియేగాదు.

సీ. విశ్వనాథునిపీట విద్యాస్వరూపులై
గణ్యతం గనిన యీకవులు బుధులు
కులశీలములఁ బేరుగొని బాహుబలయుతు
లయిన యిన్నోటిక్షత్రియులు ప్రియులు,
ధర్మచింతన వెల్గ ధనదుని కెనయైన
భాగ్యాఢ్యు లీ వైశ్యవరులు ఘనులు
పరప్రియంకరులయి వఱల స్వధర్మముల్
సుజనతంగన్న యీప్రజలు హితులు

గీ. సర్వజగతీతలం బేలు స్వామి వీవె?
తమ్ముఁ బ్రోచెడువానిగాఁ దలఁచి నిన్నుఁ
గొలుచుచుండెద రెయ్యెడఁ గువలయేశ!
వారిఁ గృపఁగని పనిఁగొను వలయుగతుల.

మహారాజా! క్షత్రియోచితమగుస్వధర్మపాలనమున నేగాక, నిఖిల వర్ణాశ్రమోచితసకలప్రజాధర్మపాలనమునఁగూడ మిగులఁబుణ్య సంపన్నుఁడవు కాఁగలవు. దీని నేమఱవలదు.

దివో : చిత్తము.

బ్రహ్మ : మహాజనులారా! ఈరాజశేఖరుఁడు త్తముఁడని యెంచి, మన రాజశేఖరప్రభు వీతని మహీపతినిజేయ నంగీకరించెను. ఇట్టి ...భీష్టమును దీర్చుట పరమధర్మమని తాను దనపరివారముతో నీవారణాసినుండి వెడల ననుమతించె నని తెలుపుటకంటె నీసార్వ భౌముని యోగ్యతను గుఱించి తదాజ్ఞాపాలనమును గుఱించి వేఱుగఁ జెప్ప ననవసరము.

ఉ. ఇంతటివాఁడు రాజగుట యెంతటిపుణ్యమొ, మీకు ధాత్రికిన్
వంతలు దీరు, ధర్మములు వన్నెఁగనున్, గుఱుకంబు లబ్బు, భూ

కాంతుని సర్వదేవమయుఁగాఁ దలపోసి చరింతురేని, ని
శ్చింతయు శాంతిభద్రతలు చేకుఱు, నమ్ముఁడు మీర లోప్రజల్.
ఇదియే ప్రజల కర్తవ్యము. [అని కూరుచుండును]

పండి: మహారాజా! ప్రభువు నెఱుంగని మా కనన్యసాహాయ్యముగ భూభారనిర్వహణసామర్థ్యము గలిగి, దేశప్రాశస్త్యము, వేదశాస్త్రమాహాత్మ్యము,తదవసరమును గుర్తెఱింగిన యుత్తమరాజన్యుఁడు లభించుట మాపుణ్యఫలమేగాని యన్యముకాదు. ధర్మమూర్తులగు మీన్యాయపరిపాలనమున మీరు మిక్కిలి వర్ధిల్లుదురుగాక యని కోరుచున్నాను.

మ. మనువంశాభరణంబు శాస్త్రనిధి ధర్మశ్రీయుతుండౌ తపో
ధనుఁ డత్యున్నతయోగసిద్ధుఁ డఖిలాస్త్రజ్ఞాత యీనేత, ధా
తృనియోగంబున లభ్యమయ్యె సుకృతం బేమందు నిద్ధాత్రికిన్
దనరం జేయు మిఁకెల్ల వారల దివోదాసప్రభూత్తంసమా !

మంత్రి: దేవా! సర్వశక్తిసంపన్నుఁడును, బరమధార్మికుఁడగు నిట్టిసార్వభౌముని సాన్నిధ్యము మా మంత్రిపదవి కలంకారము. మేము మిగుల ధన్యులము.

పౌరు: మారాజులుంగారికి దండాలు. సామీ! పుట్టెకో బుద్ధుండకుండా, అవసరాలేందో సూడకుండా నల్పి నల్పి సంపకుండా, ధర్మంగా పాలించే మారాజప్పెబువులుంటే మాకే లోపాలుంటయి? మా పుణ్ణాలు పండిన యన్నమాటే. బాబా! దేముడి కటాచ్చంశాత నీవు సల్లగా ఉండి మమ్మల్ని సల్లగా సూడు. బాగా యేలుకో. దండాలు పెబువులకు.

దివో: మంత్రిసామంతులారా! పండితవర్యులారా! మహాజనులారా! భగవానుఁడగు నీవిధాత యనుగ్రహించి యాశీర్వాదపూర్వకముగ మనవిధుల నెల్ల మన కెఱింగించినందులకు మనఃపూర్వకముగ వందనశతము లర్పించుచున్నాను. [అని బ్రహ్మకు నమస్కరించును] ఈవాక్పతిప్రసంగానంతర మింకే ప్రసంగమునకు నవకాశములేదు. ఎందును గొదువలేదు. అయిన నవీనుఁడ నగు

టచే నా పరిపాలనావిధానమును గుఱించి యించుక ముచ్చటింప వలసియున్నది. స్వార్థరహితము, నిష్పక్షపాతమును, సర్వజనరంజన ప్రధానము నగు నీ రాజ్యపాలనము మిగుల గష్టతరము. అయిన నేనిందు నిమిత్తమాత్రము.

ఉ. సృష్టియొనర్చుధాత నను నేటి కిటుల్ సృజియించినాఁడో? యీ
విష్టపమేల శూలి పృథివీపతిగా నను నేటి కొప్పెనో!
యష్టదిగీశు లేమని నిజాంశము లిచ్చిరొ? తత్కృపాప్తి యీ
కృష్టమొనర్పదే? మహి జనేష్టముఁ దీర్పదె? కష్ట మార్పదే?

ఈపితామహానుగ్రహము, దేవతానుగ్రహము, మత్పూర్వకృత సుకృతములు, నాకు మిక్కిలి దోడ్పడెనని పురుషకారవిరహితుఁ డనై యఖిలకార్యభార మమాత్యులపైఁ బెట్టుచుఁ గోశమును వెచ్చఁబెట్టుచు మహారాజభోగలాలసుఁడనై నే నూరకుండు వాఁడనుగాను. నాకుఁగల శక్తిసామర్థ్యములెల్ల నీప్రజాపాలనము నకై వినియోగించెద.

చ. రవినయి రాజ్యముఁ గనుదుఁ, బ్రాణులఁ బ్రాణముగాఁ జెలంగి నే
వివిధమనఃప్రవృత్తుల వివేచనసేయుదుఁ, గిల్బిషాద్రులన్
బవిగతిఁ దూల్తుఁ, దేర్తు ప్రియభావమెలర్పఁ బ్రజన్ బ్రజన్ బలెన్
గువలయలక్ష్మి నన్మనుచు కూరిమిదేవతగా నొనర్చెదన్.

మహాజనులారా! ప్రజల కెల్లప్పుఁడు ప్రభువే సర్వము సమ కూర్చునని మీ రెన్నఁడును దలంపవలదు. రాజగుఁగాక, రంగప్ప యగుఁగాక, యెవనికష్టసుఖముల కతఁడే కారణము. మన యెక్కువ తక్కువలన్నియుఁ బూర్వకృత సుకృతదుష్కృత పరి ణామములు. అట్టి పాపపుణ్యములఁబట్టియే మనసృష్టి. ఈ స్రష్టకు సైత మాసృష్టియం దెట్టి స్వాతంత్ర్యము నుండదు. విధి యీవిధ మున సృజించు నీప్రజలు లోకవ్యామోహమునఁ గామక్రోధ ములుమీఱి దురాశలు పెఱిగి దుష్కార్యములు చేయకుండునట్లు చూచుట; అన్యోన్యవైరములచే హింస లొనర్పకుండుటకును

బరధనపరకాంతాపహరణములు జరుగకుండుటకును జనక్షోభము లేకుండ నెవ్వరి కే విధమైన యక్రమము జరుగకుండ, న్యాయము పీడకుండ, సర్వవిధసుఖసాధనము లొనర్చుచు నీతియుక్తముగఁ గాపాడుటయే ప్రభుధర్మము. దీని నెఱింగి యార్యవిజ్ఞానము నధిక్షేపింపక, యలసులముగాక, మనవిధుల మన మాచరించుటయే కర్తవ్యము. అదియే యిహపరసాధకము.

మ. కులధర్మంబులు పీడకుండుటయె మీకు న్నాకు నీక్షోణికిన్
బలముం సౌఖ్యముసంపదల్, మనకొగిన్ భావైక్యమే,యన్యముల్
గలుగన్ బోవు స్వవృత్తు లెల్లరకు ముఖ్యం, బున్నతుల్ గూర్చి నీ
యిలఁ బాలించిన ధర్మమే ప్రజలఁ దా నేలించు ముల్లోకముల్.

మీరెల్ల రీవిషయమున జాగరూకులుగ నుండవలయును. ఆత్మ విధుల నన్నింటి నాచరింపవలయును. ఇంతియేకాక,

తే. గీ. భరతభూమాత యసువు లీ ప్రణుతిఁగన్న
వేదశాస్త్రంబులును స్మృతుల్ విబుధవర్యు
లట్టి నిగమాదు లలరించు నట్టి దివ్య
ఫణితి మాపాలనము, సొంతఫణితి లేదు.

ఇదియే నాపరిపాలనావిధానము. మఱియు

తే. గీ. ప్రజ శరీరము ప్రభునకుఁ బ్రజల కతఁడు
ప్రాణమై యొప్పు, నెందు నిబ్బంగి నున్నఁ
గోరవలయును సుఖములు, మీరు మేము
కలిసి వర్తించుటే మనకార్యసరణి.

పైవిధుల ననుసరించి హృదయైక్యమున నీరక్షీరన్యాయమునఁ బ్రవర్తించుటయే మనధర్మము. మంత్రిశేఖరా! ఆనందవనవాసియై యిందున్న విశ్వనాథప్రభువునకు అన్నపూర్ణాసమేతముగ సకల బంధుమిత్రపరివారములతో మూఁడుదినములలో నీవారణాసిని విడిచిపొమ్మని మాయాజ్ఞగా నీవు దెలియఁజేయుము. పంచ

క్రోశమున నున్న ప్రమథులెల్లరు దెలిసికొనునట్లు మున్ముం దంత టను భటులను జాటఁబంపుము.

మంత్రి: చిత్తము.

దివో: మహాజనులారా! వారణాసినుండి విశ్వనాథప్రభువు వెడలిపోవు నని మీ రేమాత్రము విచారింపనక్కర లేదు. మీ మీ వర్ణా శ్రమోచితకర్మపాలనమే మిమ్మన్నివిధముల నుద్ధరింపఁగలదు. మీ కేకొఱంతయుఁ గలుగకుండ మిమ్మెల్లరఁ బ్రత్యేకముగ విచారించి తగినసాహాయ్య మొనర్చెద - [బ్రహ్మవంకకుఁ దిరిగి] దేవా! నిరంతరము జరుగు సృష్టికార్యమునుగూడ వదలి కష్ట మనక, యింతకాల మిటనుండి దయాపూర్వకముగ నిచటి సర్వ కార్యముల నిర్వర్తించినందులకు మిక్కిలికృతజ్ఞుఁడనగుచున్నాను.
[అని భార్యాసమేతముగ నమస్కరించును]

బ్రహ్మ: సుప్రతాప్రాప్తి రస్తు, ప్రజాభీష్టసిద్ధి రస్తు.

ప్రజలు: వాణీవల్లభునకు జై, దివోదాసమహారాజునకు జై.

[తెర వ్రాలును]

## ద్వితీయాంకము - మూడవరంగము

భృంగి: [ప్రవేశించి తీవ్రముగఁ జూచుచు] ఔరా? అల్పున కైశ్వర్యము పట్టి నర్ధరాత్రమున గొడుగుఁ దెమ్మనినట్లు ఈదివోదాసుస్థితి యంతయుఁ దాఱుమాఱై పరమేశ్వరుని సయితము సరకుఁగొన కుండెనే!

మ. వనులన్ గ్రుమ్మరుచుండి, కాయకసవుల్ భక్షించువానిన్ గడున్ ఘనుఁడంచున్ వచియించి పేర్మి నిటు లీక్ష్మానాథునిన్ జేయఁ గ న్గొనఁ డా దాతను నేత, ద్రోహి నిటలాక్షున్ దోలునౌరౌర! యి మ్మనుజాకారపశున్ సహింప నిఁక మామర్యాద పెంపారునే? ఔరా! ఏమి యీతని దురాగ్రహము.

మ. ప్రమథాటోపముఁబూరికిన్ గొనఁడుదుర్వారోద్యమున్ భైరవున్ జమగాఁ జూడఁడు క్రౌంచదారణుని లక్ష్యం బే మనున్ వీరభ

ద్రమహాద్భుత్యము నెంచఁ డించుక దివోదాసుండు గర్వాంధుఁడై
శమనోద్వృత్తిహరుఁ హరుఁ వెడల నాజ్ఞాపించు నింకేమనఁ?
ఇంక నే నూరకుండరాదు.

మ. ఇది నేఁజెప్పినయంతనే ప్రమథు లెంతే రోషరూక్షాక్షులై
గదలుఁ శూలములుఁ ధనుప్రహృతులుఁ గైసేసి హస్తంబులఁ
మదమాతంగచయం బనంటితెరులఁ మర్దించుభంగిఁ మహా
మదమత్తుండగు వీని, నెల్లబలముఁ ప్రమందింప రే ప్రేల్మిడిఁ
కాన నిప్పుడే యీవృత్తాంతమంతయు వీరభద్రాదుల కెఱింగించి
యీ దివోదాసు గర్వోద్రేక మణంగించెద.

[అని యుద్వేగమునఁ బోఁబోవును]

గణ : [ప్రవేశించి] భృంగీ! సంభ్రమించు చున్నట్లుంటి వెందులకు?

భృంగి : [గణపతికి నమస్కరించి] ప్రభూ! ఇప్పుడుగాక యింకెప్పుడు సంభ్రమము! కొండలుసయితము సంభ్రమింపవలయును. ఈశ్వరావమానము, సర్వప్రమథతిరస్కారము, ఇంక నా కాజ్ఞ యిండు, పోయివచ్చెద.

గణ : ఎక్కడికిఁ బోయెదవు?

భృంగి : ప్రమథులకడకు.

గణ : ఎందులకు?

భృంగి : దివోదాసుదుర్నయమును, దురుక్తులను వీరభద్రాదులకు విన్నవించుటకు!

గణ : భృంగీ! ఆ దివోదాసునియభిప్రాయమును దొలుతనే విధి యెఱింగింప విశ్వనాథు లంగీకరించిరిగదా! నీ విప్పు డాగ్రహించిన నేమి ప్రయోజనము?

భృంగి : మానవమాత్రుఁడు చేయు నవమానమును సయితము మహేశ్వరుఁడు భరింపవలసినదేనా?

గణ : భృంగీ! లోకరక్షణమునకై విసమును భరించిన దేవదేవున కిట్టి యల్పాపరాధ మొక లెక్కలోనిది కాదు. ఇంక మన వేగిరపా

కెంతయు విఫలమేకాని సఫలము కానేరదు.

ఉ. లోకములెల్ల మేల్గనఁ ద్రిలోచనుఁ డెప్పుడుఁ జూచుచుండు నీ
లోకసుఖార్థమై తనదులోకమునుక్ సుఖముల్ త్యజించుఁ జీ
కాకుగ నున్న యిబ్భువినిఁ గావఁగ నీన్నృపు నుంచె, వానిపై
మీకును మాకు రోసములు మీఱిన నెగ్గగు, మ్రింగ లగ్గగుక్

ఇంతియేగాక విశ్వనాథప్రభువు దివోదాసు నెవ్వరు నేమనరాదని ప్రమథుల కాజ్ఞయిడి మందరుని యాహ్వానమున నాతనితపః ఫలముగ నాకవ్వపుగొండపై నుండఁ బయనముచేయుచున్నారు. మనమును బ్రయాణము చేయవలయును. పోవుదము రమ్ము.

భృంగి: ప్రభూ! అఖిలలోకాధినాథులగు సన్న పూర్ణావిశ్వనాథులకు నివాస మడవులు, కొండలు, ఆశ్రమములునా?

గణ: భృంగీ! ఎవరిని స్మరించిన సకలబాధలు సమయునో, యట్టిపార్వతీ పరమేశ్వరులకువారిపరివారమునకుఁ గుటుంబమునకుశ్రమయనుట యజ్ఞానము. మనమందర మందుందుమని మందరుఁడు సంతసంబున దన నపరస్వర్గమును జేసికొని యీశ్వరాగమనమును నిరీక్షించు చున్నవాఁడు. ఇంకఁ బోవుదము రమ్ము.

భృంగి: చిత్తము. [ నిష్క్రమింతురు ]

# దివోదాస నాటకము

## తృతీయాంకము

[ మహారాజ భవనమున దివోదాసు కూర్చుండియుండును. ]

దివో : [ స్వ ] సస్యశ్యామలయై సర్వాంగసుందరియై నిత్యనూతనయై నయనానంద మొదవించు నీభూతలలక్ష్మి మందానికినిని వీడిన పొందామరవలె నెంత కళావిహీనముగ నున్నది. ఎంత మనః క్షోభమును గలిగించుచున్నది!

శా. చాతుర్వర్ణ్యవిధాన మాశ్రమవిధుల్ సత్కర్మ దేవతాభూషణ
వ్రాతంబుల్, దయ సత్యశౌచములు తద్బాహూరుపాదంబు, లా
ఖ్యాతంబౌ నిగమంబు శీర్షము, తదీయానూనసర్వాంగశో
భాతారుణ్యము వీడె, నెట్లు సమకూర్పన్ వచ్చు నాకియ్యెడన్.

[ అని నిమేషమాత్రము నిశ్చేష్టుఁడై యోజన నభినయించి తెరవకంకుఁ దిరిగి ]

ఎవఁడురా? అక్కడ.

సేవకుఁడు: [ ప్రవేశించి ] ప్రభూ! [ అని రాజును సమీపించును ]

దివో : [ నిట్టూర్చి ] ఓరీ! మంత్రిముఖ్యులు వచ్చిన లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ : చిత్తము దేవరా! [ అని నిష్క్రమించును ]

దివో : [ స్వ ] ఇంకొక్క క్షణమైన నే నూరకొనరాదు! నా దేశమును నేను సకలబాధావిరహిత మొనర్పవలయును! నా రాజ్యమును నేను సర్వసుఖాస్పదము గావింపవలయును. నా ప్రజల నే నానంద డోలికల నూపవలయును! అప్పుడు నేను గంటినిండ నిదురింప వలయును!

మంత్రిముఖ్యులు: [ ప్రవేశించి ] జయము జయము మహారాజులుంగారికి!

[ అని నమస్కరించి యాసీను లగుదురు ]

దివో : మంత్రిశేఖరా! విశ్వనాథుఁడు సపరివారముగఁ బ్రమథగణము లతోఁ బయన మొనర్చెనా?

మంత్రి: ప్రభూ! దేవరవారియాజ్ఞల నే మందఁజేయకముందే విశ్వానాథాదులు పయనములు సాగించిరి. ఇంకను సందుగొందుల వెదకించి సర్వమును శోధించి యందందుఁ దారాడు బడుగు బక్కలను సైతము తఱిమి, ధరణి వెడలించి యాలయముల కన్నింటికిఁ దాళములు వేయించితిని.

దివో: మంచిది. సచివశేఖరులారా! పండితోత్తమా! తల్లిలేని చంటి పిల్లవడువున నీవసుంధర చిరకాలమునుండి పయోబిందుసందర్శనము లేక మిక్కిలి నీరసించినది. ఇంక నుపేక్షించిన ప్రయోజనము లేదు. అనావృష్టిచేతనే యీజగత్ క్షోభము. తత్పరిహారమునకై దేశమునఁగల విప్రవర్యుల రావించి, కారీర్యాదులను గావింపవలయును.

అందరు: [ సంతసము నభినయింతురు ]

పండితుఁడు: ప్రభువులయాజ్ఞ అవశ్యము జరుగవలయును.

మంత్రి: తప్పక నెఱవేఱఁగలదు!

దివో: మహాక్షామమునకు నిలువనేరక తాఁటుమాత్రై పరస్థలములనున్న జనుల నందఱ రప్పించి వారికెల్లరకు మున్ముందుచితవసతుల నేర్పఱచి యన్నవస్త్రములు సమకూర్పవలయును. తగురీతి జీవనము లేర్పఱుపవలయును. ఇంతియేగాదు!

మ. వికలంబయ్యెను బాడిపంటలు, జనుల్ విక్షోభముల్ సెంది రా
వికలత్వం బెడలంగ జీవనదులన్ వేవేగ బంధించి, ధా
త్రికిఁ గల్యాణపరంపరల్ వెలసి, యా రింబాయ లోకంబు, మా
మక రాజ్యంబు సుఖాస్పదంబు నొనరింపన్ మీరు యత్నింపరే!

మంత్రి. [ సంతసముతో ] ప్రభూ! నీవు లోకరక్షణమునకై పుట్టిన సాక్షాద్ధర్మదేవతవు. మీకోరికలన్నియుఁ గొనసాగును.

దివో: మఱియును

మ. నిజవర్ణాశ్రమధర్మముల్ ధరణికిన్ నిక్షేపముల్ గాఁ గళా
వ్రజముల్ వేదములెల్ల శాస్త్రములుశోభల్ గూర్ప నౌత్సన్నతిన్

ప్రజ లింపొందుచు స్వస్వవృత్తులఁ గదుర్ వర్ధిల్ల, నన్యాశ్రయం
బు జగంబుల్ విడిపో, స్వపోషణవిధుల్ పొల్పారఁ బండింపుఁడీ!

మ. పరదేశంబుల కొజ్జబంతియయి భూభాగంబు రాణింప, నా
సురనాథుల్ గని మేల్ సెబాసన, జనుల్ సొంపొంద, నేమూల నే
నరమాత్రుండును లోపమన్న దెటు గానంబోకయుండర్ మహా
త్తర మై గ్రాలవలెన్ సమస్తము దివోదాసప్రభుత్వంబునన్.

మంత్రి: సార్వభౌమా! తమకుఁగల సర్వసామర్థ్యములు, ప్రజానురాగము, రాజ్యపాలనవిధానము సర్వము సమకూర్చును.

దివో: ఆయమును జూచుకొని వ్యయముఁ జేయుట యెన్వరికైనను దగిన పని. వినను

తే. గీ. తెలుగు కోశం బుటం చెందుఁ దలఁపవలదు
ఘనతమంబైన మత్తపోధనము గలదు
కోటిసేతువులేక సమకూర్పవచ్చు
వెలయఁ జేయుఁడు దేశంబు వివిధగతుల.

మంత్రి: ప్రభూ! ఇంతకంటెఁ గాఁదగిన దేమున్నది? ఇట్టి చేయూఁత యున్న నన్పృతవాహినులు ప్రవహింపవా? మర్త్యలోక మమర్త్యలోకము కాకుండునా? దేవా! మన దేశమున జల పాతప్రదేశము లెన్నియో గలవు. విద్యుద్విభవమునుగూడ వెలయింతము.

దివో: చేయుఁడు. ఆ ప్రయత్నమునుగూడ సంపూర్తిగఁ జేయుఁడు.

మంత్రి: చిత్తము.

దివో: సేనానాయకాగ్రణీ!

సేనా: ప్రభూ! [అని లేచి నిల్చును]

దివో: నీ వీ మంత్రివర్యుని గలిసి దేశ మన్ని యెడలఁ జూచి యవసరమైన చోట్ల వలయు సైన్యమును, ఒక్కొక్క సేనాపతిని నుండ నియ మింపుము. రాజ్యరక్షణభార మంతయు నీ శిరమున ధరింపుము. అవసరముల నన్నిఁటిని నిర్వర్తింపుము.

సేనా: ప్రభువులయాజ్ఞ. [అని నమస్కరించి కూర్చుండును].

దౌవా: [ప్రవేశించి] జయము జయము మహారాజులుంగారికి. ప్రభూ! విదేశాగతులు దేవరదర్శనార్థము నిరీక్షించుచున్నారు.

దివో: [మంత్రివంకకుం దిరిగి] నేఁడు వచ్చిన ప్రజ లెందఱు?

మంత్రి: రెండువే లుందురు.

దివో: వీరి కందఱకు భోజనము పెట్టించి, దేశకులవయోవిద్యాసాశీల్యాదులఁ బరీక్షించి తీసికొనిరమ్ము.

అందఱు: ఆజ్ఞలకు బద్ధులము. [నమస్కరించి లేతురు].

[తెర వ్రాలును].

## తృతీయాంకము - రెండవరంగము

[అనంగమోహిని ప్రవేశించును]

అనంగ: ఆర్యపుత్త్రుని పరిపాలనావిధానము, కార్యదీక్ష మిక్కిలి ప్రశంసనీయములు.

ఉ. ఒక్కరినేర్పు తీర్పు మఱియొక్కరి కొప్పక; యొక్క రొక్కరిన్
జిక్కుల నొంచుచున్ హతము సేసికొనన్ నిలుపోపలేక న
ల్దిక్కుల కేగి క్షామమున గీల్పడువారలఁ జేర్చి యిమ్మహిన్
జక్కనొనర్చు మద్విభుఁడు; స్వర్గము భూమికి దింపునట్లుగన్.

కాని, ప్రభువునకు దినదినప్రయాణములు, దేశసంచారములు, ప్రజారక్షణప్రయత్నములు, అసంఖ్యాకములై, క్షణమైనను దీరిక లేక యహస్సులు సైతము సహవాసార్హరాత్రులంబోలి రాజదర్శనశూన్యములై నా నేత్రకువలయములు ముకుళింపఁ జేయుచున్నవి. ఇంతియేగాక పౌరాంగనలు విదేశాగతులు నెందఱో వచ్చుచు, నెన్నియో ప్రియములుపలికి పలికి, చిట్టచివఱ కన్నపూర్ణావిశ్వనాథులు లేని యీ యానందవనము మాడెందములఁ గుందఁ జేయుచు శ్రేయోవిహీనమై యున్నదని చెప్ప లేక చెప్పుచుండిరి. వారి పలుకులయందుఁగూడఁ గొంత సత్యము లేకపోలేదు.

కర్మయే సర్వోన్నత్యసాధనమని పూర్వపుత్రుల యభిప్రాయము. అందుచేతనే యీశ్వరనిరాకరణము జరిగినది. కాని సర్వధర్మఫల స్వరూపమైన మోక్షధర్మమును, దత్సాధకమైన యీశ్వరసేవనమును నిరాకరించుటచే యూర్వపుత్రుని రాజ్యపాలనము సర్వజనాదరము వడయనేరక యున్నదని చెప్పవలసియున్నది. నేటిసభావృత్తాంతము విన, సార్వభౌము లింక మహానదుల కడ్డుకట్టలు కట్టించుప్రయత్నమున నుందురనుటకు సందియ ముండదు. ఇంక నా ప్రభుదర్శన మెప్పుడో, యేవిధముననో తెలియనేరను. ఇంక నాకర్తవ్య మిప్పటి కేమియు లేదు. కానిమ్ము, సమయమునకై వేచియుందును.

[అని నిష్క్రమించును.]

## తృతీయాంకము - మూడవరంగము

[ఇంద్ర బృహస్పతులు ప్రవేశింతురు]

బృహ: మహేంద్రా! ఏమి జరిగినది?

ఇంద్ర: గురుదేవా! ఈదివోదాసెంత కఠినకర్ముడు! ఎంతసాహసికుడు! సకలమానవమాననీయుడై ఋషిగణసేవితుడై బృందారకేంద్రవందితచరణారవిందుడైన విశ్వనాథప్రభువును కన్నపూర్ణాసమేతముగ నెల్లప్రమథులతో లోకోన్నతమగు నా కాశీనివాసమును మాన్పించెనే! ఇంకేమి సేయలేము? ఔరా!

శా. ఏ కాశీపతిపాదపద్మభజనంబే సర్వసంపత్ప్రదం
బై కైవల్యనిదానమై యలరునో, యా సర్వలోకేశ్వరుం
డా కాలాంతకు డొక్క-మానవుని యాజ్ఞాధీనుడై యుండునే?
యాకొండన్ దరిదాపులేనికడ, నౌరా! కాలమాహాత్మ్యముల్.

దేవా! ఇంతటిదేవదేవాపచారి యింక దేవతల నుపేక్షించునా?

ఉ. కల్పశతంబు లేగినను గంజభవుల్ పలుమారు మాఱినన్
బొల్పుగ నుండి ప్రాణులకు ముక్తి నొసంగెడి విశ్వనాథభూ

కల్పకముల్ వెకల్చి, గడుంగాడ్పుడఁజేసెను గాశి, రాజసం
కల్ప మికెంత కాగలదొ? కన్పడఁబోదది యేమి తెల్పుదున్.
దేవా! ఈస్థితి మాకెల్లరకు మిక్కిలిదుస్సహముగ నున్నది.

బృహ: ఆవిషయ మట్టిదియే. కాని మహేంద్రా! ఆతని విద్యావివేక ములు, పరిపాలనావిధానము నీకుఁ దృప్తిఁగలిగించెనా?

ఇంద్రుడు: గురు రాజా! నాకేమి, నన్నుఁబుట్టించిన బ్రహ్మకును, నట్టి విధాతృ పూజ నందుఁ బురాణపురుషునకును గూడఁ దృప్తిఁగలిగించినవి. ఆహా! ఏమి యా పరిపాలనావిధానము!

గీ. కామగవి కల్పవృక్షంబు కాంచనాద్రి
ధరణి లేనట్టి లోపంబుఁ దలఁపనీక
యున్నియుం దానుగాఁ బ్రజ నలరఁజేయు
నీదివోదాసునేలిమిఁ జెప్పఁదరమె?

సీ. సరసవాగమృతంబు జాలువాఱు టెగాని
పనసముల్ వానకాఱఁగొరలఁబోవు
నెలతామరలఁబోలి విలసిల్లు టెగాని
కందోయి నిప్పుకల్ చిందఁబోవు
ఒఱను వేసినకత్తి యుఱికియుండు టెగాని
మృత్యుజిహ్వకయయి మొఱయఁబోదు
చెఱసాల లవి రాజ్యచిహ్నంబులే గాని
దుండగీంద్రనువారె యుండఁబోరు

గీ. కస్తి యనుమాట కన్నంట స్వస్తిగాఁగ
ధర్మదేవత యెల్లెడఁ దాండవింపఁ
గలికమునకైన దొసఁ గెందుఁ గానరాక
క్రాలుచుండు దివోదాసుపాలనంబు.

చ. చదువనివాఁడుకాఁ డఖిలశాస్త్రములం జతురుండె, ధర్మముల్
వదలెడువాఁడుకాఁడు ప్రజ వర్ణవిధుల్ గన నేలువాఁడె, మే

లోదవఁగ మర్త్యలోకమున కున్నతిఁ గూర్చుచునున్నవాఁడె, యి
ట్లుదటున నీశుఁ బొమ్మనుటె యాతనిలోఁ గలలోటు దేశికా !

బృహ: విధాతయు విశ్వనాథులును ప్రపంచస్థితి నవలోకించి యాతనిని ప్రభువును జేసినఁ జేయుదురుగాక! ఈశ్వరనిరాకరణముమాత్ర మతనికిఁ గానిపని.

ఇంద్రు: గురుదేవులు సత్యముపలికినారు. ఈశ్వరునిపై నాతనికిట్టియాగ్రహ మకారణము, అవివేకమూలము.

ఉ. రాజుగ నుండునే శివుఁడు, రాజ్యసుఖోన్నతి కిచ్చగించునే?
ధీజడిమప్రవర్తనము దెల్పుచు నన్యులఁ జేరదీయునే?
యోజనఁ జేసినాఁడె? దురితోదధి మున్గెడువారిఁ దేర్పనే
పూజకొ తృప్తిఁ జెందు సురపూజ్యమహేశ్వరు గెంటు,దంటయై.

అజ్ఞానముననో యహంకారముననో చేసిన యీశ్వరతిరస్కార మెంతయు ధరాతలంబున కంతటికిని దీరరాని యపకారము కాకమానదు. ఓయీ దివోదాసా! ధర్మపరిపాలకుఁడ వగుదువుగాక, అమరేశ్వరేశ్వరుఁడగు విశ్వనాథునివలెఁగా దమరులవలె నైతము, నీవు కానేరవు. నిన్ను మించువారైనను, మానవులు లోకోద్ధరణ మొనర్పలేరు.

ఉ. శ్రీవిలసిల్లు మర్త్యవిభుఁ జేరి నుతించుచు భక్తిఁ గొల్చుచున్
భావనఁ జేయుచో నృపునిభావ మెలర్చినఁ దిండి కిచ్చు, రాఁ
బో వరమిచ్చుఁ గాదనిన భూరిపురం బొకఁడిచ్చు, నిమ్మహా
దేవునిభంగి ముక్తినిధి, దివ్యులపోలిక స్వర్గ మిచ్చునే?

బృహ: నిజము, మహేంద్రా! నిజము. అందుల కితఁ డసమర్థుఁడు. అయినను బాడువడినచేను పంటభూమియైన ట్లీ ధాత్రీరమణి యీతనిమూల మున ముఱువుసూపినది. భక్తిముక్తివిధానముల కింక మనప్రయత్నము తప్పదు.

ఇంద్రు: గురుదేవుల యుపదేశమే సర్వకార్యనిర్వహణసాధనము. దయ యుంచి యానతీయుఁడు.

బృహ: దేవనాథా! దివోదాసు ధర్మకవచధారి, కులిశాయుధాదులకుఁ దలఁకనేరఁడు. వజ్రభేదనమునకు వజ్రమే సాధనము.

ఇంద్రు: దానినే సెలవీయవలయును.

బృహ: వాయ్వగ్నివరుణులు దేవతలలోనివారలు, నీ వారలు.

ఇంద్రు: అయిన?

బృహ: ఆమువ్వుర నెటులనో పంచక్రోశపరీత మగు కాశీక్షేత్రమున తమశక్తుల నుపసంహరించుఁ డని కోరవలయును.

ఇంద్రు: కోరిన?

బృహ: నిప్పు నీరు గాలి లేకున్న దేవతల కిచ్చు హవ్యకవ్యాదులకుఁ గాని భోజనాదులకుఁగాని యెందులకు వీలుగాక ప్రజాక్షోభ మేర్పడును. ధర్మము చెడును. జనులకు రాజుపై విరక్తి కలుగును. దేవపూజలు ప్రజానురాగము లేని ప్రభుత్వము నిలుకడ లేక చెడును.

ఇంద్రు: అటులనా? [యోజన నభినయించి] గురూత్తమా! దివోదాసణిమాద్యఖిలయోగశక్తిసంపన్నుఁడు. ఈమూఁడురూపములు తానే తాల్చి ప్రజారక్షణ మొనర్చిన?

బృహ: అట్లయినఁ దన్మూలమున నాతనిశక్తు లన్నియు నతిశీఘ్రముగ సన్నగిల్లును. అప్పటిస్థితి ననుసరించి మఱల విచారింపవచ్చును. ఇప్పు డిదియే కర్తవ్యము. ముం దగ్నిభట్టారకునిఁ బ్రేరేపించి యతనిశక్తి నుపసంహరింపఁ జేయుము.

ఇంద్రు: దేవా! ఇంకఁ గార్యక్రమమునకుఁ గడంగెద. సెల వొసంగుఁడు.

[అని నమస్కరించును.]

బృహ: అభీష్టావాప్తి రస్తు [ఇద్దఱు నిష్క్రమింతురు]

తెరవ్రాలును

---

# దివోదాసనాటకము

## చతుర్థాంకము

[రాజభవనప్రాంతమునఁ బురుషవేషమున అనంగమోహిని ప్రవేశించును]

మోహానరాజకుమారుఁడు: [స్వగతము] మోహానరాజకుమారనామమున నా నిజవేషము బయల్పడకుండ జలస్తంభనవిద్యాకౌశలమున గోదావరీసేతుబంధమునకుఁ గలిగిన యాటంకమును దొలఁగించితిని. దీనితో రాజచంద్రునకుఁ జింతాగ్రహబాధ యంతరించియుండును. ఈ యుత్సాహసమయమునఁ బ్రభువు కొంచెమైనఁ గృతజ్ఞతఁ దెలుపకమానఁడు. తటేఁజూచి నాకోరికను గొనసాగించుకొనఁ బ్రయత్నించెద.

మంత్రి: [ప్రవేశించి] జయము జయము రాజకుమారునకు. మోహానరాజకుమారా! తమ యిష్టానుసారమే మీ దర్శన మపేక్షించుచుఁ బ్రభువు ఏకాంతభవనమున నున్నారు. దయచేయుఁడు.

మోహా: రాజకార్యము లేవియు లేవుగదా!

మంత్రి: లేవు.

మోహా: ఎందుచేత?

మంత్రి: తమవలన సేతుబంధనకార్యభారము తీరినదన్న సంతోషముతో మహారాజులుంగారెల్లరకు వారముదినములు విరామ మొసంగినారు. ఏకాంతగోష్ఠికిఁగూడ తమకుఁ దగినంత యవకాశము లభింపఁగలదు. దయచేయుఁడు [పరిక్రమింతురు.]

### చతుర్థాంకము - రెండవరంగము

[ఏకాంతగృహమున మహారా జుత్సాహముతో నటునిటుఁ దిరుగుచుండును.]

మోహా: [ప్రవేశించి] జయము జయము మహారాజులకు. [ప్రభువును సమీపించి] సార్వభౌమునకు మోహానుఁడు నమస్కరించుచున్నాఁడు. [నమస్కరించును.]

దివో: [సంతసముతో] ఓహో! మోహనరాజకుమారులా! గోదావరీసేతుబంధనకార్యనిర్వాహకులు, రండు, దయచేయుఁడు. [అని చేతులు పట్టికొని యున్న తాసనమునఁ గూర్చుండఁబెట్టఁబోవును.]

మోహ: [వారించి] సార్వభౌములకడ నింతటిస్థితి యనభిమతము. నాకుఁ దగురీతి నన్నుఁ జూడుఁడు. కూరుచుండుటకు మాటలాడుటకు నాకొకింత స్వాతంత్ర్య మనుగ్రహించవలయును. [అని చేతులు వదలించుకొనఁ బ్రయత్నించును.]

దివో: ఇంక మీరు సర్వస్వతంత్రులు [అని చేతులు వదలును.]

మోహ: అటులైనఁ బ్రభువు లిందు దయచేయుడు. [అని చేతులు పట్టి ప్రభువు నున్న తాసనమునఁ గూరుచుండబెట్టి తా నుపవిష్టుఁడగును.]

దివో: మోహనరాజకుమారా! నీవు నాయదృష్టదేవతవు. పదియేండ్లనుండి సర్వవిధముల నన్ను బాధించుచున్న గోదావరీసేతునిర్మాణావరోధము నవలీలఁ దొలగించి నాహృదయశల్యము నూడఁబెఱికి నన్నుద్ధరించితివి. నాపడినపాట్లు దలఁచిన, నిప్పటికిని హృదయము తల్లడిల్లుచుండును.

మ. ఘనమేధావులు సేతుకార్యఘటకుల్ గణ్యుల్ గుము ల్గూడినన్
ధన మెట్లై వడిఁ బాఱుచుండిన దశాబ్దంబుల్ శ్రమం బందినన్
బని నెగ్గించినవాఁడు లేఁడొకఁడు నీ ప్రావీణ్య మేమందు? వీ
క్షణమాత్రంబున బుగ్గలేఱు నడుసున్ స్తంభించె నొక్కుమ్మడిన్.

ఆ యదనున ప్రమాదముదాఁటిన యీ యానకట్ట యింక గట్టెక్కుట సుకరము. ఇట్టి జగత్కల్యాణకార్యమునఁ దోడ్పడిన మీ సుకృత మమేయము. గోదావరీసేతుబంధనమున నింకఁ బ్రజల కన్నము లేదన్నమాట యుండదు. తలపెట్టిన కార్యభారము తీరినందులకు నేము మిక్కిలిధన్యులము. దుర్ఘటకార్యమున సాయపడిన మి మ్మెట్లాదరింపవలయునో యెఱుఁగఁజాలకున్నాను. మోహనరాజకుమారా!

మ. భరతక్ష్మారమణీయశోధనము మా ప్రాణాలకున్ బ్రాణ మీ
వరగోదావరిసేతుబంధనము ప్రాప్తంబయ్యె మీచే, భవ
ద్గరిమం బెన్నఁ దరంబె? మీఋణము మీఁగన్ శక్యమే? యైన నీ
ధరణీసుందరి నీకొసంగుదుఁ గృపన్ ధన్యాత్మునిన్ జేయవే.

[అని రాజకుమారునకుఁ బుష్పమాల వేసి చేతులు పట్టుకొనును].

మోహ: మహారాజా! మీ యాదరణపాత్రుడనై మిక్కిలి ధన్యత నొందితిని. తా మెట్టి మహోదారస్వభావులని జగన్మంగళకార్యకరణపారీణులని చక్షుశ్శ్రోత్రోహితముగఁ గని విని మీసేవకై పాతాళమునుండి వచ్చితిని. అట్టి నేను మీకడఁ గూరుచుండుట సైత మనర్హము. అంతియేగాక నా యభాగ్యమున కంతులేదు. ధరణీసుందరి నిత్తుననుచున్నారు. నన్నాలింగిసంతవఱకు నా కెవ్వరును గన్నెల నీయరు.

దివో: మిత్రమా! మీ కింకను వివాహము కాలేదా?

మోహ: నాకొఱకు నాతల్లి లోకములెల్లఁ దిరిగి యేర్చికూర్చినది. అపరశారద, మహాగుణవతి, మదనమోహిని. అట్టి యాధర్మపత్నిని దక్కించుకొననేరక యుంటిని, నే నీ ధరణీసుందరి నందుకొని సౌఖ్యమందుదునా ప్రభూ!

దివో: అయిన నిపు డామె యెక్కడ?

మోహ: ఏమని చెప్పుదును ప్రభూ!

దివో: ఏమది?

మోహ: ఇప్పు డయ్యమరలోకమున నా మదనమోహిని, నా సౌభాగ్యరాశి, స్వర్గసుందరియై నాకై యెదురుచూచుచున్నది. [ఆకసము దిక్కై] అదిగో చందనపాత్ర, అదిగో మందారమాల. దేవీ! నాయపరాధములను మన్నించి యక్కడఁగూడ నాకై యెదురు జూచుచుంటివా? ప్రేయసీ! నీసన్నిధికి రాలేని మందభాగ్యుఁడను, భార్యాఘాతుకుఁడను. దేవతలు స్వర్గమునకు రానీయరు. ద్వారములు తీయరు. క్షమింపుము. నన్ను దయతో క్షమిం

వుము. [అని వివశుఁడై కనులుమూయును].

దివో : [ఉపచరించుచుఁ దనుస్పర్శమున నించుక సంశయించుచు] ఇది యేమి, యీతఁ డెట్టులనో కన్పట్టుచున్నవాఁడే! కానిమ్ము, [అని నిట్టూర్చును]

మోహ: [కన్నులు దెఱచి ప్రభువునుజూచి రిచ్చపాటు నభినయించి] ప్రభూ! నేను మిక్కిలి యపరాధిని. తా మిట్టిపని చేయఁదగదు. [అని ప్రభువు నుపవిష్టునిఁ జేయుచు] ప్రభూ! నాప్రియురాలిని దలంచిన నాహృదయము తేలిపోవును. నేను బేల నగుదును. క్షమింపుఁడు.

దివో : మిత్రమా! చేష్ట లాకారసదృశములు. సకలకలాకరమై బాల చంద్రుసలీల వెలుఁగొందు నిట్టిపవిత్రమూర్తి యట్టిసాహసమునకుఁ బాల్పడునా? మిమ్ము భార్యాఘాతుకు లనుటకు నాచిత్త మంగీకరించుట లేదు.

మోహ: మహారాజా! నాప్రజ్ఞావిశేషమునకుఁ జిత్రకళానైపుణ్యమునకు మెచ్చి యానాగలోకప్రభువు లెల్లరు నన్యలోకములను దల్లోక విశేషములను జిత్రరూపమున వెలయింప నన్ను మిక్కిలి ప్రోత్సహించిరి, కానుక లర్పించిరి. ఆలోకవిశేషములకొఱకు మైమఱచి, యింటిని నిల్లాలిని సర్వమును మఱచి సంచరించితిని. ఆసమయమున నాప్రియురాలు పడిన బాధలు, మనోవ్యథలు, అచింత్యములు, అనిర్వాచ్యములు. ఇది నాప్రేయసి తుదిలేఖ. దీనిని నేఁజదువఁబోయిననాకెన్నియో జ్ఞప్తికివచ్చి,నాయొడలు కంపించి డగ్గుత్తిక యేర్పడును. కాన దయయుంచి తా మొకమాఱువిన్పింప వేడుచున్నాను [అని లేఖ నిచ్చును.]

దివో : [పత్రికనుజూచి] (శ్రీ)(శ్రీ)(శ్రీ) హృదయనాథుల చరణకమలముల సన్నిధిని ప్రణామపూర్వకముగ సమర్పించుకొను విజ్ఞాపనము.

తే. గీ. వక్కలాకులు చందనప్రసవములును
భక్ష్యభోజ్యంబులన్ గూర్చి ప్రతిదినంబుఁ

బాలుపం డ్లెన్ని యో చేర్చి ద్వారమందు
నిలుతుఁ గన్నీ్ళతు; నిరీక్షింతు, నీవు రావు.

తే. గీ. ఎన్నిదినములో, నెల లెన్నొ, ఋతువు లెన్నొ,
వత్సరా లెన్నొ, యేమియు వ్రాయలేను,
లెక్క నేఁ జెప్పలే నిపు, లేదు మనసు,
రాదు నీదరి, కే మనరాదు, నిన్ను.

తే. గీ. ప్రాణపదమైన పతి తన ప్రాపు నీఁడు,
అతులితుండగు పతిఁ బోలు సుతుఁడు లేఁడు,
వనరు సతి కేది దిక్కు నావంక కింక
రాకు, సరియగు, నేఁటితో, నీకు నాకు.
ఇది నాయంత్య లేఖ

ఇట్లు సేవకురాలు,
మదనమోహిని.

దివా:[నిశ్శ్వసించి]నిజముగ నామె యీ యవస్థ మిక్కిలిశోచనీయము.

మోహ: ప్రభూ! ఈ లేఖనుజూచి నేనింటికిఁ బోవునరికి నాకు లభించినవి నా ప్రియురాలి భస్మశేషము, శల్యశేషములు. ఇంక నేనేమిచెప్పుదును? నా సతీవిలాపగ్రంథమును మోయ బండ్లు చాలవు. దానిని విప్పిన నేండ్లు చాలవు.

దివా: మిత్రమా! గతమునకు వగవకుఁడు. మీ యందచందములు చూచి మీపసితనమున నాగాంగన యొకర్తు పాతాళమునకుఁ గొనిపోయి మిమ్ముఁ బెంచెనని, భారతీయుఁడ నని, క్షత్రియ వంశసంభవుండ నని తొలుత నాతోఁ జెప్పియుంటిరిగదా! మా మంత్రిశేఖరునిబంపి యసమానరూపలావణ్యవతియగు క్షత్రియ కన్యకను విచారించి పరిణయమొనరించి మి మ్మొక మహీతలాధీశ్వరునిఁ జేసెద.

మోహ: ప్రభూ! నేను వ్యర్థజీవిని. నా కింక రమణులేల, రాజ్యములేల? నాకడఁ గల మణిమంత్రౌషధశక్తులను అమూల్యములగు మణిహారాదులను నాసర్వస్వమును దమకు సమర్పించుటకే నేనిటకు

వచ్చితిని. ఇది నాసతీమణి శిరమున ధరించు జీవమణి. [జేబునుండి పైకిఁదీసి.] దీని ప్రభావ మమేయము. దయతో గ్రహింపుఁడు. [అని మణి నిచ్చెను.]

దివో : [మణినిజూచి స్మృతి నభినయించి మోహానునిజూచి యాశ్చర్యముతోఁ దల పంకించుచు సాభిప్రాయముగ] మిత్రమా! నామములవలె మణులుగూడఁ బాతాళమున నొకేవిధముగ నుండు నేమి!

మోహా: ఏల యిట్లందురు?

దివో : అనంగమోహిని నాభార్య. మదనమోహిని మీభార్య. సరే! మన్మథమోహిని యనిగూడ నుండనచ్చును. ఈమణికూడ నట్టిదిగనే యుండుటచేత.

మోహా: దానికేమి? వస్తువును బోలిన వస్తువు లెన్నియుండవు!

దివో: పాతాళమున నుందురుగదా! వాసుకిప్రభువుతోఁ గూడ నాయన పుత్రికాపరిణయమున కిచ్చటికి వచ్చితిరా?

మోహా: ఆనాగరాజు తనకన్యకను మీ కిత్తురని మాత్రము వినియుంటిని.

దివో : అటులనా? అన్నివిద్యలతోఁబాటు నాట్యవిద్యను నటనమును గూడ నేర్చితిరా?

మోహా: నటించుట యెన్నఁడును లేదు.

దివో: మిమ్ముఁజూచినకొలఁది, మీరు, మీమాటలు, మాకుఁ జిరపరిచితములవలె నుండి మాయంతఃపురసుందరి నొకర్తెను స్మరింపఁజేయుచున్నవి. మిమ్మాఁడువేషము వేయుమనుట యుచితము కాదు. పురుషవేషమున నామె నిటకు రప్పించి మాసందేహనివారణము గావించుకొనియెదము. మీ రిందే యుండుఁడు. [పోఁబోవును.]

మోహా : [సంభ్రమముతో] ప్రభూ ! ఎందుల కిట్లుచేసెదరు?

దివో : ఎందులకులేదు. జ్ఞప్తికి వచ్చినది. ఆమెకుఁగూడ జలస్తంభన విద్యయందుఁ బ్రవేశముకలదు. శిరోమణియు నిట్టిది గలదు.

ఆమెయే మీరైన నే నమితానందము నందుదును. వేఱైన, మీకుఁ గాదగిన ప్రయత్నము లన్నింటిని మంత్రిచేఁ జేయింతును. మీ రేమియుఁ ద్వరపడనక్కర లేదు. ఇందే యుండుఁడు. [అని పోఁబోవును.]

మోహ: మహారాజా! కొంచె మాగుఁడు?

దివో: ఎందులకు?

మోహ: ఏమియు లేదు. ఈమానిసియు నామగువయు దైవవశమున నొక్కరుగనే యున్న మీకుఁ గినుక వొడమదుగదా?

దివో: [ఎలనగవుతో] కినుక యెందులకు? అక్కఱదీర్చిన యాకాంతను గన్నులారఁ గనుఁగొనియెద? మనసార నాదరించెద.

మోహ: నిక్కమా?

దివో: తప్పక.

మోహ: అట్లైన మీకుఁ బ్రయాస మేల? ఆ యంతఃపురయువతి యువకుఁడు కానేల? ఒక్కక్షణ మాగుడు. ఈ పురుషుఁడే యాపొలఁతి కాఁగలఁడు. [అని యావలి కేగును.]

దివో: [స్వ] అంతయుఁ దెలిసినది. సమయానుసారముగఁ జతురత నెఱపిన యీ చాన నేర్పెంతయుఁ గొనియాడఁదగినది.

అనంగ: [స్వస్వరూపముతోఁ బ్రవేశించి] సార్వభౌము లీ సేవకురాలి సాహసమును మన్నింపవలయును [అని కరములు మోడ్చును.]

దివో: [భార్య నత్యాదరమున దగ్గరఁ గూర్చుండఁబెట్టుకొని లాలనఁ జేయుచు] దేవీ! నన్నుఁగూడ మోసపుచ్చితివే. ఈనటన మెక్కడ నేర్చితివి?

అనంగ: ఇంకెక్కడ? ఇక్కడనే. తమకు లోకాటనము, నాకు నటనము.

దివో: పరోపకారఘటనమునకు నా లోకాటనము.

అనంగ: సేతుబంధసంఘటనమునకు నా నటనము.

దివో: దేవీ! నీవు నిక్కముగ నా కీ కార్యమునఁ దోడ్పడి పతికి సతి యర్ధాంగి యనుమాటను సార్థకము చేసికొంటివి.

అనంగ: మీరు మాత్రమో! భూదారులు మహోదారు లన్నమాటను మఱవకుండఁ జేయలేదా?

దివో: ప్రేయసీ! నిక్కముగ నీయుపకారమునకు నా రాజ్యలక్ష్మీప్రదానౌదార్యము చాలదు.

అనంగ: ఇంకను నిత్తురా?

దివో: ముందిచ్చినదానిని బుచ్చుకొనుము. పిమ్మటఁ జూతము. లే లెమ్ము. ముందు సింహాసన మధిష్ఠింపుము. [అని చేయిఁబట్టి లేవఁదీయఁ బోవును.]

అనంగ: నే నా యున్నతాసన మలంకరించుటయు రాజ్యమేలుటయునా? బాగుగనున్నది. ఊఁహు. నావలనఁగాదిది. ననునిర్బంధించవలదు.

దివో: దేవీ!

మ. గ్రహమట్టుల్ చలపట్టి నేతువు మహోగ్రంబై ననుర్, నీ యను
గ్రహదానంబునఁ దేర్చి తా నృపకుమారఖ్యాతి, సద్దానికిన్
బహుమానంబిడినాఁడఁగాదె, గొనుప్రాప్తంబైనరాజ్యంబు,హూ
ఉహుహూ ల్నేల్లవు నేనె మంత్రినయి నిన్నొప్పింతు మేల్మేలనన్.

లే లెమ్ము. [అని యున్నతాసనాధిష్ఠితం జేసి పూలమాలను వేయును.]

అనంగ: [చిఱునవ్వుతో] ఇప్పుడు మిమ్మేమనవలయునో నాకుఁ దెలియ రాకున్నది.

దివో: మంత్రిసత్తమా యనవలయును.

అనంగ: అటులనా! మీయభీష్టసిద్ధికై యొక్కమాఱ ట్లేయందును. మంత్రిసత్తమా! మూఁడువిద్యల కొక్కబహుమానమా? జలస్తంభన విద్యకు మీకై మీరిచ్చిన రాజ్యపరిపాలనము సరిగదా! ఇంత కంటె హెచ్చుసత్కారమునకుఁ దగినవి నటనము, కవనము. తద్బహుమానములు కేవలకలావేతృత్వమునకే కాదు. మహారాజస్థానమం దుండికూడ మంత్రివర్యు నర్థించుచున్నాను. ఇంక మాప్రార్థనము వ్యర్థము కాదు.

దివో : కోరికొనుఁడు. మీయిష్టానుసారము కోరికొనుఁడు.

అనంగ: ఈయున్నతాసనముకాదు నేను బొందఁదగినది. మహోన్నత మగు మీ సేవారాజ్యసింహాసనము.

చ. ప్రణుతజగత్త్రయప్రభుత రాజిల, సంభ్రముల దివ్యసుందరీ
మణుల శిరోమణుల్ వెలయ,మన్న నలెన్నియొ వన్నెఁగూర్చినన్
గణనకు వచ్చునే? సతి కఖండసుఖస్థితి నాథుసేవ, రా
ణ్మణి! దయసేయు దాని, నదె మానినికిన్ గనకాద్రి యిబ్బుదిన్
కాన నింక నన్నిప్పుడు నిట్టిపనికి నియోగింపక తమదివ్యచరణార
వింద సేవకై యనుమతింపుఁడు. నా యపరాధముల మన్నింపుఁడు.
[అని సింహాసనమునుండి దిగి పుష్పమాల వేసి నమస్కరించును.]

దివో : [ఆదరముతో దగ్గరకుఁ దీసికొని] దేవి! ఇది ప్రార్థనముకాదు. ధర్మప్రబోధము.

మ. క్షితికాంతాపరిచర్యఁ జిక్కినది నాచిత్తం బనన్యంబుగా
సతియంచున్ బులిసికాలమంచు శుభసంస్థానంబు సంతానసం
స్థితియంచున్ దలపింపఁజేసితి, విధుల్ చెల్వొంద, నాచార్యవీ
వతివా! కానుక యింక నేను భవదాజ్ఞాధీనతన్ బొల్చెటే.

మనబాధలు చాల తొలఁగి దేశము సుభిక్షముగ నున్నది. ఇంక నీ యభీష్టము నెఱవేఱును. రమ్ము పోదము.

[ ఇరువురు నిష్క్రమింతురు. ]



# దివోదాస నాటకము

## పంచమాంకము

[మహామంత్రి రామవర్మ ప్రవేశించి పరికించి నిట్టూర్చుచు]

రామ : ఔరా! ఇంతటివైపరీత్య మేనాఁడును ఎక్కడనుగూడ జరిగి
యుండదు. గోదావరీసేతునిర్మాణాది జగదుపకారకార్యము
లెన్నియో విస్తరిల్లి ధర్మబద్ధముగ సకలసుఖాస్పదముగ దివో
దాససార్వభౌమప్రభుత్వ మనుపమానమై మహానందకరమై విరా
జిల్లుచుండ, నీమహారాజపట్టాభిషేకవార్షికోత్సవ మీసంవత్సర
మఖిలప్రజ లమితవైభవములతో నత్యంతోత్సాహములతోఁ
దమకుఁదామై తారకాగణముల నన్నింటిని దులిచి తెచ్చి కూర్చి
నట్లు దీపమాలాకోట్యలంకృతమైన యీకాశీనగర మంతయు
నీరాత్రిఁ బట్టపగలుచేసి, జరిపిన వింతలు, వినోదములు, ఉత్స
వములు, వేడుకలు చెప్పనలవి గాకుండెను. ప్రజాభీష్టము దీర్పఁ
బ్రభువు మహారాజవైభవముతోఁ బట్టణము నవలోకించుచు
వచ్చునపుడు సముద్రము లుప్పొంగినవిధమున నలుదెసలను
బ్రజలానందవివశులై యొకరినొకరుమీఱుచుఁ జేసినగౌరవములకు
వినోదములకు మితిలేదు. ఆ హర్షధ్వనుల కంతములేదు. రాజో
పకృతి కావిధమునఁ బొంగిపొరలు జనుల మహానందమంతయు,
నిమేషమాత్రమునఁ బిట్టపిడుగుగ నొక్కమాఱుగ సర్వమానవ
మనఃక్షోభముగ మాఱిపోయెనే! దీపకోటులన్నియు నొక్క
పెట్టున మటుమాయ మగుటయేగాక యఖిలగృహదీపికలు, సకల
శ్రౌతస్మార్తాగ్నులు, చిట్టచివఱ కిచ్చటిశ్మశానాగ్నికూడ నొక్క
మాఱుగ వలసబోయిన విధము కాఁగా, నొకరినొకరుఁ దెలియ
నేరక, 'యెవరికివారే యమునాతీరే' యన్నట్లు వారణాసియంతయు
నల్లకల్లోలమై యెక్కడివా రక్కడనే కుప్పలుగఁగూల నెటులనో
మహారాజును రాజమందిరమునఁ బ్రవేశపెట్టి యిప్పటికి బయటఁ
బడఁగలిగితిని. ఈయైదుక్రోసులమహానగరములోను నొక్క

మాఱుగ నగ్ని యణఁగారుట; యిది యేదో దైవపరీక్ష కాని యన్యము కానేరదు. [ఆలోచించి] అవును, దేవత లీరాజుపైఁ జలపట్టినారు. అధిష్ఠానమును దిరస్కరించి యారోపితము లెన్నాళ్ళు నెగ్గగలవు? ఈ యధిష్ఠానారోపితసంఘర్షణమున కఖిలాత్మస్వరూపుఁడగుపరమేశ్వరావిర్భావమే నివారకము కాఁగలదు. దీనికిఁ గొంతకాలము పట్టవచ్చును. [వినుట నభినయించి] అదిగో మహాప్రమాదసూచకమగు మహాఘంటాఘోషణము వినఁబడుచున్నది. సూర్యోదయముకూడఁ గావచ్చినది. ప్రజ లెల్లరు మహారాజప్రాసాదమున కరుగుచున్నారు. ఇంక మహారాజు సైత మాస్థానమంటపమునకు రావచ్చును. నేనును బ్రభుసన్నిహితుఁడ నయ్యెద. [అని నిష్క్రమించును.]

## పంచమాంకము - రెండవరంగము

[మహారాజభవనము. ఆస్థానమంటపమున మహారాజు, మంత్రిసామంతులు పౌరజనపదులు మున్నగువా రుందురు ]

మంత్రి: మహారాజా! తమపరిపాలనము ధర్మయుక్తమై ప్రజ లెల్లరు విహితకర్మానుష్ఠానపరాయణులై కష్టముల మఱచి మహానంద మనుభవించుచుండ, నేఁ డీ పంచక్రోశపరీతమగు వారణాసీక్షేత్రమున నగ్నిభట్టారకుం డేల యంతర్హితుం డయ్యెనో యెఱుంగ నేరము. ప్రభువులు యోజించి మాకర్తవ్యమును మాకుఁ దెలుపఁ బ్రార్థించుచున్నాను.

పండి: సార్వభౌమా! ఆత్మాభిమానుల కన్యోత్కర్ష యవమానకరము కాకమానదు. కనుకనే యీ యగ్నిదేవుం డదృశ్యుండై యుండును.

చ. నిరుపమశౌర్యవైభవవిసర్జితనిర్జరనాయకుండవై
వఱలెడు త్వత్ప్రతాప మనివార్యముగాఁ గని యగ్నిదేవుఁ డి
ప్పురవర మైదుక్రోసులును బూనికఁ గాల్చిలుపంగలేక యా
సురపురిదారి వట్టె, నొరుసొంపు సహింతురె? యెంతవారలున్.

ఇదియే నా నిశ్చితాభిప్రాయము.

సామం: మహారాజా! ఏది యెటులున్నను రాత్రినుండి యీయానంద కాననమందంతటను, అగ్ని యణగాఱుటచే, నిరతాగ్నిహోత్రులు కరములు నలుపుకొనుచు గంద్రగోళపడుచుండిరి. పాకక్రియలకు భంగము వాటిల్లఁ బడఁతు లెంతయుఁ బరిభ్రమించుచుండిరి. నిరంతరము ప్రజ్వరిల్లు స్మశానాగ్నులు మఱుఁగుపడుటచే శవదహనముకూడ సాధ్యముకాకున్నది. ఈయుపద్రవమున కెక్కడఁ జూచినఁ బట్టణమంతయు నట్టుడికిన ట్టుడికిపోవుచున్నది. ఈ వైపరీత్య మడంచి ప్రభువులెల్లరకుఁ బ్రాణదానముసేయఁ బ్రార్థించుచున్నాను.

పౌరు: పెబువులకుదండాలుసామీ! ఏలినవారి ఏలుబడి పదేండ్లకాణ్ణుంచి జనాలశాత అమురుత్తం తాగిత్తుండవు. యేకట్టాలు యెరగం. ఇదేందో గాలో దూలో, దేవర్లో దయ్యాలో, మాకేం తెల్లంలేదు. మా నెగళ్ళుకూడా సల్లారినయి. ఆడ మగ, పిల్లా మేకా, అంతా ఆలగోలంబాలగోలమె. ఊరంతా పస్తే. అంతా యీడికొస్తా వుంటే అందర్నీ ఆపేశినం. ఏలినోరేహో దారి శెయ్యకపోతే, ఆకలిమంట కాగలేక అందరూ గంగలో దూకాల్సిందే. మీ బిడ్డల్ని మీరే రచ్చించాలె. దొరా! దండాలు.

దివో: పండితవర్యులారా! మంత్రిసామంతులారా! పౌరజానపదులారా! ఇప్పు డీ యగ్నిదేవుం డంతర్హితుఁ డైనందుకు మీ రెంతమాత్రమును భయపడవలదు. భూలోకమునుండి విశ్వనాథప్రభువును వెడలఁ జేసితినన్న కోపమున, దేవత లగ్ని నపనయించి మనకుఁ జేసిన యపకార మిది. కొంచె మోపికపట్టుఁడు. వీతిహోత్రుఁడు వేంచేయఁగలఁడు.

పౌరు: అంతా పెబువులదయ.

దివో: ఓ దేవతలారా! తమతమవర్ణములకు, నాశ్రమములకు నుచితమగు సత్కర్మానుష్ఠానమే సర్వాభీష్టములఁ దీర్చుచుండ నీశ్వరుఁ డేలయని, యొక్కచో నిరువురుప్రభువు లుండరాదని, నే నీ విశ్వనాథప్రభువుఁబురి వెడలించుట నిక్కమైనను, మీయెడల నే నెన్నఁ

డును నిరాదరము చూపలేదు. ప్రజాసౌఖ్యమునకు భంగము కలుగనీయలేదు. అకారణముగ మీరు మాకు మా ప్రజలకుఁ గష్టము గలిగించుట న్యాయముకాదు.

మ. సురలన్ మిమ్ము భజింపనో? మఖహవిస్సుల్ నేనె గైకొంటినో?
పరమే లేదని యంటినో? బలిమిఁ జార్వాకత్వమున్ గొంటినో?
దురితం బెయ్యది గల్గెనా యెడ? సమస్త్యల్ మీరిటుల్ ద్రోహులై
సిరతాగ్ని జ్వలనంబు మాన్చితి రహో! నిర్ఘాతపాతంబుగన్.

ఇప్పటికైన ననుగ్రహించి యగ్నిని బ్రజ్వలింపఁజేయుఁడు. [అని ధ్యానము నభినయించి] అమృతాంధసులారా! అకారణాగ్రహము పనికిరాదు.

మ. ఘనులే మీరలు, మిమ్ముఁ గాదనను, నేఁ గయ్యానకున్ రాను, మా
జనమున్ బ్రోచుట మాకుఁ గర్జము, జగత్సంరక్షణార్థంబు మా
పని నగ్గింతును నేనె యగ్నినయి, యావద్భారతం బోముదున్
సనిక ల్గాఁచినఁ బెండ్లి యాగునటె? దుశ్చారిత్రనే వెల్గెడిన్.

తే. గీ. కలదు యోగంబు దపమును గలదు మిగుల
దేనిచే నైన నీపనిఁ దీర్పనేర్తు
వంచనలు మాయ లింక సాగించ రావు
కలహమున కిట్లు గాల్ద్రివ్వ గణనరాదు.

వేల్పులారా! విచారింపుఁడు. అగ్నిప్రజ్వలనమున కనుగ్రహింపుఁడు. ఏమందురు?

[ తెరలో గంట మ్రోగును ]

పురుషుఁడు: [ప్రవేశించి] ప్రభూ! పాకము సిద్ధమైనది.

దివో: ఓయీ! పాక మెట్లు చేసితివి?

పురుషు: ఎట్లు చేయుదును మహాప్రభూ! సూర్యకిరణములచేత.

దివో: అటులనా? సూర్యకరపాకమునకు దోషము లేదు. చూత మా పాక మొకపళ్లెరమునఁ గొని తెమ్ము.

పురుషు: చిత్తము [నిష్క్రమించును.]

దివో: [తలపంకించుచు నిట్టూర్చి] పాకము సూర్యకరపాకము.

పురుషు: [పళ్లెరమున భోజనపదార్థములఁ దెచ్చి ప్రభువుముం దుంచును]

దివో: [పదార్థములను జేతికోఁ జూచి, యెల్లరకుఁ జూపుచుఁ గోపముతో] ఈపదార్థములనా నేనును నాప్రజలును భుజించునది? ఔరా! సుర లెంతదుండగీండ్రు! ఎంతటి వంచకులు.

చ. అడవులనుండి యాకలము లందిన దేధో భుజించి పల్ శ్రమం
బడె తను విద్ది, భానుకరపక్వపదార్థము నైన నోర్చు, నా
పుడమి సురాలయాధికతఁ బొల్పెసలారఁగ, నిట్టి యోగిరం
బిడుదు నె? తిందురే ప్రజలు? హీనత కోర్తుమె ప్రాణముండగన్.

ఆహా! ఎంత సాహసము! ఎంతద్రోహము! దేవతలారా! నాతోఁ బంతగింపకుఁడు. మీకు క్షేమము కలుగనేరదు.

మ. అవురా! యింతటిద్రోహమున్ సలుప మీకై మీకెదన్ బుట్టెనో
శివుఁడే మిమ్మిట్లు చేయఁగాఁ బనిచెనో, సేవావిధిన్ మిమ్ము సం
స్తవముల్ సేసెడి నన్నెఱుంగరె? దివోదాసున్ నృపోత్తంసు, ని
బ్భవిహవ్యంబులు మాన్పఁ బ్రాణములు గోల్పోరే సురల్ మీరికన్.

అక్కటా! ఈవేల్పుల కెంతకృతఘ్నత! ఎంతసాహసము! నిత్యము నాసేవలఁ గొను నీయగ్నిభట్టారకుండైన నన్నాలోచింపకుండెనే! ఇంకేమి సేయవలయు [క్షణ మాగి] ఇంతటి వంచకుల నింక నా పంచల నుంచరాదు. ఇప్పుడే తరలించెద. ఓమంత్రివర్యులారా! సేనానాయకులారా!

మంత్రి: ప్రభూ!

దివో: మీరెల్లరు నాయాజ్ఞల నాలించి వానినెల్ల శీఘ్రముగఁ బరిపాలింపుఁడు.

మంత్రి: చిత్తము.

దివో: [కోపముతో]

మ. సురలన్ జూడను, బ్రోవుమంచనను, నే జోడింపఁ గేల్దోయి, ని
ర్వ్యరశీతాచలసేతుమధ్యగతదేవవ్రాత మొక్కుమ్మడిన్
బురుగైనన్ గనుపట్టకుండ సచివుల్ పోఁద్రోలుఁ, డెంతే మనో
హరమై శ్రీలలరన్ ధరన్ గనకవర్షాకీర్ణ మేఁ జేసెదన్.

ఓ దేవతలారా! మీ నిరోధము లేమాత్రముభంగపఱుపనేఱవు. ఏల యీ యకారణవైరము?

మ. భరమౌనే గుడిమ్రింగ లింగము, హరున్ బంపంగ నీ దివ్యులా
గరిమల్ జూపెడివారు? మా నుడులకున్ గైకోలులే, దింక మ
ద్వరయోగప్రభవాగ్నికీలల జగద్వ్యాప్తంబులన్ జేసి, యె
ల్లరలోపంబుల నెల్లఁ దీర్చెద మహోల్లాసంబు సంధిల్లఁగన్.

భటుఁడు: [ప్రవేశించి] ప్రభూ! ఆశ్చర్య మాశ్చర్యము.

దివో: [బొమలు ముడిచి] ఏమిరా యది?

భటుఁడు: దేవా! గంగాభవాని జాహ్నవి.

దివో: జాహ్నవి యేమి?

భటుఁడు: ఏమియులేదు, ప్రభూ! త్రిలోకపావని, మన భాగీరథీదేవి, హఠాత్తుగఁ బంకమాత్రావశిష్టయైనది. వారణాసియంతయు నుదకశూన్య మైనది. జలజంతువు లన్నియుఁ గోట్లకొలఁదిగ మరణమునకు సిద్ధమైనవి.

దివో: [ఆశ్చర్యముతో] ఆహా! వరుణదేవుఁడుకూడఁ దనప్రభావము నుపసంహరించుకొనియెఁగాబోలు! కానిమ్ము. [ప్రకాశము] ఓరీ! ఇంకేమియు నుపద్రవము లేదుగదా!

భటుఁడు: ఏమున్నది ప్రభూ. [క్లేశము నభినయించును. సభ్యు లొకరి నొకరు చూచుకొనుచు, బాధ నభినయించుచుందురు.]

మంత్రి: మహారాజా! మా కేలకో యుక్కిరిబిక్కిరిగ నున్నది.

సభ్యులు: దివోదాసప్రభూ! గాలి లేదు. మా కూపిరాడుట లేదు. మమ్ము

రక్షింపుఁడు. మమ్ముఁబ్రదికించుకొనుఁడు. మీరే మాకుశరణము.
[అని తహతహ నభినయింతురు.]

దివో: [నిట్టూర్చుచు] మహాజనులారా! ఇదియంతయు నాదురాత్మ లగు దేవతల మోసము. మీ కేమాత్ర ముపద్రవముఁ గలుగ నీయను. కొంచె మోపిక పట్టుఁడు. ఔరా! ఈ దేవతల కింకను గ్రించుదన మతిశయించుచున్నది. ఇంక నే నూరకొనరాదు. [ప్రకాశము] ఓవరుణవాయు దేవతలారా! మీరుగూడ ననలు ననుకరించి మీ మీ శక్తు లుపసంహరించుకొంటిరా? మీ కినుకయు, మీదివ్యత్వము నాకడ నింక నొక్కగవ్వకైనఁ జెల్ల నేరవు. ఇదే చూడుఁడు.

మ. దహనుండే దహనుండుగాఁ, డనిలుఁ డౌద్ధత్యంబునన్ బొల్చెఁ దా
నహమించెన్ వరుణుండు, వేల్పులిటు నాకత్త్వాకలన్ గూర్చుచున్
బహుధా వంచనసేయ నెంచి, రిపు డీ వాయ్వాదు లేమాదు? రే
నహముల్ రాత్రియు సర్వదేవమయతన్ వ్యాపింపనే? యంతటన్

ఓదివ్యనరులారా! ఇంక నీ యగ్ని వరుణవాయురూపములే కాదు. సర్వదేవతాస్వరూపుఁడనై లోకత్రయమును నేనే పరిపాలించెద. చూడుఁడు. నాశక్తిసామర్థ్యములు చూడుఁడు.

*సీ. దహనస్వరూపంబు దాల్చి యేఁ గైకొందు
హవ్యకవ్యాహుతు లధ్వరములఁ
బర్జన్యమూర్తి చేఁబట్టి యే వర్షింతు
సలిలధారలు సస్యములు ఫలింప
శశిదివాకరులవేషంబులు దాల్చి యే
ఖండింతు గాఢాంధకారపటలిఁ
బవను నాకారంబు భరియించి యేను బ్రా
ణ్యంతర్బహిర్వ్యాప్తి నాచరింతు
గీ. వేల్పులందఱు నేనయై వివిధగతుల
విశ్వలోకంబు రక్షింతు, వేయునేల?

*శ్రీనాథ మహాకవి.

నింక నౌదాని నిట నేన యేలువాఁడ
నాగలోకంబు నాకంబు యోగశక్తి.

మహాజనులారా! ఇంక క్షణ మాగుఁడు. అగ్నిప్రజ్వరిల్లును, వరుణుఁ డావిర్భవించును. వాయువు వీచును. [అని ధ్యానము నటించును. నాలుగుప్రక్కల వెలుఁగు కనుపించును. వర్షము గురియును, గాలి వీచును.]

ప్రజలు: [సంతస మభినయించుచుఁ గరతాళధ్వనులు చేయుచు]
దివోదాసమహారాజుకు జై, సార్వభౌమునకు జై.

(తెర వ్రాలును.)



# దివోదాసనాటకము

## షష్ఠాంకము

[మందరాద్రి గుహామందిరముకడ భృంగి శూలపాణియై యిటునటుఁ దిరుగుచుండును.]

గణ : [తెరలో] భృంగీ! భృంగీ! [అని పిలుచును].

భృంగి : దేవా!

గణ : [ప్రవేశించి] భృంగీ! నీవిచటికి వచ్చి యెంతసేపైనది?

భృంగి : ఎంతసేపెక్కడ ప్రభూ ! నాయడుగుముందు, మీయడుగు వెనుక. ఇంతే.

గణ : అయిన నీకొండపైకి వచ్చిన దేవత లెవ్వరెవ్వరో విచారించి వచ్చితివా?

భృంగి: ఎవ్వరేమి? అటు బ్రహ్మకపాలము, బదరీనారాయణము వఱకుఁగాక, యింక నాపైనెవ్వరైన నున్న వారును, ఇటు రామేశ్వరము వఱకు-అదేమి? ఇదేమి? నాలుగుసముద్రములమధ్యనున్న జగన్నాథ, శ్రీశైల, తిరుపతి, శ్రీరంగ ప్రముఖ మహాస్థలములలోని ముఖ్యదేవతలు, అక్కడక్కడ నున్న మధ్యమదేవతలు, అంకమ్మ మహాలక్ష్మమ్మ మొదలగు గ్రామదేవతలు; ఇంక నీఱాతిబొట్టు చెట్టుబొట్టు దేవతలతో సహా సకుటుంబసపరివారముగ నందఱు విచ్చేసిరి. సర్వదేవతలతోఁ గవ్వపుఁగొండ నిండిపోయినది.

గణ : [ఆశ్చర్యముతో] అందఱు వచ్చినారా?

భృంగి : అందఱేమిటి? దేవత యనుపేరుగల పురుగుకూడ లేకుండ భూలోకము సర్వదేవతాశూన్యమైనది. కాని బాబూ! కొన్ని ప్రభుత్వములలోఁ గొన్ని దేవాలయములకు నాలయదేవతలకుఁ గొన్ని యిక్కట్లు, కొన్నినియమములు మాత్రమే జరుగును. కాని యటుగాక, మనముసుక్షత్రియుని రాజునొనర్చ, వినాయకుఁ జేయఁబోవఁ గోతియైనట్టు లంతయుఁ దలక్రిందై భూలోకమున దేవతల వాసనగూడ లేకుండఁ బోయినదే! ఇంతఘోరమేమి?

గణ : భృంగీ! ఇంతమాత్రమున దేవతలకువచ్చిన లోపమేమియు లేదు. కాని యిప్పు డా దేవతలెల్ల రేమి చేయుచున్నారు?

భృంగి: ఏమి చేయుదురు? మనభస్మధారణ దేవత లందఱు గంటలు వాయించుచు శంఖధ్వనులు చేయుచున్నారు. నలుపుబొట్టు స్వాము లందఱుఁ, జక్కఁగా నామధారణము చేసికొని, చందనము పూసికొని, తులసిమాలలు వేసికొని, కావలసినంత పులిహోరయు దధ్యోదనము మొదలగునవి హాయిగఁ దృప్తిగ నారగించుచున్నారు.

గణ : సరే మంచిది. దేవదేవుని పూజ యైనది. వచ్చినవారిలో ముఖ్యుల నొక్కమాఱు పలుకరించివత్తము రమ్ము.

భృంగి: చిత్తము. అలాగే. కాని బాబుగారూ! అటు కైలాసముగాక, యిటు వారణాసి కాక, మధ్య త్రిశంకుస్వర్గమువలె మన కందఱకు నీకొండయే స్థిరనివాసమా?

గణ : అటులెన్నఁడును జరుగదు. వారణాసిని వదలినందులకు విచారపడుచున్న పుణ్యదంపతుల కడకు మహేంద్రుఁడు విష్ణుదేవుని దోడ్కొని రాఁగలఁడు. ఇంక మన కాశీప్రవేశకార్యక్రమము జరుగఁగలదు. వెంటనే రావలయును. రమ్ము, పోవుదము.

[ అని యిరువురు నిష్క్రమింతురు. ]

## షష్ఠాంకము – రెండవరంగము

[ గుహాంతరమున అన్నపూర్ణా విశ్వనాథు లుందురు. ]

అన్నపూర్ణ: దేవా! ఎంతకాల మీకాశీవియోగము. భక్తజనోద్ధరణము చేసినప్పు డీ వేషములేల? యీ భాషణములేల?

విశ్వ : దేవీ! నీవు జ్యోతిషమునకు అగునుగాదని శాపమిచ్చితి నన్నమాట యొక్కటైనను, నీ జ్యోతిషమునకుమాత్రము కాకపోవుట లేదన్నమాట యథార్థమైనది. దివోదాసుమూలమున సంభవించిన యీ కాశీవియోగము నాకును దుస్సహముగనే యున్నది.

అన్న : మన యానందవననివాసము, తాపసజనసాన్నిధ్యము, యోగిజన విలసనము, భక్తజనసేవనము తలఁచి, యీ స్థితిఁదలంచిన మన శ్శాంతి లేకున్నది.

చ. భయనిలయంబులైన భవవారిధు లెన్నిగొ యీదాటి మానవుల్
నియతి నొనర్చు పుణ్యము లనేకము లేకముగా, భవత్పదా
శ్రయమున బొల్చు రాసుకృతశాలుల భక్తుల నోమలేసి నా
చెయి పడినట్టులయ్యె, నెటుచేయుదుఁ గాశికి? నేమిసేయుదున్.

దేవా! ప్రజల కవిముక్తక్షేత్రనివాసమున భవవిమోచనమగు నన్నమాటలు నిన్న మొన్నటివి కావే! యుగయుగములనుండి వచ్చు సంప్రదాయమే! అదియంతయు వ్యర్థమైపోవునా?

మ. మనుసిద్ధింగని యర్చనాపరత నేమంబొప్ప సేవించు పా
వనులౌ భక్తులు వారణాసిఁ జన, నెవ్వా రర్మిలిం గాంత్రుతు? భో
జనసౌకర్యముఁ గూర్తురెవ్వరు? కటాక్షం బుంచి యమోక్షుల
క్షిప్రని గైసేయుదు రెవ్వ? రా మనము గాశింబాయు,నం దేమగున్?

విశ్వ : దేవి! ఈయానందవనమునకు వచ్చి, మన మందు లేనందులకుఁ జింతించి విలపించు భక్తజనుల యార్తనాదములు నన్ను మిక్కిలి గలంచుచున్నవి.

శా. పంచక్రోశపరీతకాశిఁ గల దేవవ్రాతముల్ లేమి, నా
పంచ న్నిల్చి,నమశ్శివాయ యనుచున్ వాక్రుచ్చు నెవ్వండు? సే
వించ నిన్నెవఁడెంచుఁ? జూతు రెవ రా విఘ్నేశు? వారాణసిన్
సంచారంబులు లేవు భక్తులకుఁ బంచత్వంబు ప్రాప్తించినన్.

అన్న : ఇంక నాస్థితిఁ జూడుఁడు.

గీ. అహరహము వచ్చు భక్తుల ననుగుసుతుల
నట్లు గనుగొంట నే విశాలాక్షి నైతి
బొసఁగుగతి నన్న మిడ నన్నపూర్ణ నైతిఁ
బోయె నాయూరు పేరు రాద్ధ్రుపునికతన.

విశ్వ : నిజము, దేవి! నిజము.

మ. తనధర్మంబును లోకధర్మముఁ దనుత్రాణంబుఁగా, న్యాయపా
లన ముద్యద్ఘనకార్ముకమ్ముగ జనశ్లాఘ్యాగమాచార వ
ర్తనముల్ దివ్యశరోత్కరంబులుఁగ దుర్గుండుఁగా నెల్లన
జ్జననాథుం గికరించుజోదు హరి తా సాక్షాత్కృతుండయ్యెడిన్.

భృంగి: [ప్రవేశించి] జయము జయము విశ్వనాథప్రభువులకు.

విశ్వ: ఏమిరా, అది?

భృంగి: ప్రభూ! లక్ష్మీసమేతుఁడై విష్ణుదేవుఁడును, మహేంద్రుఁడును వచ్చుచున్నారు.

విశ్వ: మంచిది. గణపతి యెక్కడ?

భృంగి: ఇదిగో, వారి నెదుర్కొని యిటే వచ్చుచున్నాఁడు.

[గణపతి మార్గము జూపు, లక్ష్మీనారాయణులును, మహేంద్రుఁడును ప్రవేశింతురు.]

లక్ష్మీనారా: అన్నపూర్ణావిశ్వనాథులకు లక్ష్మీనారాయణులు నమస్కరించుచున్నారు. [అని నమస్కరింతురు.]

అన్న, విశ్వ: అన్యోన్యప్రీతి రస్తు.

విశ్వ: లక్ష్మీనాథా! ఇటురమ్ము [సమీపమునఁ గూర్చుండబెట్టుకొనును.]

అన: లక్ష్మీదేవీ! ఇటురమ్ము. [ప్రక్కనఁగూర్చుండబెట్టుకొనును.]

మహేం: పురాణదంపతులకిదే మహేంద్రుఁడు నమస్కరించుచున్నాఁడు.

విశ్వ: అభీష్టావాప్తి రస్తు. సురేశ్వరా! ఇటుగూర్చుండుము.

ఇంద్రు: [కూర్చుండును.]

విశ్వ: లక్ష్మీనాథా! ఎల్లరును సేమమా?

విష్ణు: మీయనుగ్రహమున.

అన్న: లక్ష్మీదేవీ! అందరును కుశలమా?

లక్ష్మి: మీ దయచేత.

విశ్వ: రమావల్లభా! దివోదాసుస్థితి మీ రెఱింగినదే కదా!

విష్ణు: ఆతని సర్వదేవతానిరాకరణపూర్వమగు సకల దేవతాస్వరూప

విజృంభణము, మీ కాశీవియోగపరితాపము; అంతయు నెఱుంగుదుము.

అన్న : సోదరా! లక్ష్మీనాథా! మమ్ముఁ దిరిగి వారణాసీక్షేత్రప్రవేశము సేయింతువా? లేక యుండేయుండ నియమింతువా?

విష్ణు : అన్నపూర్ణాదేవీ! ఈగౌరవము మాకుదక్కింప నిట్లందువు కాని, మాకెల్లరకు జేయులగు శుంభనిశుంభాది సకలదుష్టదానవనిహంత్రివి, నిఖిలమంత్రస్వరూపిణివి, అఖిలశక్తిసంపన్నవు, సర్వమంగళవు. నీకు శక్యముకాని దేదియును లేదు.

విశ్వ : విష్ణుదేవా! నాప్రముఖులను యోగినీగణమునేగాక చతుర్ముఖభాస్కరప్రముఖుల నెందఱినో వారణాసి కంపితిని. వారెల్లరి వర్తమానములు సముద్రమునఁ బడు నదీప్రవాహాతుల్యములైనవి. నీవును వినియుందువు. వారణాసినుండి వచ్చిన మహేంద్రునిమూలమునసే యచ్చటి స్థితిగతులు తెలిసినవి. ఇంకఁగర్తవ్యము నిశ్చయింపుము.

విష్ణు : విశ్వనాథప్రభూ! సర్వజ్ఞులు తమ రెఱుంగని దేమున్నది? హౌరా! ఈదివోదాసు ధర్మాచరణపటిష్ఠుఁడును, దపోధనగరిష్ఠుఁడును. యోగబలవిశిష్టుఁడే యగుఁగాక! ఇంద్రియాధిష్ఠానభూతులే దేవతలు! అట్టిదేవతల యనుగ్రహము లేక కరచరణాదులనైతముఁ గదల్ప నేరఁడే మానవుఁడు! అట్టివాఁ డీ దివ్యుల నాదేవదేవుని బహిష్కరించుటయా? ఎంతసాహసము? ఎంతద్రోహము?

ఉ. వేళకు నున్నవాని బృథివీపతిఁ జేసిన విశ్వనాథునిన్
గూళతనంబునన్ వెడలఁగొట్టి, ధరిత్రి వసించియున్న దే
వాళిని దోలి హవ్యముల నందుచు, నగ్నిగ బల్మి గుళ్ళకున్
దాళములన్ బిగించుకొనెఁ దానొకఁడేలునె యీప్రపంచమున్.

ఓయీ! దివోదాసా! స్వపరభేద మెఱుంగక యీశ్వరానుగ్రహమున లభించిన నీ రాజ్యపాలనమున నింత గర్వపడెదవా?

చ. శివుఁడు పరాత్పరుండనుచుఁ జిత్తమునన్ దలపోయలేక మా
ధవముఖ దేవతావితతి తత్పదదాసులటంచెఱుంగ కి
ట్లువి వెడలింతువే హరుని? మూర్ఖతకున్ ఫలమందకుందె? యా
శివుఁడును నేము నేల? చలిచీమను బంపిన నిన్నడంప దే?

దేవ దేవా! అన్నపూర్ణాదేవి! ఈశ్వరాపరాధి యెన్న డున్నతి నంద లేఁడు. మీ కేల? ఇంక నీ కార్యభారము నేను వహించి మీకు సంతసము గలిగించెద.

శా. శ్రీసంధిల్లెడుగాక రాజ్యమునఁ దాఁజెన్నారుగా నున్నతిన్,
రోసం బగ్గలమై చెలంగ బహుమూర్తుల్ దాల్చెదుంగా కటుల్
త్రాసం బందుదుమే? తదున్నతులఁ దార్మాగ్నేసి, యెంతే దివో
దాసుం దాసునఁజేసి, మిమ్ము నవిముక్తక్షేత్రమం దుంచమే?

విశ్వ : లక్ష్మీనాథా! ఇప్పటికి మాహృదయభారము తగ్గినది. ఇంకఁ గార్య సాధనోపాయము వక్కాణింపుము.

విష్ణు : ధర్మప్రాభవ నెల్లుదిరించుట యనిగదా దేవర యభిప్రాయము?

విశ్వ : అవును.

విష్ణు : కర్మల నాచరించుచు, దివోదాసు కర్మఫలదాతలగు దేవతల నావల కంపినట్లే, ప్రజాభీష్టప్రదాతయగు ప్రభువుపైఁ బ్రజాతిర స్కారము చేయింపవలయును. అదియే ముఖ్యకర్తవ్యము.

విశ్వ : దాదాపు పదివేలయేండ్లనుండి, మిక్కిలి యనురాగము గలిగి యున్న ధార్మికప్రభువును బ్రజలు తిరస్కరింపనేర్తురా?

విష్ణు : మానవశక్తి కది కష్టసాధ్యము కావచ్చును. కాని దానికి దైవ శక్తి తోడ్పడిన సర్వము కృతప్రాయము కాఁగలదు.

విశ్వ : ఎట్లు కాగలదు?

విష్ణు : మున్ను దేవరాజు బృహస్పతితో యోజించి, యగ్నివరుణ వాయు వుల నుపసంహరింపఁజేయ, నాదివోదాసు కోపమున సర్వదేవతా స్వరూపములఁ దాల్చి తనయోగశక్తి నంతయు వ్రయపెట్టెను. తపశ్శక్తికూడ సన్నగిలె ననుటకు సందియ ముండదు. బలమఱి

యున్న రాజిప్పు డావిధమునఁ బరాక్రమింపనేరఁడు. ఈసమయము ననేభేదసాధనమ్మునదివోదాసుధర్మకవచమ్మునుద్ఘాటింపవలయును.

విశ్వ : ఏరూపమున?

విష్ణు : మహానటులగు నటరాజకార్యము, నటనారూపముననే జరుగ వలయును. పాకశాసనుఁడు ప్రమథులంగూడి ప్రజావేషము లతోఁ బ్రజాప్రభుత్వోద్యమమును సాగించును. మనకుమారగణ పతియు భృంగియు, రమాదేవియుఁ జేటియు, నేనును, నావాహన మగు గరుత్మంతుండును, రాజధానియగు వారణాసిలోఁ బలు విధముల నటింతుము. కార్యము సాధింతుము.

విశ్వ : రమానాథా! నావంటివానినే తమకింపఁజేసిన నీవేషము, నీభాష ణము నెవ్వరికిఁ దహతహ గలిగించదు? ఎవ్వరిని దల్క్రిందు సేయనేరదు? ఇంక సాక్షాద్భగవతి యిందిరాదేవియు, మహేంద్ర ముఖ్యులును నీకు బాసటగానుండ, దివోదాసింక నీ చరణ దాసుఁడు కాకపోఁడు. తప్పక విజయ మందుదురు. పోయిరండు.

విష్ణు : చిత్తము. మహేంద్రా! దేవదేవునియాజ్ఞ యైనది. మన మింకఁ గార్యసాధనకుఁ గడంగవలయును.

మహే : అవశ్యం మల్లే చేయుదము.

విష్ణు : సురనాథా!

ఉ. నాయకశూన్య మున్మదితనాయకముల్ బహునాయకంబు స్త్రీ
నాయక మల్లె బాలభటనాయకముల్ గల రాష్ట్రముల్ చెడుల్
జేయవలెన్ ప్రయత్న మటుజేసిన రాజ్యము ప్రేలు, రాజు కే
ల్దోయి మొగిడ్చియాశుపదతోయజముల్ ఘటియించు మాళిపై.

ఆతఁ డిప్పుడు క్షీణాఖిలపుణ్యరాశియై యుండుటఁజేసి, ప్రజా ప్రభుత్వమునకు సిద్ధమొనర్చి బహునాయకుల, నొకరినొక రొప్పని బహువిధనాయకసంఘములను నిర్మించవలయును. అదియే మన విజయసాధనము.

శా. ముల్లోకంబుల నేలుమేటి తఖిలంబుల్ రాజధర్మంబు లో
భిల్లు న్నీ యెడఁ జెప్పఁగావలయునే? భేదంబునన్ రాష్ట్రమే

విల్లై తజ్జనవర్గముల్ శరములై వెల్గొందఁగా జేసి నీ
వల్లాడింపుము శక్ర! పట్టువడు మాయాంవాగురల్ పన్నెదన్.
ఇంతియేగాక, యీకార్యమునకు నీవొక్కఁడవే పోనక్కఱ లేదు.

మ. ప్రమథుల్ కోట్లుగ నున్నవారలు, కుమారస్వామియున్ వీరభ
ద్రముఖుల్ వీరులు లోకసన్నుతులు, శోధింపఁగాంపోము, వే
సములున్ శాసలుమార్చియెల్లరుఁబ్రజాసామాన్యులై చున్ శతా
బ్దములన్ జేసెదు కార్య మొక్క ట్రుటి సంధానింపుఁడీ రెల్లరున్.

మహే॥ రమావల్లభా! ఇంతటి యనుగ్రహము గలిగి నన్నీ పరమేశ్వర
సేవకు వినియోగించుచున్నందుల కెంతయు ధన్యవాదము లొన
రించుచున్నాను. దేవదేవా!

మ. సుకృతంబుల్ ఫలియించె నేటి కిటులన్ శూలాయుధుల్ వెంటరా
సకలోర్విన్ గయిపట్టఁజాలిన ఘనుల్ శౌర్యోన్నతుల్ వీరభ
ద్రకుమారాదులు గ్రాల ముందుగ, భవత్కైంకర్యసౌభాగ్య ము
త్సుకతల్ గూర్పఁ బ్రజావిభేదనగతుల్ శోభిల్లవే? మాకికన్.

ఇంక నాకార్యంబున నే నప్రమత్తుండనై సంచరించెద.

విష్ణు : విఘ్నరాజా! మా యీ కార్యమునకు నీవు మిక్కిలి దోడ్పడ
వలయును.

మ. వరవిద్యాకృతివై సమస్తకళలన్ స్వారాట్టువై మంత్రతం
త్రరహస్యోన్నతి వెల్గు ధీరుఁడవు, మేధామూర్తి వెంతేని లోఁ
బరుపన్ జాలుదు వెల్లలోకముల, నీపాదంబులన్ బట్ట నా
ధరణీశున్ వశవర్తిఁ జేయు మిదె కర్తవ్యంబు విఘ్నేశ్వరా!

గణ : లక్ష్మీవల్లభా! ఈప్రయత్న మిప్పటికై నను నీవు సేయఁబూని
నందుల కెంతయు సంతసించుచున్నాను. గోటితోఁ జేయుపనికి
గొడ్డళ్ళు కావలయునా?

చ. యుగములుమాతె నెన్ని యెటిబోన్నతిఁగూల్చ్రఁ డెవండు,వీని యీ
మగతన మేమొ గన్గొనెద, మాధవ! యీశ్వరు దేవదేవు ని

ట్లగడువడంగఁ జేసిన దురాత్ముఁడు కాశిక నిల్వ నేర్చునే?
వగఁగొన రాట్కరీంద్రమును బట్టనె? నెట్టనె కాననాద్రులన్.
ఇంతటి యీశ్వరాపరాధి నింతకాలము సహించి యూరకున్నం
దులకు నన్ను మన్నింపవలయును.

చ. ఉడుగఁగ జేసె నాకుఁగల యుద్ధతి యీప్రమథేశుఁ డెప్పుడో
గెడపక వాని నోర్చెదనె? క్రించుదనంబున మమ్ముఁదోలె, నే
నడపుదునే వనం బవనినాయకు? పెన్ సిగఁబట్టి తెచ్చి మీ
కుడుగరగా నొసంగుదునె? యోజన దెల్పుము నాకు మాధవా!

విష్ణు : గణపతికుమారా! నీవెంతకైనఁజాలుదువు. బ్రహ్మచారివేషమున మున్మందు వారణాసికిఁజని విద్యావిశేషములఁబౌరుల వశీకరించి, యవనిపతి కారాటము గలిగించి యతనికడ నాచార్యపీఠ మలంకరించియుండుము. పిమ్మట నేను వచ్చెద. అవసరము గనుపెట్టి మనము తగురీతిఁ బ్రవర్తింతము. ముందుగ నేమాత్రము త్వరపడ రాదు.

గణ : ఆర్యా! మీపన్నగడ బాగుగనేయున్నది. అట్లే చేయుదము.

విష్ణు : మంచిది. అటులనే చేయుము. [లక్ష్మిదిక్కై] దేవీ! యీకార్య భార మంతయు నీపైనున్నది. మాకార్యసాధనమునకు మార్గము చేయవలయును.

లక్ష్మి : ఆర్యపుత్రా! ఇదియేమి? నేనేమి చేయగలను?

విష్ణు : కటాక్షవీక్షణముల లోకము లల్లల నాడించు నీవేమి చేయలేవు?

ఉ. నిచ్చలుగొల్చి యచ్చరలు నేర్చెడి త్వన్మృదుగానసైఖరుల్
మెచ్చుచునుందు నెంతగనొ, సోకొనె నిన్నఖిలప్రశస్తులన్
హెచ్చుగ నాదిదంపతు లనేకవిధంబులఁ బ్రస్తుతింత్రు, నే
ల్వచ్చునులక్ష్మి! మాకు జయలక్ష్మినిగూర్పుము, తీర్పుకార్యమున్

లక్ష్మి : ఆర్యపుత్రా! నన్నేమి చేయుమందురు?

విష్ణు : యోగినీవేషము వేయుమందును. నీమనోహరగానసుధాస్రవంతుల నావారణాసీరాజవీథుల వెల్లివిరియింపుమందును. మారీ స్ఫోట

కము మున్నగు జాడ్యములఁ గల్పించి నివారింపుచు, వారణాసిని వశీకరించి, వనితల కెల్లరకు బౌద్ధచార్వాకమతముల నుద్బోధించు నాచార్యవై, స్త్రీనాయకత్వమును స్థిరపఱుపుచుందును. తెలిసి నదా?

లక్ష్మి : ఆర్యపుత్రా! జగత్కల్యాణకారణ మగు నీ పరశివారాధన కంటె నుత్కృష్టకార్య మేమున్నదును?

ఉ. ఆటఁగొను పాటయో? హానిసి కంబిక కెయ్యది యిష్టసిద్ధియో?
పాటవ మొప్ప, దాసి బహుభంగులుగా నొనరింతు, నింతులన్
బోటిగ నిల్పి తద్విభుల పొంగడఁగింతును, స్త్రీలకున్ నిరా
ఘాటముగా స్వతంత్రతకుఁ గంకణముం బిగియింతు నంతగన్.

విష్ణు : దేవీ! బౌద్ధచార్వాకమతప్రవేశము, స్త్రీజనస్వాతంత్ర్యము, ధర్మపదభ్రంశమునకు ముఖ్యసాధనములు. అవియే నీవు నిర్వర్తింపుము.

శివు : కల్యాణీ! మాయిద్దా కార్యమునకుఁ గార్యదర్శి కమలనాభుఁడు, తనకై తాను నిన్నీపనికి నియోగించినందులకు మిక్కిలి విచారించుచున్నాను.

అన్న : విష్ణుదేవా! ఇందిరాదేవి రాకున్న నీ కార్యము పొందుపడ నేరదా? ఏసుందరాంగులైన నిందులకు జాలకుందురా?

విష్ణు : సోదరీ! కాశీపండితు లెన్నఁడును శాస్త్రమునందోటమి యెఱుంగని విశ్వనాథతుల్యులు. పురసతులు ధర్మదీక్ష విశాలాక్షీసదృక్షలు. అట్టివారి నట్టట్టు చేయుటకు మాదంపతులుగా కన్యులు సమర్థులు కానేరరు. అన్యథా తలంపక మాకాజ్ఞ యిండు. పోయివచ్చెదము.

అన్న : లక్ష్మీదేవీ! మాకై నీకీ ప్రయాస తప్పుటలేదు.

లక్ష్మి : ఏమియుఁ బ్రయాస లేదు. మా ప్రయాణమున కాజ్ఞయిండు. పోయివచ్చెదము.

విశ్వ : లక్ష్మీనారాయణులారా! మహేంద్రా! గణపతికుమారా!

ఉ. ఒక్కొకరే జగచ్ఛ్రయము నోర్వఁగఁ జాలినవార లొక్కఁడై
యిక్కరణిక్ జనంగఁ బృథివీశ్వరుఁ డెంత? ప్రభుత్వ మెంత? మి
మ్మొక్కఁడఁగాంచి,రాజు నతు లర్పణసేయఁడె గర్వ మీఁగి? మీ
చెక్కు చెమర్పకుండగనె సేకురు మీకు జయంబు, పొండికన్.

అందఱు : [చేతులుమోడ్చి] అన్నపూర్ణావిశ్వనాథులకు జై. భవానీ శంకరులకు జై. [అని నమస్కరింతురు].

(తెర వ్రాలును.)



# దివోదాసనాటకము

## సప్తమాంకము

[ గంగాతీరమున విష్ణుమిత్రుఁడను ఆస్థానపండితుఁడు ప్రవేశించును. ]

విష్ణు : మా దివోదాసప్రభు వెంత సత్కార్యాచరణపరాయణుఁడై, యెంత సర్వప్రజారంజకుండైనను, సకల దేవతలు, దేవతాసార్వభౌముఁడగు విశ్వనాథుఁడు లేని యీ మహీమండలమును, మణికిరీటము, లేని మహారాజశరీరమును జేయుచున్నాఁడు. భక్తిముక్తులు లేని, యీకాశీనగరము పాడుబడ్డదేవాలయమై, యాలయస్థితు లనిర్వాచ్యములై, యెంతటి ఆతిగుండెనైనను గరగింపకమానవు. సకలశోభావిభాసురములై, నిఖిలజగదుద్ధారకము లగు నీ దేవళ ములకా యిట్టి దుస్థితి?

సీ. దిక్కుమ్రొక్కును లేక కుక్కలకొంపయై
భైరవాలయ మెంతొ పాడువడియె
పూలు పండ్లుంద్రముల్ పూజావిధు లడంగి
విఘ్నేశ్వరునిగుడి వీఁటిపోయె
స్తోత్రముల్ జపములు సోలువా రుడుగంగ
నన్నపూర్ణావాస మడవియయ్యె
అభిషేక మర్చన లభవుభక్తులు రాక
శివుని గోవెల క్రింగెఁ జెదలపుట్ట

గీ. తక్కు దేవాలయంబులఁ బడవనేల
దాఁగె భూగర్భమున నృపోద్ధతుల కడలి
గంగ గంగను గలసెను గాలకాలు
భాగ్య మిటులైన నే మనవచ్చు విధిని.

మహాదేవా! నీదర్శనభాగ్యము లేని దౌర్భాగ్య మీ యవిముక్త క్షేత్రమున కెప్పు డడంగునో, తెలియనేరకుంటినే !

ఉ. దేవత లేరె? శూన్యములు దేవళముల్? కనుగొందు నేరి? నే
నేవిధి సంస్తుతింతు? నిఁక నెవ్వరిపాదము పట్టుకొందు? నా
భావన కేదిదిక్కు? భవబంధము లేగతిఁ బాయు? విశ్వనా
థావన మందలేని బ్రదు కారడి యయ్యెను ధాత్రి కియ్యెడన్

నిఖిలజగన్నియామకుఁడవే, విశ్వనాథా! నీ కలవిగాని దుండునా? సర్వజంతువులకు నిత్యోపస్థితమగు నీబ్రహ్మానందసామ్రాజ్య మీ యానందకాననమున నే యంతర్ధాన మొనరించెదవా? ప్రభూ! నిను నమ్మి నీకడఁ బ్రాణముల విడువఁదలఁచిన ప్రాణికోటి కాత్మానందామృత మందఁ జేయవా! తండ్రీ! మమ్మేల నలయించెదవు.

ఉ. పుట్టిన జంతుసంతతికి మోక్ష మొసంగెడి నేటిదాత పీ
పట్టణమందు లేమి, భవబంధము లూడక జీవు లెల్లరున్
గిట్టుచుఁ బుట్టుచున్ మిగులఁ గీడ్పడుచుండిరి, వారి, బాధలన్
బెట్టకు, మమ్ము పీడకుము, విశ్వపతీ! పురిఁ జేర రమ్మికన్.

[ అని ధ్యానము నటించును ]

[ తెరలో ]

గణపతి :

శ్లో. ఆత్మా త్వం, గిరిజా మతిః, పరిజనాః ప్రాణాః, శ్శరీరం గృహమ్
పూజా తే విషయోపభోగరచనా, నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః, స్తోత్రాణి సర్వా గిరః
యద్యత్కర్మ కరోమి త త్తదఖిలం శంభో! తవారాధనమ్.

విష్ణు : [వినుట నభినయించి] ఎచ్చటి దీ పరమోత్కృష్టమగు ధ్యానామృతవాహిని? తనహృదయావభాసకమగు శుద్ధచైతన్యమే పరమేశ్వరుఁడని, శరీరేంద్రియమనోవ్యాపారము లన్నియుఁ దత్సేవాకార్యము లని, విశేషవిధిచేత లోకము నంతయు నైశ్వరముగఁ జూచు నీతఁడొక మహాజ్ఞానియా? కాక యీశ్వరసేవాపరతంత్రుఁడై తాను జేయు సర్వవ్యాపారములు నీశ్వరార్పణ మొనర్చుచుండు పరమభక్తాగ్రేసరుఁడా? ఎవ్వఁడైనను ధన్యతముఁడే. [ముందు జూచి] శివపూజావిధి నిర్వర్తించి యేనుంగు

గున్నలవలె నిద్దఱు యువకు లిటే వచ్చుచున్నారు. వీరివలన సర్వము నెఱుంగనగును.

[ తెరలో ]

"కాశీపతే! వారణాసీపతే! గంగాజటాజూట! గౌరీపతే!
శంకరశివా! శంకరశివా! శంభో! మహాదేవ! శంకరశివా!
శంభో! త్రిణయన! చంద్రచూడ! శివ! శంకర! గిరిజాకాంతా!
అంభోజాసనముఖ్యదేవతావందితచరణోపాంతా!

[అని పాడుచు భృంగితో గణపతి ప్రవేశించును.]

విష్ణుమి: [సంతసముతో] ఈశ్వరసేవాతత్పరులగు వటూత్తముల కిదే విష్ణుమిత్రనాముఁడు నమస్కరించుచున్నాఁడు.

[అని నమస్కరించును].

ఇద్దఱు: అభీష్టావాప్తి రస్తు.

ఢుంఠి: మీరు శివపురాగ్రహారికులు. కేశవపండితునిపుత్రులు. వేద వేదాంగపారంగతులు. మీతండ్రిగారు దివంగతులైన పదియేండ్ల నుండి కాశీనివాసము సేయుచు, మహారాజాస్థానమున నుండినను విశ్వనాథుఁ డిందు లేకుండుటకు మిక్కిలి విచారపడు దైవాసక్తచిత్తులు. మీజనని చారుమతి, పరమసాధ్వి. మీధర్మపత్ని తులసి, తులసివంటి పవిత్రురాలు. మీదంపతు లతిథి సేవాతత్పరులు. మంచిగేస్తులు. మీకోరికలు రెండు. ఒకటి పుత్రానందప్రాప్తి. రెండవది బ్రహ్మానందానుభవము. మఱియొకటి. రాత్రి మీ స్వప్నమున విశ్వనాథాలయము లక్షపత్రిపూజ కనుపించినది. అది మిక్కిలిశుభదాయకము. ఔనా? ఈచెప్పిన దంతయు సత్యమేనా ?

విష్ణుమి: ఓహో! ఎంత వింతగా నున్నది? జాతకమును జూడక, చివరకు జన్మనక్షత్రమైన నడుగక, యున్నదున్నట్లు సర్వమును జెప్పినారు. ఎంతమహానుభావులు మీరు! జ్యోతిషమున సరే, ప్రత్యక్షానుభవమే. స్వప్నమును జెప్పుట మిక్కిలి విస్మయకరము. ఇంక నేయేశాస్త్రము లభిమానములో తమకు?

విద్యాధరశర్మ: మా గురువర్యులగు ఢుంఠిభట్టారకులకు వేద వేదాంగములు, నిఖిలకళలు, సర్వాగమములు, కరతలామలకములు. వారికి రాని విద్యలు లేవు. ఋషివాటికలలోఁ దత్త్వబోధఁ జేయు చిద్రూపులు. వారిమహిమ లత్యద్భుతములు.

విష్ణుమి: అబ్బ! ఏమి, వీరి ప్రభావ మమేయముగ నున్న దే! మమ్ముద్ధరింప నేతెంచు నపరవిశ్వనాథులవలెఁ గాన్పించుచున్నారు. అయ్యా, ఢుంఠిభట్టారకా! మున్ముందుఁ దాము నాకొక వరమీయ వలయును.

ఢుంఠి: ఏమది?

విష్ణు: శిష్యసమేతులై మాయింటికిఁ దమరు దయచేయవలయును. మీ రెంతకాల మిందున్న సంతకాలము మాయింటనే నివసింపవల యును. అదియే నా ప్రార్థన.

[అని ఢుంఠి చేతులు పట్టికొనును.]

ఢుంఠి: విష్ణుమిత్రవర్యా! మేముకోరవలసినకోరికను మీరేకోరుచుండుట మాయదృష్టము. మీయాజ్ఞను మీఱనేరను. తప్పక వత్తుము.

విష్ణుమి: [సంతసముతో] నేను మిక్కిలిధన్యుఁడను. రండు పోదము.

(అని పరిక్రమింతురు.)

## సప్తమాంకము - రెండవరంగము

[పౌరాంగనలు, లక్ష్మి, గౌరీసోమిదేవమ్మలు, వీథిలో నొకరి నొకరెదుర్కొందురు.]

లక్ష్మి: నేను మీకోసం వస్తూవుంటే, మీరిలా వస్తున్నా రెక్కడికి పిన్నిగారూ?

గౌరి: మీయింటిదగ్గర, విష్ణుమిత్రపండితులవా రింటి కెవ్వరో బ్రహ్మచారిపండితుఁడు వచ్చాడని, ఆయన చాల గొప్పవాఁడని విని, మా గ్రహచారం, పిల్లలఆరోగ్యం, ఏమయినా చెపుతాఁడేమో నని వస్తున్నా. సరే గాని, నీ వెందు కిలా రావటం? లక్ష్మి!

లక్ష్మి: అబ్బాయికి రాత్రినుంచీ మూసినకన్ను, తెరవకుండా జ్వరం.

ఒళ్లు, మసమసలాడుతూ, ఉలికులికిపడుతూ వుంటాడు. ఏమందు పొయ్యాలో, యేం జెయ్యమంటారో, అడుగుదామనే, మీకోసనే వస్తున్నా. ఏంజెయ్యమంటారు పిన్నిగారూ ?

గౌరి : మీవాడికూడా జ్వరం వచ్చిందీ? అదేం పాపమో, కాశీపట్నమంతా పుచ్చిపోయినట్లు, ఇంటింటా రోగాలు, ఇంటింటా మంచాలూ. మీబాబాయికూడా రాత్రినుంచీ జ్వరం. వేరే వేరేమందులు, వేరే పథ్యాలు. ఇక అడగబోకు. పిల్లలమంచాల చుట్టూ తిరగలేక చచ్చిపోతున్నా. మఱి ఆపండితుల మాటేమిటి?

లక్ష్మి : అబ్బో! ఆ డుంఠిభట్టారకుఁడు, మహాఉపద్రవపిండం. మనకాశీ పండితులమాట ఒక్కటైనా నెగ్గనిస్తేనా? అన్ని శాస్త్రాల్లో, అన్ని విషయాల్లో కూడా ఆయనదే పైచేయి. ఆయనదగ్గఱికి వచ్చేవాళ్లూ, పొయ్యేవాళ్లూ, వందలు వేలు. ఎవ్వరొచ్చినా, ఎవరిసంగతులు వారికి ముక్కుమీద గుద్దినట్లు, అందరికీ అన్నీ చెప్పడనే.

గౌరి : అందఱూ ఇలాగే అంటూంటే, నిన్ను తీసుకొనిపోయి, ఆయన దర్శనం చేదామని వచ్చా.

లక్ష్మి: పిన్నిగారూ! బెల్లాన్ని చీమల్లాగ ఆబాలగోపాలం, మనకాశీపట్నమంతా ఆయన్ను పట్టుకొని వదల్టంలా! ఈజాతర్లో మనం పోనూలేము, చూడనూ లేము. కాని ఒకయోగిని యిక్కడికి వస్తుందని, ఆమె అన్నిరోగాలూ పోగొడ్తుందని, గొప్ప మహానుభావురాలని చెప్పారట. అందఱూ ఆమెకోసం ఎదురు చూస్తున్నారు.

గౌరి : ఏమైతే యేం! ఆపురాణదంపతులు అన్నపూర్ణావిశ్వేశ్వర్లు ఇక్కడ లేకపోవడమే యింత ఉపద్రవానికీ ముఖ్యకారణం. కాని ఆ వచ్చేయోగిని యిప్పుడే వస్తే బాగుండు.

లక్ష్మి: పిన్నిగారూ! ఆ పండితుఁడిమాటల్లో పొల్లేమాత్రం లేదు.

వచ్చేది వచ్చేదే. ఆమె యెప్పుడు వస్తుందో చూడాలి.

[తెరలో పాట వినఁబడును.]

ఇద్దఱు: [పాట వినుట నభినయింతురు].

లక్ష్మి: పిన్నిగారు! ఈబజార్న గొంతున్నవాళ్ళే లేరు. పాడితే మీరు. మీరిక్కడే ఉన్నారుగదా! ఇఘు ఇక్కడ ఇంతబాగా పాడేవాళ్లెవరండీ?

గౌరి: ఔనే లక్ష్మీ! నాకూ చోద్యంగానే ఉంది. అబ్బ! ఎంత మంచి గొంతుకే! ఎంత కమ్మనిపాటే! ఆకంఠం కలకండా, తేనె, పాలూ, పండ్లరసం, ఇలాంటివన్నీ కలిపి చేసినట్టుంది. విన్నకొద్దీ నాకేమిటో వొళ్ళు తెలియకుండా వుంది. ఇంట్లో నేమయినా సరే, కాస్సేపీ పాటమాత్రం వినిపోదాం.

[అని సంతస మభినయింతురు. యోగిని ఏకతార మీటుచుఁ బాడుచు, మందపాట్లాల జోలెఁగల శిష్యురాలితోఁ బ్రవేశించును. లక్ష్మి గౌరమ్మ నుండమని సంజ్ఞ చేసి, లోని కేగును.]

యోగిని: [గౌరమ్మను సమీపించుచుండును.]

పౌరులు: [చాలమంది పాట వినుచు, ఆనందములో నిల్చియుందురు.]

గౌరమ్మ: [భయభక్తులతో యోగినికి నమస్కరించి] అమ్మా! త్రాగే అమృతం ఆవలఁబెట్టించు మీ గాన మపూర్వము. మీరూప మసామాన్యము. కాశీపురమును గనుగొని మమ్ముద్ధరింపవచ్చిన యన్నపూర్ణాదేవివో, లేక యేదివ్యాంగనవో, కావలె? [అని నమస్కరించును.]

లక్ష్మి: [పళ్లెము నిండ బియ్యము, పండ్లు, తాంబూలము, దక్షిణఁ గొని తెచ్చి యోగిని కీయఁబోవును.]

పౌరుఁడు: అమ్మా! మీపాట చాలాబాగుంది. యీపాట దివాణాల్లో పాడితే ప్రభువులు, రత్నాలు కానుక లిస్తారు. ఎందుకో యిలా వచ్చి మమ్మనుగ్రహిస్తున్నారు? సంగీతంలో ముంచేశారు. నే

మేం జెయ్యగలం? తల్లీ! దయవుంచి అనుగ్రహించండి.

[ అని యోగిని కియ్యఁబోవును. అందఱు కానుక లీయఁబోదురు. ]

యోగిని : సోదరీసోదరులారా! భిక్షాప్రదానము, అతిథిపూజ,యీభరత దేశమునకు సహజాలంకారములు. మీకు నాపైఁగల యాదర మున కేనెంతయు సంతసించుచున్నాను. నేను భిక్షార్థినిగాను. కావలయునన్న,నిలచినచోటఁ గనకవర్షము కురిపింతును. ప్రస్తుత మీయానందవనము నానావిధరోగాంధకారభూయిష్ఠమై మిక్కిలి యలజడి గలిగియుండుట, నా యోగదృష్టిచే నెఱింగి,దివ్యౌషధ ప్రదానమున నెల్లర కారోగ్యభిక్ష పెట్టవచ్చిన విజ్ఞానకౌముదిని. ద్రవ్యమునుగాని తదితరమునుగాని నేనేమియుఁ బుచ్చుకొనను. ఇది మీరెల్ల రెఱుంగవలెను.

[ అందఱు ఆశ్చర్యము నభినయింతురు. ]

యోగిని :

ఉ. ఏను బురాణయోగిని నహీనతపస్విని బ్రహ్మచర్య ని
ష్ఠానియతాంతరంగను గటాక్షమునన్ జగమేలు టెప్పు నా
పూనుద్రతంబు, దానికయి భూమిఁ జరించుచునుందు నేను గాం
తానివహంబుఁ బ్రోచుట స్వధర్మము,సత్య మహింస తోడుగాన్.

మఱియును,

చ. కడచినకాలముల్ గడువఁగాఁదగు కాలము నేఁటికాలముల్
నుడువుదు, నెల్లవారికి మనోరుజ లేఁగఁగ వ్యాధు లెల్ల నే
నడఁపుదుఁ, జిల్కలట్టులు మహానసపంజరమందుఁ జిక్కి డీ
ల్పడు నబలాతతుల్ చెలఁగ బంధవిమోచనముల్ ఘటించెదన్

[సోమిదేవమ్మవంకకుఁ దిరిగి] నీవు గౌరీసోమిదేవమ్మవు. నీ ముగ్గురుబిడ్డలలో నొకరికి స్ఫోటకము, ఒకరికి జ్వరము, ఒకరి కవ యవ స్తంభనము, నీ భర్తకు జ్వరము. నిజమేనా?

గౌరి : [ఆశ్చర్యముతో] ఔను తల్లీ! అవును.

యోగిని: లక్ష్మమ్మ! నీకొడుకునకు జ్వరముగాదూ?

లక్ష్మి : [ఆశ్చర్యపడి] ఔను తల్లీ! అవును.

గౌరి : ఏమి యీయద్భుతము! అమ్మా! నీవు సర్వజ్ఞురాలవు. మా పూర్వపుణ్యమున నిచటికి విచ్చేసిన సాక్షాజ్జగదీశ్వరివి.

యోగిని: వకుళా!

వకుళ: అమ్మా!

యోగిని: నీజోలెలో నుండు పొట్లములలో నాలుగు సోమిదేవమ్మకు, ఒకటి లక్ష్మికి నిమ్ము.

వకుళ : చిత్తము. [అని పొట్లములు దీయును].

యోగిని : మీరు పొట్లములఁ దీసికొని, యొక్కొక్కరి కొక్కొక్క పొట్లములోని మందును దేనెలోఁగలిపి నన్ను స్మరించి యిచ్చిన, నెవ్వారి కే జబ్బు లున్నను దత్క్షణమే నెమ్మదించును. ఆరోగ్యము పొందినవెంటనే పిల్లల నొకమాఱు నాకడకుఁ దీసికొనివచ్చిన నే నాశీర్వదింతును. మీ యితరాభీష్టములుకూడ సమకూర్తును.

గౌరి, లక్ష్మి : చిత్తము తల్లీ. [అని పొట్లములు గ్రహింతురు.]

యోగిని : [పౌరులవంకకుఁ దిరిగి] జాడ్యనివారణమును గోరు మీరు గాని, మీరెఱిగినవారుగాని, నేనుండుచోటికి వచ్చిన నౌషధము నిప్పింతును. ఇతరాభీష్టములను గూడఁ బడయవచ్చును. స్త్రీలకు మాత్రమే నాకడఁ బ్రవేశము.

[అందఱు నొకరి నొకరు చూచుకొందురు.]

గౌరి : అమ్మా! మాకొక ప్రత్యేకగృహము కలదు. తామందు దయ చేసి యుండఁగోరుచున్నాను.

యోగిని : సోమిదేవమ్మా! నీయాహ్వానమునకు మిక్కిలి సంతసించు చున్నాను. నేను బురుషులకు దూరముగ విజనస్థలముల నుండ వలయును.

ప్రథమ పౌరుఁడు : అమ్మా! సమీపమున విశాలమగు ధర్మశాల యాత్రి కులులేక, అంతా ఖాళీగా ఉంది. పెద్దఆవరణం. ఇతరు లెవ్వరూ

కూడా రానటానికి వీల్లేదు. మీరక్కడ ఉంటే, మిమ్మల్ని మేమంతా, తల్లిలాగ సేవించుకుంటాం! మా సేటుగారు చాలా సంతోషిస్తారు. తాళపుచేతులు కూడా నాదగ్గరే ఉన్నయ్. దయచెయ్యండి, చూతురుగాని.

యోగిని : మాకెవ్వరిసాయ మక్కరలేదు. పురుషు లెవ్వరు నెప్పుడును రాగూడదు.

పౌరు : అమ్మా! మేమెవ్వరం రాము. తమ కెట్లాపీలుంటే అట్లాఉండండి. మీరుంటే ముందు మాపట్నం బాగుపడుతుంది. దయచెయ్యండి.

యోగిని : మేమిప్పుడే వచ్చెదము. నీవు ముందు పద.

[ పౌరుఁడు ఉత్సాహముతో నిష్క్రమించును. యోగిని పాడుచు బయలుదేరును. అందఱు ఆమె వెంట వెళ్లుదురు. తెరవ్రాలును. ]

## సప్తమాంకము - మూడవరంగము

[ప్రధానమంత్రియగు రామశర్మ విచారముతో నొంటరిగఁ గూర్చుండియుండును.]

రామశర్మ: [స్వగతముగ] ఎన్నివైద్యములు చేసినను, ఎన్నిమందులు వాడినను, పిల్లవాని నేత్రబాధ కొంచెమును గూడఁ దగ్గకుండెనే! ఇం కేమి చేయఁగలను? సార్వభౌముని యోగశక్తిగూడఁ బని చేయనప్పు డింకే చికిత్సలు చేయింతును? ఏ వైద్యులఁ బిలిపింతును! ఇంక నా కొడుకు నన్నుఁ గన్నెత్తిచూచునన్న యాశ కలుగుటలేదు. బాధపడు పిల్లవాఁడును, నిరంతరము దురపిల్లుచుండెడి తల్లియు నన్ను నిలువనిచ్చుటలేదు. నాకు నాయిల్లే యరణ్యమైనది. కాశీనగరముసైతము నలుప్రక్కల జ్వరములు, మారీస్ఫోటకములు, కాళ్ళుచేతులు బిగియుట, మొదలగు వివిధ జాడ్యములు చెలరేగి, పౌరజనమృగములఁ దీవ్రముగ వేటాడుచున్నవి. ఇంటను, బైటనుగూడ నెమ్మదిలేదు. ఏమిచేయుదును? ఎందుఁబోదును? విశ్వామిత్రుఁడుకూడ దయచేయలేదు. ఇంక నా కూరటలేదు. శాంతిలేదు. [అని విచారముతో నిశ్చేష్టుఁడగును.]

విష్ణుమి: [ప్రవేశించి మంత్రినిజూచి తలపంకించుచు] మంత్రివర్యా! [అని పిలుచును.]

రామ : [కనులు దెఱచి] పండితులవారా! [నమస్కరించి] దయ చేయుఁడు [అని యాసనము చూపును].

విష్ణుమి: [కూర్చుండి] అబ్బాయిగారికి బాధ యేమియుఁ దగ్గలేదా?

రామ: ఆబాధ తగ్గునదికాదు. యావజ్జీవ మింక మమ్ము బాధించును. ఆకండ్లు రక్తపుముద్దలు. నిరంతరము జలస్రావము. భరింపరాని వేదన. ఆ నీటిబుగ్గ కనుగ్రుడ్లన్నాళ్లో యింక నిలువవు. మా ప్రాణములు దక్కవు.

విష్ణుమి: విచారపడకుఁడు. బాధవలన నిట్లు దలంపవలసివచ్చెను. కాని అబ్బాయిగారి కనుల కేమాత్ర మపాయము కలుగదు. నేఁడు మాయింటికి కొక జ్యోతిశ్శాస్త్రపారీణుఁడు, సర్వశాస్త్రజ్ఞుఁడు సకలతంత్రప్రవీణుఁడు, బ్రహ్మచారి, శిష్యసమేతుఁడుగ వచ్చెను. ఆయనకు రానివిద్యలు, తెలియనివిషయములు లేవు. వారికి మనబాబును జూపుట యుక్తము. వా రిదిగో యిక్కడనే యున్నారు.

రామ: ఎంతమంది చూచిరి? ఎన్ని వైద్యములు చేసిరి? కానిండు. ఏపుట్ట నే పామో? చూపింతము. వారిని బ్రవేశపెట్టుఁడు.

[విష్ణుమిత్రుఁడు నిష్క్రమించును.]

రామ: [స్వగతము] ఆస్థానపండితులు సామాన్యముగ నితరపండితుల మెచ్చరు. వీరెంతయో గొప్పవారు కావచ్చును, కానిమ్ము, గ్రహస్థితి యైనను మఱల విచారించవచ్చునుగదా!

విష్ణుమి: [ఢుంఠిభట్టారక విద్యాధరులతోఁ బ్రవేశించి] మంత్రిశేఖరా! వీరలే ఢుంఠిభట్టారకులు. జగన్నుతులగు మహాపండితులు. వారు విద్యాధరనామకులు. వీరి ప్రియశిష్యులు.

రామ : పండితవర్యుల కిదే నమస్కారము. దయచేయుఁడు.

ఢుంఠి, విద్యా: సమస్తసన్మంగళాని భవంతు. మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

రామ: [ఢుంఠినుద్దేశించి] అయ్యా! మీరిందు దయచేయుఁడు. [అందఱు ఉపవిష్టులగుదురు]. పండితోత్తమా! మాయామూర్తిఁ దీర్చి విచ్చేసిన దివ్యమూర్తివలె మీమూర్తి నాకు మిక్కిలి గనుపండువు సేయుచున్నది. ఒక్కమాఱు తమ యమృతవీక్షణములు నా కొమరునిపైఁ బ్రసరింపఁజేసి వాని నేత్రబాధ నివారింప నుపాయ మనుగ్రహింపుఁడు.

ఢుంఠి: మంత్రిశేఖరా! మిమ్ముఁ జూచితిని. ఇంక మీపుత్రునిఁ జూడ నక్కరలేదు. ఆతనిజాడ్యవిషయము లన్నియు నాకుఁ బొడగట్టినవి. మీమనస్సు చాలవికలముగ నున్నది. రాత్రి గనిపించిన కలలోని కాంత భూకాంత. ఆమె తలవిరియఁబోసికొని దక్షిణాభిముఖముగ మలినవస్త్రములతోఁ గన్నీరు గార్చుచుఁ బోవుచుండుట రాష్ట్రమునకు హాని. దానివలన మీరు భయపడకుఁడు. కొంచెము పేన్నెయ్యిఁ దెప్పింపుఁడు. ఇప్పుడే మీబాలకుని నేత్రములకు గుణము కనుపడును.

రామ: చిత్తము [ప్రక్కకుఁజూచి] ఎవ రక్కడ?

భటుఁడు: దేవా!

రామ: పేన్నెయ్యి గొంచెము తెమ్ము.

భటుఁడు: చిత్తము. [అని నిష్క్రమించును.]

ఢుంఠి: ఈజాడ్యమును మూఁడుపూఁటలలో నివారింపఁజేయవచ్చును. నిశ్శేషము కావలెనన్నఁ జక్షురధిదేవతయగు సూర్యునకు, నితర దేవతలకుఁ దృప్తికరముగ మంత్రానుష్ఠాన మొకమండలము చేయవలయును. సమస్తేంద్రియముల కధిపతులు దేవతలు. వారిని దిరస్కరించిన దోష మూరకపోదు. కొలఁదిదినములలో నిట్టిజాడ్యములచేఁ బట్టణము మిక్కిలిసంకటపడును.

విష్ణు: అటులనా?

భటుఁడు: [వెండిగిన్నెతోఁ బేరునెయ్యి తెచ్చియిచ్చును.]

ఢుంఠి: [నేతిని మంత్రించు టభినయించి] విద్యాధరా!

విద్యా : గురుదేవా! [అని సమీపించును]

ఢుంఠి: నీవు దీనినిగొనిపోయి బాలునినేత్రములలోఁ గొంచెము వేసి, రెండు క్షణములలో, నాతనిలోఁగల మార్పును దెలిసికొనిరమ్ము.

రామ : అయ్యా ! దయచేయుఁడు. [విద్యాధరునితో లోనికిఁబోవును.]

విష్ణు : [ఢుంఠి దిక్కై] అయ్యా నెలదినములనుండి, బాధించుచున్న దీ నేత్రరోగము. జాతకరీత్యా గ్రహదోషము కనఁబడదు. వైద్యము నకు లొంగదు. రోగనిదానము తెలియదు.

ఢుంఠి : జాతకము నొకస్థూలదృష్టిచేతనే గాదు. సూక్ష్మము సూక్ష్మ తరము సూక్ష్మతమము మొదలు పదియాఱంశములఁ బరికింప వలయును. ప్రశ్న జాతకాదులఁగూడ విచారింపవలయును. శాస్త్ర పద్ధతులలో నేవిధమునకు నెయ్యది యందకమానదు. ఇప్పు డావిచారణ నేల? మానినది మందు. నామంత్రము రోగమును బట్టినవిషయ మిప్పుడే తేలఁగలదు.

[రామశర్మవిద్యాధరులు వికసితవదనములతోఁ బ్రవేశింతురు.]

ఢుంఠి: విద్యాధరా! మంత్రికుమారుల నేత్రములలో మార్పేమైనఁ గనుపడెనా?

విద్యా: మహామంత్రులు సన్నిధానవర్తులేగదా! వారే సెలవిత్తురు.

రామ: పండితవర్యా! మీహస్త మమృతహస్తము. మీమూర్తి యపర శివమూర్తి. అట్లుకాకున్న మీరు మంత్రించియిచ్చిన యాజ్యప్రభా వమున నెప్పుడు నెడతెగక కాఱునీ రాఁగిపోవునా! పండిత వర్యా! మాప్రాణములు కుదుటఁబడినవి. మా కేకపుత్రుఁడు. అతఁ డంధుఁడు గాకుండఁ జేయవలయును. మమ్ము రక్షింపవల యును. [అని పాదములు పట్టుకొనును].

ఢుంఠి: [మంత్రిని లేవఁదీసి] సచివశేఖరా! విచారింపకుము. మూఁడు పూఁటలలో మీకొమరుని నేత్రజాడ్య మడఁగి గ్రంథము చదువఁగలుగును. ఇందుల కీ నేయియే చాలును. రోగని శ్శే షతకుఁ జెప్పినరీతిగ మంత్రానుష్ఠానమే యవసరము. ఇంక మా కాజ్ఞయిండు. పోయివచ్చెదము. [అని లేవఁబోవును.]

రామ: స్వామీ! సాయంకాలమున మఱల దర్శనభాగ్యము గలి గింపరా?

ఢుంఠి: ఇంక నే రానక్కఱలేదు. ఈ వైద్యము మూఁడుపూఁటలు చూచి, నాకు వర్తమానము చేయుఁడు. ఇతరవిషయములు మీ యిష్టమువచ్చినఁ జేసికొనవచ్చును. విష్ణుమిత్రవర్యా! ఇంక మనము పోవుదమా?

విష్ణుమి: పండితేంద్రా! మీ రీ మంత్రివర్యులకుఁ జేసిన యుపకారము జగదుపకారము. మాకెల్లరకు మంత్రివర్యులు ప్రాణసములు. ఇంతకన్న నిప్పు డేమియుఁ జెప్పఁజాలను. మన మింకఁ బోవు దము [అని ఆసనములనుండి లేచుచుందురు].

రామ: పండితేంద్రులారా! ఒక్కక్షణ మాగుఁడు. [అని సత్కరింపఁ బోవును.]

ఢుంఠి: నేను బ్రహ్మచారిని. నాకీ తాంబూలాదిగ్రహణము పనికిరాదు.

రామ: మాకు భూదేవులు దైవతుల్యులు. మేమెట్లర్చింపకుండఁగలము. మా మంత్రిమర్యాదకు భంగము తేవలదు. [అని పుష్పమాల వేసి సేలువఁ గప్పును. ఇరువుర వస్త్రాదులచేఁ బూజించును.]

ఢుంఠి: ఇంక మాకు సెల వొసంగుఁడు. [అని లేతురు].

రామ: ఎవ రక్కడ?

భటుఁడు: దేవా!

రామ: బండి సిద్ధపఱుపుము.

భటుఁడు: చిత్తము.

రామ: అయ్యా! దయచేయుఁడు.

[ఎల్లరు నిష్క్రమింతురు. తెరవ్రాలును.]

---

# దివోదాసనాటకము

## అష్టమాంకము

[ రాజగృహప్రాంతమున ఢుంఠి, విద్యాధరశర్మ ప్రవేశింతురు. ]

ఢుంఠి: విద్యాధరా! యోగినిగారివిషయ మెట్లున్నది?

విద్యా : ఆమె చేసినజాడ్యనివారణతో, మీరుచెప్పే స్వప్ననిదర్శనాలతో, ఇతర విశేషములతో మీనామము లీవారణాసీప్రజలకుఁ దారక మంత్రములై విరాజిల్లుచున్నవి.

ఢుంఠి : విద్యా! మనమాటకాదు. ప్రభుప్రధానుల గృహపరిచారికలు యోగినికడకు వచ్చినపిమ్మట నామెయుద్యమము విననలయును.

విద్యా : ఓహో! అదియా? నిత్యము వేలమందికి బౌద్ధచార్వాకమతప్రబోధము చేయుచు స్త్రీస్వాతంత్ర్యస్థాపన మొనరించుచున్నది. ఇంతియేగాక, తగినవారికి సర్వసిద్ధుల నిచ్చి సకలశక్తిసంపన్నలఁ జేయుచున్నది. ఈపరిస్థితులు చూచి మగవారలగుండెలు దిగ జారుచున్నవి.

ఢుంఠి : సెబాస్. విజ్ఞానకౌముదీ! నీపనులలో నీ వేమాత్రము వెనుకబడి యుండలేదు. మంచిది. సాగింపుము. నీప్రయత్నమును సంపూర్తిగ సాగింపుము. విద్యాధరా! యోగిని నేఁటికార్యక్రమము విచారించి, పుణ్యకీర్తిపండితులవారిశిష్యులుగాని మరియెవరుగాని వచ్చుచుండిరేమో విచారించి, మహారాజాస్థానమునకు రమ్ము. నీకార్యమున నీ వప్రమత్తుండవై మెలంగుము. పోయిరమ్ము.

విద్యా : [నిష్క్రమించును.]

ఢుంఠి: [స్వగతము] రాజమందిర మంతయుఁ జుక్కలులేని యాకసము వలెఁ బరిచారికాశూన్యమైనది. వ్యాధిపీడితుఁడగు పుత్రుఁడు, సంక్షుభితమగు రాష్ట్రము, వ్యాలోలముగ నున్ననగరము, ప్రభువునకు వ్యాకులకారణములుగ నున్నవిగదా! కానిమ్ము. మహారాజహృదయకటాహ మింకను ఉడు కెక్కవలయును.

[ అని నిష్క్రమించును. ]

## అష్టమాంకము - రెండవరంగము

[మహారాజమందిరమున రాజదంపతు లుందురు.]

అనంగ: ఆర్యపుత్రా! మన సమరంజయకుమారుని అనారోగ్యమును గుఱించి యేమి యోజించితిరి?

దివో: దేవీ! కాలగతు లతివిచిత్రములు. లోకవృత్తములెల్ల నవలీల నెఱుంగు నేను నాకన్నకొడుకు దేహస్థితి నెఱుంగలేనివాఁడ నైతిని. ఏమిచేయుదును? ఎట్టులనో దుంఠిభట్టారకునిమూలమున బల్లివలె మంచమున కతికియుండెడువాఁడు, ప్రక్కకుఁ బొరలి నోరు తెఱచి యించుక ఫలరసము మ్రింగుటవఱకు వచ్చినాఁడుగదా! మనసుకృతకర్మ మేదైననున్న నదియే మనల నుద్ధరించవలెనుగాని మార్గాంతర మేమున్నది.

అనంగ: యోగినీప్రభావ మెల్లయెడల వెల్లివిరియుచున్న దే, మనబాబు నా మొగముఁ జూపఁగూడదా?

దివో: [నిట్టూర్చి] మనభట్టారకుఁ డొకసర్వజ్ఞమూర్తి యగు మహాపండితుఁడు రాఁగలఁడని చెప్పెఁగదా! ఆవిషయము విచారించి యవసరమైన యోగినీవిషయ మప్పుడు చూడవచ్చును.

అనంగ: పసివాఁ డన్నుపట్టిన యెప్పుడు మంచమున కతికియుండఁ గాల నిరీక్షణ మెట్లుసేయఁగలము. మనప్రాణము లెంతవఱకు నిలువఁ గలవు? [అని కన్నీరు పెట్టును].

దివో: దేవీ! ధైర్యము విడనాడి విచారింపకుము. [అని యోదార్చుచు ముందుఁ జూచి] భట్టారకుఁడు వచ్చుచున్నాఁడు. పండితుని రాక తెలియఁగలదు.

[భట్టారకుఁడు ప్రవేశించును. భట్టారకునకు రాజ దంపతులు నమస్కరింతురు]

భట్టార: అభీష్టావాప్తి రస్తు. మహారాజ్ఞీ! కుమారమహారాజులుంగారి కెట్లున్నది?

అనంగ: మీయనుగ్రహమున రాత్రినుండి కొంచెము కన్ను తెఱచుచున్నాఁడు. కాని గుర్తుపట్టుటలేదు. మా కన్నతండ్రికన్న

మాకుఁ బ్రాణములు మఱిలేవుగదా! వానిని భూమిమీఁదఁ గాలు పెట్టించి మ మ్ముద్ధరించు భారమంతయు మీదే.

భట్టార : అమ్మా ! బాబుగారికిఁ గొంచెమారోగ్యము కనపడుచున్నది కాదా! ఏల యింత యధైర్యము? మాపండితులు జేపు వత్తురని తెలిసి, శిష్యునిఁ బంపితిని. అతఁడు వచ్చిన సర్వము దెలియును. విచారపడక యుత్సాహముగనుండుఁడు. కుఱ్ఱవానిని వదలియుండఁ గూడదు. లోనికిదయచేయుఁడు.

దివో : దేవీ! లోనికిఁబొమ్ము [అనిచెయిపట్టి లోనికిఁబంపును.]

భటుఁడు : [ప్రవేశించి] జయముజయము మహారాజులుంగారికి.

దివో : ఏమిరా! విశేషములు.

భటుఁడు: మహామంత్రులవారు. ఆస్థానపండితులవారు. దర్శన మపేక్షించు చున్నారు.

దివో : మంచిది. ప్రవేశపెట్టుము.

భటుఁడు : చిత్తము [నిష్క్రమించును.]

దివో : భట్టారకవర్యా! మహామంత్రులవలన రాష్ట్రవిశేషము లన్నియు, సంపూర్తిగఁ దెలియఁగలవు.

మంత్రి : ఓ తప్పక.

[మంత్రిముఖ్యులు ప్రవేశింతురు.]

దివో : మంత్రివర్యా! ఇటుకూర్చుండుఁడు. [పండితవర్యులకు నమస్కరించి] ఇటు దయచేయుఁడు. [ఆసనములు చూపును.]

పండి : సమస్తపీడాపరిహా రోస్తు [అందఱు గూర్చుందురు,]

దివో : మంత్రిశేఖరా! రాష్ట్రవిశేషము లేమి?

మంత్రి : సార్వభౌమా! సముద్రమథనమువలె, రాష్ట్రజనోద్వేగము ప్రచండముగ నున్నది.

దివో : అటులనా? తరువాత.

మంత్రి : నాయకులుగఁ గన్పడు ముగ్గురును, ముత్తైలంగులై, యొకఁడు తమలోఁ గొందఱు ప్రజాప్రతినిధులుగఁ బాలకవర్గమునఁ జేరి,

ప్రభుత్వవిషయమును దెలిసికొనుచుండవలయు ననియు, రెండవ నాయకుఁడు రాజును ద్రోసిరాజును జేసి, ప్రజాప్రతినిధులగు నాయకులే ప్రభుత్వము చేయవలెనని యు, మూఁడవవాఁడు, యువకభటసంఘాధిపతి, ప్రజలమందఱము స్వాతంత్రులమేగాని యొకఁడు నాయకుఁడై యొకరి నొకరు నియమించకూడదనియు, నెన్నో రీతుల నెవరిపక్షమును వారు స్థిరపఱచుచు యుక్తివర్గమును గురిపించుచుఁ బ్రభువుపైఁ బ్రభుత్వముపై దోషారోపణము చేయుచుఁ బ్రజలెల్లరు దమ తమ యధీనులగునట్టుల మిక్కిలి శ్రమపడుచు లోకము నల్లకల్లోలము సేయుచున్నారు.

దివో : మంత్రిశేఖరా! ఈ నాయకు లెవ్వరు? ద్రోహచింతనము లెందులకు? ఈ దురాలాపము లేల?

మంత్రి: ప్రభూ! పౌరహెచ్చరికలు లేక రాజ్యమంతయుఁ బ్రశాంతముగ నుండ నకాలప్రళయమువలె నీస్థితి యెట్లువచ్చెనో చెప్పఁజాలను. ఆయుపన్యాసకుల ధైర్యస్థైర్యము లసమానములు. వాక్కులమృతోపమానములు. ప్రభుత్వమును జేయు నింద, పాలకులఁ జేయు పరిహాసము వర్ణనాతీతము. ఇంక దేవర కేమని విన్నవింపఁగలను. వారివాక్యములు మఱికొన్ని విన్న నామనస్సుకూడఁ దాఱుమాఱు అగునన్న భీతి గలిగినది.

దివో: [మొగము చిట్లించుకొని] ఏమీ! ఇంతవఱకు వచ్చినదా?

మంత్రి: ఇంతవఱకే కాదు, ప్రభూ!

దివో: [కోపదృష్టితో] మఱి.

మంత్రి: ప్రభుదూషణమును భరింపనేరక మండలాధిపతి నాయకులతోఁ గూడఁ బ్రబలులగు ప్రజాప్రతినిధులవందలకొలందిగ బందినుంచెను.

దివో: [నిట్టూర్చి] తరువాత.

మంత్రి: తరువాతఁ బ్రజలాగకమఱలఁ బ్రభుత్వదూషణ మొనర్ప మొదలిడిరి. అట్టివారిని బట్టి తిరిగి వేయిమంది నీయధికారులు చెఱనుంచిరి.

దివో: అంతటనైన నాకల్లోల మాగెనా?

మంత్రి: ప్రభూ! ఏమిచెప్పుదును? ఆజరిగినస్థితి యపూర్వము.

దివో: అటులనా! ఏమది?

మంత్రి: ఏమున్నది? మర్దితులైన రక్షకభటులుతప్ప, తెల్లవారువఱకు కారాగారము కనులఁజూతమన్నను మచ్చునకైనఁ గానుపించ లేదు. బంధితులెల్లరు బహిరంగసభలలో యథాపూర్వముగ సిద్ధమైరి. ఇటుల మూఁడునాలుగు మండలములలో నచటి యధి కారులు ప్రజలపైఁ దీవ్రచర్యలు జరిపి చెఱసాలలచేటుఁ జూచి నిర్బంధవిధానమును సిలిపివైచిరి. ప్రజలు, తత్ప్రతినిధులు, నాయ కులు నిచ్చటివారా? యిచ్చటివారిని బోలినవారా యన్న సంశ యము మిక్కుటముగ నున్నది. కొందఱు ప్రతాపవంతులుగను గొందఱు భయంకరులుగను, గొందఱతిసాహసులుగను, బలు విధముల, దోఁచుచువచ్చిరి. మాకర్తవ్యము నింకఁ బ్రభువులే సెలవీయవలయును. దేవరయే శరణ్యులు.

దివో: [నిట్టూర్చి] ఈవిధానమంతయు, నిజముగ దురాత్ములగు దేవ తలదిగాని యన్యముకానేరదు. ఏమైనను నింక మనమూరకొన రాదు. ఇంక మితిమీఱినఁ బ్రజాక్షయముకూడఁ గాకమానదు. రక్తపాతములేని నా ప్రభుత్వమున నింక నీద్రోహమున జూడ నేరను. విననేరను. ఎవఁడురా అక్కడ?

భటుఁడు: [ప్రవేశించి] ప్రభూ!

దివో: సమస్తశస్త్రాస్త్రములతో నారథము నాయత్తపఱుపుమని సార థితోఁజెప్పుము. సేనానాయకుని గూడ సంసిద్ధముగ నుండు మనుము. పొమ్ము.

భటుఁడు: చిత్తము.

దివో: ఆహా! పదివేల సంవత్సరముల నుండియు నిరుపద్రవముగ నిర తిశయానందమున మునిగితేలు నారాజ్యలక్ష్మి నన్యులు చేటు చూచుటయా? నాప్రజలఁ గల్లోలపఱుపఁ బ్రయత్నించుటయా?

శా. నా సర్వస్వము నా సుఖోన్నతులు నానందంబు నా వాంఛలున్
నా సంతానము నీప్రజావితతిగా నా యాత్మలో నెంతు, వ్య
త్యాసంబుం గననీక యోముదును నారా! దేవతానీకదు
ర్వ్యాసంగంబు చెలంగునే? సకలశస్త్రాస్త్రంబుల్ వృథాపోవునే?
భట్టారకవర్యా! నాపుత్త్రిని భారమంతయు మీపైనుంచు చున్నాను. అనంగమోహిని కడలువుట్టకుండ సమరంజయుని రక్షించుభారము మీది. ఇంక నేనీ విప్లవకారుల సదమదముచేసి వచ్చెదను. లోనికి దయచేయుఁడు. మంత్రివర్యా! పోదమురమ్ము.

[నిష్క్రమింతురు.]



# దివోదాస నాటకము

## నవమాంకము

[శారద, యింటిముందు ప్రవేశించి, సంతోషముతో]

శారద: ఏమో, యేమో అనుకున్నాగాని యోగిని, యెంతమహానుభావురాలో, అంతగడుసుది కూడాను. నమస్కారంలోనే నా సంగతి గ్రహించింది. కాకపోతే ఫలభక్షణంతో పరిస్థితులు చక్కబడతయి అనదు. కొంపదీసి నేనాడదాన్ని కాలేదుగదా! [తనను జూచుకొని] అబ్బే. కాలేదు. కావడాని కైనా, పండ్లరసం వొళ్ళు నాలుగుమూలలూ పట్టవద్దూ? అయినా పోతురాజుకుమల్లే నేనుబోయి పుత్రుడు పుత్రుడూ అంటే, పోలతిని గాకుండా పుత్రుడెట్లా? వంశం నిలవడమెట్లా? వంశం వల్లకాడూ ఏమౌతుందో? ముందు నా కున్న మొగతనం కాస్తా యెగిరిపోవ్వేట్టు మాత్రం ఉంది. అయ్యేదేదో అవుతుంది. ఇప్పుడెందు కీవిచారము? ఇంక కాస్త ఇంట్లో కాలుపెట్టి, కదిలిస్తే కరవొచ్చే కాంతామణికి కొంచెం గర్వభంగంమాత్రం చేయాలి. [అని ముందుకు నడచి] ఒసేవ్! ఓయ్! పలుకదు. ఏమే? ఎక్కడే? ఏంజేస్తున్నావ్? [స్వగతము] ఇదీ కథ. గడపలో పావుగంటైనా నిల్చోంది అనుగ్రహంరాదుగా? ఏంజేస్తా? గ్రహచారం; తప్పదు. [ప్రకాశంగా] యెక్కడే? యేంచేస్తున్నావ్. తీ, తలుపు తీయిముందు.

గిరిజాంబ: [లోపలనుంచి] ఏమిటా వెఱ్ఱికేకలూ, పిలుపుమీద పిలుపూ, మీరూను. దొడ్లో మనిషి తలుపుదాకా రావాల్నా, అక్కర్లేదా? అన్నిటికీ తొందరేనా? [అంటూ లోపల్నించి బైటికివచ్చి శారదనుజూచి నిశ్చేష్టురాలై ఆశ్చర్యముతో] ఎవరీ మనిషి?

శారద: ఎవ రేమిటేవ్? నేను కాదటే! [అని నవ్వును.]

గిరిజ: [మొగము చిట్లించి] నే నంటే?

శారద: తెలియలా! నేనే. నిన్ను పెళ్ళిచేసుకున్నవాణ్ణి, నీమొగుణ్ణి.

గిరిజ : [తేరిపాఱజూచి మూతి విఱిచి తనలో] గొంతుపోలికను బట్టి ఇంటివారనుకొని పొరబాట్న తలుపు తీశా. [ప్రకాశంగా] ఎవర్తీవు? ఎందుకొచ్చావ్? పైగా పెళ్ళిచేసుకోడమూ, మగవాడవ్వానా నీవు? పద, ముందుపద, అవతలికి. ఆడది ఆడదాన్ని పెళ్లి చేసుకోడమూ? సిగ్గూ యెగ్గూ లా? పద, ముందవతలికి పద. పదవేం? [తీవ్రముగఁజూచును.]

శారద : ఏమిటే! అవసరముకోసం ఆడవేషం వేసుకువస్తే, ఇంత అధిక ప్రసంగమా? అవతలికి పోవాలీ! ఎవరా పోవాల్సింది? నీవా నేనా? జాగ్రత! [అని చేతులు సవరించుచు లోనికిఁ బోఁబోవును.]

గిరిజ: ఆ! నిలు. ఎక్కడికా పొయ్యేది? నిలవ్వేం? యేమనుకొన్నావ్? మగవాండ్లింట్లో లేరని లోపలఁజొరబడుదామనుకున్నావేమో! జాగ్రత! ఇంక అడుగువేయి, చెపుతా! [అని నడుము బిగించి] వేషము వేసుకున్నావుగా? నీవు నిజమైన ఆడదానివో, వేషం వేసుకున్న మొగవాడవో, నీసంగతి పదిమందిని పిల్చి చూపిస్తా. బజార్లో నిలువబెట్టి, నానాభజీతు చేయిస్తా. రాజభటుల కప్పగిస్తా. ఏమనుకున్నావో? జాగ్రత! పో, పోవేం? [అని నిట్టూర్చుచుఁ గోపమున జూచును.]

శారద: నిజంగా, నే నాడదాన్నయినానా ఏమిటే? [అని నిర్విణ్ణుఁడగును.]

గిరిజ : బజారుముండ వెవతెవో వచ్చి, పరువూ, మర్యాదా లేకుండా, నన్ను యేమిటే యేమిటే అంటూ, ఒకప్పుడో మగతనం యేడ్చినట్టు, నే నాడదాన్నైనానా అంటావేం? ఇలాగంటి తెలివితేటలు మావారు చూస్తే, ఇంకేంలా? దవడకొయ్య లూడాల్సిందే. ఇదేం ఆషామాషీగాదు. సంస్థానోద్యోగస్థుల యిల్లు. జాగ్రత!

శారద : [తనను జూచుకొని విచారముతో] నిజంగా యిప్పుడాడదాన్నైనా. యోగిని నాకొంపదీసింది. ఇంక అఱచి అల్లరిచేసి నీ పరువు, నాపరువు బైటవేయకు. నేను చేసిన పనంతా చెబుతా. యథార్థంగా నీభర్తను. సదాశివశర్మను. నాపోలిక, నాకంఠం గుర్తుచూసుకో. తొందరపడక యిలాకూర్చో, చెబుతా!

గిరిజ : [పోలికలుచూచి నిర్విణ్ణురాలై] ఈమాటలు నమ్మాలో నమ్మకుండా ఉండాలో, నాకేం తోచడంలా. [అని కూలఁబడును.]

శారద : [కూలఁబడి] నీవు నామాటవినక యోగినిదగ్గిరికి పోనంటే, ఈ వేషంతో నేను బోయి బుత్తదానంకోరా.. ఓపండిచ్చి, ఇది తిను, పరిస్థితులు మార్తై, రేపురా, మంత్రోపదేశం చేస్తా, మంచికొడుకు పుడతా డన్నది. నేను ఆడ, నీవు ఆడ. ఇంకెందుకు? నీదారి నీది. నాదారి నాది.

గిరిజ : [దుఃఖంతో] అయ్యో! అయ్యో! నేనింక బ్రతకలేను. ప్రజల మొఖం చూడలేను. దేవుడా! ఇంత కొంపగూల్తుం దనుకోలా. పరమేశ్వరా! పరమేశ్వరా! [అని శారదపై కొఱఁగును.]

శారద : [ఉపచరించుచు] విచారపడితే యేంలాభం? నీవక్కడికి వెళ్లననడమే యింత కొంపమునగడాని క్కారణం. ఇంకేం చేస్తావో చెయ్యి.

గిరిజ : ఇప్పుడు నేనేం జెయ్యనండి? నాబ్రతుకెల్లా తెల్లవారుతుందండీ? ఇంక నాప్రాణాలు నిలవ్వండీ! పాడుముండ, యోగిని యెక్కణ్ణుంచొచ్చిందండీ? ఇంక నన్ను మీరే రక్షించాల్నండీ. [అని భర్త నడుము పట్టుకొనును.]

శారద : గిరిజా! ఆమహాతల్లిని తిట్టావంటే, ఇంక మనకే ఆశలు లేవు. రక్షిస్తే ఆమేరక్షించాలి. ధైర్యం తెచ్చుకొని, లోపలికిపోదాంరా! ఇవ్వాళ మొగవాణ్ణి ఆడదాన్ని చేసింది. రేపు ఆడదాన్ని మగవాణ్ణెందుకు చేయదు? ఆ తల్లి చల్లనితల్లి. పరులకష్టం చూడలేదు. మనం తెల్లవార్లు విచారించుకొని ఆమె దగ్గిరకు పోయి, ఆమె కాళ్లమీద పడదాం. లోపలికి పోదాం రా! [అని లేవదీసి, లోపలికిఁగొంపోవును.]

[ తెరవ్రాలును ]

## నవమాంకము - రెండవరంగము

[ ధర్మశాలలో వకుళ పరికరముల సిద్ధపఱచుచుండును. ]

యోగిని : [ తెరలోనుండి] వకుళా! వకుళా! [అనుచుఁ బ్రవేశించి] సర్వము సిద్ధముచేసితివా?

వకుళ : ఆ.

యోగిని : మంచిది. [అని కూర్చుండి] వకుళా! రాత్రి డుంఠిభట్టారకుఁడు మనయేకాంతమునఁ జెప్పిన ముఖ్యవిషయ మేమి?

వకుళ : ఆ, యేముంది? మహారాజులుంగారి సౌధాలలో, మంత్రివర్యుల మందిరాల్లో, ఉన్న పరిచారికలంతా యోగినీగణమే నని, ఒక్కమాఱుగా వారంతా యిక్కడికి వచ్చేస్తారనీ, ఆభవనాలన్నీ దాసీజనశూన్యా లవుతాయనీ అన్నారు.

యోగిని : మంచిది. ప్రభుహృదయసంచలనమున కిది యొక ప్రశస్త ప్రయోగము. కానిమ్ము! వకుళా! అట్టివా రెవ్వరైన నిప్పు డిచ్చటికి వచ్చియుండిరా?

వకుళ : నిన్నటికంటె నాలుగింతలుగ, ఆడవాళ్లంతా వచ్చారు. ఆవరణ మంతా క్రిక్కిరిసిపోయింది. ఎవ రెవ్వరివారో నేను జెప్పలేను.

యోగిని : వకుళా! మనకడకు వచ్చినవారు, క్రిందఁగూర్చుండుట యుచితముకాదు. నీవు వెళ్లువఱకు, వివిధవిచిత్రా స్తరణములతో నొక మహా త్తరపటకుటీరము సిద్ధముకాఁగలదు. వార లందఱ నందుఁ గూర్చుండ నియమించి, నిన్నఁబాడిన బాలికచేతను, దదితరుల చేతను, బాటలు, భరతనాట్యము మున్నగువానితోఁ గాలక్షేపము సేయించుచు, నందరకుఁ బండ్లు పంచి పెట్టించుచుండుము. లక్ష్మి, గౌరీసోమిదేవమ్మలు వచ్చిన నిచ్చటకుఁ బంపుము.

వకుళ : చిత్తము. [అని నిష్క్రమించును.]

యోగిని : [స్వగతము] ఈకాశీపట్టణమం దంతటను, నెలదినములనుండి సర్వరోగవివృద్ధియుఁ దన్నాశమును నామూలమునఁ గలిగి పౌరజనాభిముఖ్యమునఁ దరుణీమండలములు తండోపతండము

లుగ నాకడకు వచ్చుచుండుట తటస్థించి, నాకార్యసాధనకు గట్టి పునియాదియేర్పడినది. ఇంక నీ నారీమణు లెల్లరు స్వాతంత్ర్యదీక్ష నవలంబింపవలయును. అందులకు, వీరెల్లరు బౌద్ధచార్వాకమతావిష్టలుగాకున్న మాత్ర మాపని నెఱవేరదు. లోకానర్థకరములగు నిట్టి దుర్మతముల నశింపఁజేయవలసిన నే నీసుందరీహృదయకేదారంబుల నాదుర్మతసస్యాంకురములనాఁటి, స్వేచ్ఛాచారముల నెట్లు పండింపఁజేయుదును? ఎట్లూరకుందును? [యోజన నభినయించి] నిరంతరము నిజవక్షఃపీఠమున నధివసింపఁ జేయు నా హృదయవల్లభుఁడగు భగవానుని యాజ్ఞ కాదందునా? అటులననేరను. అది యెట్టిదియైనఁ జేసియే తీరవలయును. కాని నిన్న నే నొకింత స్త్రీస్వాతంత్ర్యవిషయ మన్యాపదేశముగ ముచ్చటింప నెవ్వరి కా విషయ మంత రుచించినట్లు కన్పట్టదు. భరతదేశమే యంతట నిట్టిబోధమున కుపకరింపదు. అందును సదాచారసంపన్నమై, పుణ్యరాశియగు నీకాశీక్షేత్రమునసా యీదురుద్యమము విస్తరిల్లుట? ఇచ్చటి యంగనలెల్ల రాజన్యపావనలు, శ్రోత్రియకుటుంబినులు. చాలమంది సోమిదమ్మలు. వీరిశరీరేంద్రియములు, మనోబుద్ధులు, రక్తమాంసములు, సదాచారవాసనా వాసితములు. ఇట్టివారి చిత్తవృత్తులు స్వేచ్ఛ నవలంబించుట మిక్కిలి గష్టము. అయినను విష్ణుహృదయవల్లభ నగు నాకు సాధ్యము కానిది లేదు. వ్యాధుల యుత్పత్తిస్థితిలయములవలె నొక్కనెలమాత్రమే మాంత్రికఫలముల నీ ముదితల హృదయములు నా వశమున నుండున ట్లొనరించెద.

వకుళ: [ప్రవేశించి] అమ్మా! నిన్న వచ్చిన శారదమ్మ, ఇంకో అమ్మతో వచ్చింది. వారు వీరే. [అనిచూపును.]

శారదా, గిరిజ : అమ్మా! యోగినీదేవీ! మా అపరాధాలు క్షమించి మమ్ము రక్షించండి. [అని నమస్కరింతురు.]

యోగిని : శారదా! ఈమె యెవరు?

శారద : [విచారముతో] ఇట్లా అయిపోయిన నేనేమిచెప్పుదును, తల్లీ!

గిరిజ : [దుఃఖముతో] తల్లీ! లోకమాతా! నన్ను రక్షించవలె. నాతప్పు క్షమించవలె. మహాపరాధినిని. నేనిక్కడకు రాకపోవడంచేత నాభర్తగారి కీస్థితి పట్టింది. అంతా ఆడమరూపై పోయింది. నేను తెక్కలూడిన పక్షిని. నానెత్తిమీది గొడుగు పోకుండా, ఎట్లా ప్రాణాలునిల్పి నన్నుధరిస్తారో, అంతా మీదేభారం. తల్లీ! భర్తృదానం చేయండి. నన్నుగాపాడండి [అని నమస్కరించును.]

శారద : తల్లీ! నీవు సర్వజ్ఞురాలవు. నీకు తెలియంది లేదు. చేటంతకన్ను గల మహాతల్లివి. నీదగ్గిర నా ఆటేం సాగుతుంది? ధరించిన శిరోజాల దగ్గిరనుంచి, అన్నిహంగులు, నీకనుచూపులోనే వుందో, ఇచ్చినపంపులోనే వుందో ఆశక్తి, అమ్మా! అమాంతం ఆడ చిన్నదానై, నిజమైన యువతీమణి నైనా!

గిరిజ: నిజం నిజం. అంతా ఆడస్వరూపమే అమ్మా!

శారద: ఈ నా పెళ్లాం నేను కొత్త ఆడమనిషి ననుకోని, నానా హంగామ చేసి, ఇంట్లో కాలు పెట్టనియ్యలా.

గిరిజ : ఈయన యిట్లా యీయవతారం ధరిస్తారని నాకేం తెలుస్తుంది తల్లీ! ఎవరో బజారుమనిషి యింట్లో దూరుతోం దనుకోని రావద్దన్నమాట సత్యమే.

యోగిని: [చిరునగవుతో] ఏమీ! మీవ్యవహారము ఇంతవరకు వచ్చినదా?

శారద: అంతేగాదు తల్లీ! యెల్లాగో ఆడదాన్నైనా, అమ్మ ఉపదేశం చేస్తుంది, నాతంటా ల్నేను పడి కొడుకును కంటా నంటే, అమ్మో! నే చస్తా, నీవుమొగుడవు కావాలి, కొడుకు గలగాలని తెల్లవాళ్లు ఒకటేగోల. ఈగోలతో ఇరుగూ పొరుగూ అంతా యేకమై నే నాడదాన్ని కానటం మాట పట్నంలోపడి, మా వీధికి వీధంతా తీర్థప్రజ అయిపోయింది. మా మొఱ విని, మీకే నమ్ముధరిస్తారని ఆ గుంపును జీలదీసుకోని మీ కండ్లముందు పడ్డాం. ముంచినా తేల్చినా, భారమంతా మీదే.

యోగిని: వెంటనే మీకోరిక సిద్ధింపనేరదు. నేను జెప్పినట్టు చేయవలయును.

ఇద్దరు: [నిర్విణ్ణలై] ఏమిటి తల్లీ! ఏమిచేయవలె?

యోగిని: మంత్రానుష్ఠానము చేయవలె. గిరిజకు భర్తృప్రాప్తి, మీకు పుత్రప్రాప్తి కలుగును.

శారద: ఎంతకాలము తల్లీ!

యోగిని: ఎంతకాలమో లేదు. నెలదినములకు మించదు.

శారద, గిరిజ: [సంతోషముతో] తల్లీ! తప్పకుండా మీసేవ చేస్తాం.

యోగిని: మీభక్తికి మిక్కిలి సంతసించితిని.

యోగిని: శివశారదా!

మ. వనితారూపము వచ్చినందులకు నీవైదగ్ధ్య మేపార మా
పనులన్ బాల్గొను నీవు నీగిరిజతో, భాసిల్లు త్వద్రూపమున్
గనఁగా నేర్తువు, పుత్రసంతతిని సౌఖ్యం బాయు వారోగ్యమున్
ఘనసంపద్విభవోన్నతుల్ వెలయు, వేడ్కల్ గాంతుమీ రెంతయున్

శారద: అమ్మా! మీనోటిమీదుగా ఇన్నిమాటలు వచ్చినయ్యంటే మాభాగ్యం పండిందన్నమాటే. మా ఆనందం స్వర్గానికి నిచ్చెన్లు వేసినట్టుంది.

యోగిని: గౌరీసోమిదేవమ్మకు లక్ష్మికి సకలసిద్ధులును బ్రసాదింతును. వారి కన్నిశక్తులు కలుగఁగలవు. వారిప్పుడే రాఁగలరు. మీ రేమందురు?

శారద, గిరిజ: [సంతసముతో] మాకుకూడా అనుగ్రహించండి తల్లీ!

యోగిని: అటులైన, వినుఁడు.

శా. వీక్షామాత్రమునన్ సమస్తకళలున్ వేదంబులున్ శాస్త్రముల్
సాక్షాత్కార మొనర్తు, బుద్ధిగరిమల్ సర్వోన్నతుల్ శ్రీవిశా
లాక్షీతుల్యముగా వెలార్తుఁ బురుషవ్యాపారపారీణతా
దీక్షల్ మీకొనగూర్తు, గైకొనుఁడు, సందీపించుఁగారోన్నతుల్.

ఇద్దరు : తల్లీ! తప్పక అనుగ్రహింపుఁడు.

గౌరమ్మ, లక్ష్మి : [ప్రవేశించి] శ్రీమతి విజ్ఞాన కౌముదీయోగినిగారికి నమస్కారములు.

యోగిని : అభీష్టావాప్తి రస్తు. రండు, కూర్చుండుఁడు. [వా రుపవిష్ట లగుదురు.]

యోగిని : సోదరీమణులారా! మీబిడ్డల కెల్లర కారోగ్యమే కదా?

గౌరి : అమ్మా! ఇంకా ఆవిషయ మడుగవలెనా ? మాపిల్లలకే కాదు. మీ స్మరణ మాత్రముననే మాపట్టణములోని రోగములెల్లఁ జేతఁదీసినట్లు పటాపంచలైనవి. ఇంక మాకు వ్యాధిభీతి లేదు. నిన్నఁ గొంచెము స్త్రీధర్మవిషయము ముచ్చటించితిరి. అది నేఁడు పూర్తిచేయవలయును.

యోగిని : ఓ! తప్పక. ఇది నందనవనమునుండి వచ్చిన దేవతాప్రసాదము. ముందు దీనినిఁ బుచ్చుకొనుఁడు. [అని ఫలముల నిచ్చును]

గౌరమ్మ, లక్ష్మి : [గ్రహించి తినుచు.]

గౌరీసో : ఆహా! యేమిపండ్లండి! మీమనస్సులాగ యెంతమాధుర్యం! ఎంతరుచి! అబ్బో! ఎప్పుడు తినలా యిల్లాగంటి పండ్లు.

లక్ష్మి : [సంతసముతో] దీనితీపి ఇంతా అంతా అని చెప్పలేను. నిజంగా దేవతాప్రసాదమే. అమ్మా! యింక స్త్రీలవిషయం సెల వివ్వండి.

యోగిని : సోదరీమణులారా! నిన్నటికంటెఁ బౌరసుందరీమణు లధికముగ వచ్చినట్లు దెలిసినది. మీరు నాకు అంతరంగికలు. చేయవలసిన పని యంతయు, మీరే చేయవలయు. అందుచేతఁ గార్యనిర్వాహకసభ్యురాండ్రగు మీతో యోజింపక స్త్రీమహాజనసభలో నాయభిప్రాయము నేనేమియుఁ దెలుపనేరను. గాన నేఁజెప్పు విషయముల మీరెల్లరు శ్రద్ధతో నాలకించి మీయభిప్రాయ మును వెల్లడింపవలయును.

గౌరీసో, లక్ష్మి: ఇంక మీయాజ్ఞలకు బద్ధులము.

యోగిని: కాంతలారా! మున్ముందు మనపుట్టుకలను, మనసంసారము లను మన మెఱుంగవలయును.

సీ. మొదలు తుదిలేని భవ మిద్ది, పూని దీనిఁ
గనుచుఁ బెంచుచు నుండెడుఁ గర్త లేఁడు,

తనకుఁ దానయి జనియించుఁ దా లయించు
నిదియె యీ సృష్టితత్త్వంబు సుదతులార!

లక్ష్మి: అనఁగా, జగత్తునంతా సృష్టించేవాఁ డీశ్వరుఁడనుట అసత్యమన్నమాట.

యోగిని: కేవల మసత్యము. ఇంతియేకాదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులకు సైతము ఆహారభయనిద్రాదులును, జీవితాశయుఁ బ్రాణభయము సమానములు. మన దేహములవలెనే వారి శరీరములుకూడఁ గాలవశమునఁ బోవునవియేగాని యొక్కనితనువు కూడ స్థిరముగ నుండునది కాదు. పిపీలికాదిబ్రహ్మపర్యంతము జీవులెల్ల రొక్కటియే. వీరిలోఁ దారతమ్య మేమాత్రమును లేదు. కాన దయ, సత్యము, అహింస, పరోపకారము మున్నగు నుత్తమగుణములు గలిగి, యత్యల్పములగు చీమ, దోమ, పేను, నల్లి మొదలగువానినిగూడఁ జంపక సర్వభూతములయందును సమభావమున నుండవలయును. ఇదియే జీవితపరమార్థము.

గౌరమ్మ: మీవాక్యము లమృతోపమానములు. సర్వజనోద్ధారకములు. చెప్పండి. అందరికి అందుబాటులో నుండు మార్గము చెప్పండి.

యోగిని: మఱియును, విషయేంద్రియ సంయోగజనితమై సర్వమతములవా రంగీకరించిన ప్రత్యక్షప్రమాణమే మనకు ముఖ్యము కాని, అనుమానాదిప్రమాణములను మన మేమాత్ర మంగీకరింపఁగూడదు. ఇంకను మన మనుభవించు సౌఖ్యమే స్వర్గము. పొందెడి యానందమే బ్రహ్మము. కలిగిన కష్టమే నరకము. శరీరత్యాగమే మోక్షము. ఈవిషయము లింకెవ రెన్నివిధములఁ జెప్పినను, ఇందులకు భిన్నముగ నణుమాత్రము మన మంగీకరింపఁ గూడదు.

లక్ష్మి: అమ్మా! 'చచ్చినతర్వాత స్వర్గనరకాదు లనుభవిస్తా' రన్నమాట వట్టి దన్నమాట.

యోగిని: అవియన్నియుఁ గల్పనాకథలు. ఆమాట లెన్నఁడు నమ్మకూడదు.

గిరిజ : అలాగా! [తల పంకించును]

యోగిని : అవును! పురంధ్రీమణులారా! చిరకాలమునుండి గతానుగతికముగ స్త్రీలోక మన్యాధీనమై, యస్వతంత్రమై, యసంగతధర్మనిబద్ధమై యాత్మోన్నత్యవిచారణాశూన్యమై యంధప్రాయమై గౌరవవిరహితమై, యతికష్టములపాలగుచుండుటఁజూచి, నాహృదయము మిక్కిలి బరితపించుచున్నది. వేద మపౌరుషేయమని, యయ్యది పురాతనప్రమాణగ్రంథమని, తదాచారములే మన కిహపరసాధకములని చెప్పువారెల్లరు స్వార్థపరులగు లోకవంచకులు. ఉన్మత్తప్రలాపములవలె నొకచోట నొకరీతి, వేఱొకచోట వేఱొకరీతిఁ జెప్పెడు వేదవాక్యము లెప్పుడును మనకుఁ బ్రమాణవచనములు గానేరవు. అట్టివానిని మన మేమాత్రము విశ్వసింపఁగూడదు.

శా. మాహింస్యాత్తని యొక్కచోఁ బలికి యమ్మాడ్కిం దుదిం బోక, వ్యామోహంబుంగన, యాగమందుఁ బశువుల్ బోకార్ప నౌనంచు సందేహార్థ స్వవిరుద్ధ వాదములతో దీపించుటల్ చెల్లునే?
ఆహా! రెండుగఁ బల్కు, వేదమయినన్ హర్షించువా రుందురే?
కావున నింక నానిగమనియమములఁ దప్పక నివారింపవలయును.
ఇదియే మన ప్రధానకార్యము.

లక్ష్మి : ఏమిటీ! వేదాలుకూడా మోసం జేసే వన్నమాట. ఎంతమాట!

గౌరిసా : మన కేం తెలుసు? చదువులసరస్వతి, ఆ తల్లి చెప్పింది కాబట్టి మన మిప్పుడు నిజం తెలుసుకున్నాం. ఇంకా ఆమాటలు విశ్వసిస్తామా? ఇండ్లల్లో అగ్నిహోత్రాలు సాగనిస్తామా?

యోగిని : ఇంతియేగాదు. ఈలోకమునకుఁ గలిగిన ద్రోహ మనిర్వాచ్యము.

గౌరిసా : అది యేమి?

యోగిని :

మ. సుకృతంబుల్ విలసిల్లి జాతి యొకఁడై శోభిల్లుట ల్లేక, విప్రకులీనుం డని రాజు వైశ్యుఁ డనుచున్ బాదోద్భవుండంచు నెన్నొ కులంబుల్ నెలయించి రిద్ధరణి, నెంతో దుర్భరం బిద్ది, యెందొక దేహంబునఁ బుట్టువారి కగునే? న్యూనత్వ మాధిక్యముల్.

గారీసో: నిజముసుమా! ఒక్క యీశ్వరుని శరీరంలోఁ బుట్టిన నలుగుర్ని నాలుగువర్ణాలవా రనడం, ఒకరి కొకరు కాకుండా చేయడం మాత్రం, గొప్ప అపకారం.

యోగిని: సోదరీమణులారా! ఇంక స్త్రీలకుఁ గలిగిన యన్యాయము, అవమానము మిక్కిలి దుస్సహములు. వానిని దలంచినప్పుడెల్ల నాహృదయము తల్లడిల్లుచుండును. ఈపరితాప మపనయించుట కొఱకే పరివ్రాజకనై యోగినినై తపస్వినినై లోకోన్నత శక్తుల నెన్నిఁటినో గడించితిని. మీతోడ్పాటుతో నాశక్తుల నన్నింటిని వినియోగించి వనితాలోకమునకుఁ గల్గు వంచన మంతయు నిర్మూలించెద.

చ. పరిణయ మెన్ని దేండ్లకని, బాల కొకం డొకపుస్తెఁగట్టి, యే
మెఱుఁగనినాఁటనుండి తనయేల్బడిక్రింద నడంచి పెట్టి, దు
ర్భరగృహదాస్యజీవననిబంధనబంధనమందుఁ ద్రోయు దు
ర్నరకపుబాధ కాంతలకు నాశమొనర్చెద, మేలుగూర్చెదన్.

లక్ష్మి, గౌరులు : [నిర్విణ్ణ లగుదురు.]

లక్ష్మి : నిజంగా అదో మహానరకమే. తప్పకుండా నరకమే.

గారీసో : తల్లీ! వనితాలోక మెప్పటికైన నీనరకబాధనుండి విముక్తిఁ గాంచునా?

యోగిని: నిజముగఁ గాంతాజనోద్ధరణము కావలెనన్న, మీవంటి ధీరనారీమణులు సాహసించి ముందంజ వేయవలయును. మార్గదర్శినులు గావలయును.

మ. అవివేకంబునఁ బూర్వపద్ధతులలో నల్లాడగాఁ బోక, యా
దివ మెందో కలదంచుఁ జింతిలక, సందీపించుసౌఖ్యోన్నతుల్
భువి నెబ్బంగి లభించునో, యటులఁ, దద్భోగోన్నతుల్ పొందుటే
భవముం గాంచినదానికిన్ ఫలముగున్, శ్రేయంబు ధన్యంబగున్.

ఉ. వర్ణవిభేదముల్, వరుస వావియు, భార్యయు భర్తయన్న యా
నిర్ణయముల్ గణింపక, జనించెడు కోర్కులఁ జంప, కిబ్భువిన్

దుర్ణయ మన్నమాట విడి, తోఁచినభంగిఁ జరించు కాంత యా
స్వర్ణగిరీంద్రమం దలరుచాడ్పునఁ గాంచు స్వతంత్రసౌఖ్యముల్.

గౌరి : తల్లీ! వర్ణవిభేదము నిరాకరించినను వావివరుసలు వదలి, కొంత కాలమైన భర్తృనియమము లేక, సంచరించు స్త్రీల కారోగ్య భంగము కూడఁ గలుగదా?

యోగిని: [నవ్వుచు] కూపకూర్మన్యాయమున నుండు మీ సనాతన వాసన లీ సంశయమును గలిగించునుగాని, యీ విశాలప్రపంచమున, స్వేచ్ఛాచారకృతమగు ననారోగ్యమును నవమానము నెఱుంగక సంచరించు పశుపక్ష్యాదులవలె విహరించెడివారి చరిత్రలు మీ రెఱుంగరు.

గౌరి : అటులనా? నిజము. పాలుచిలికినఁగాని వెన్న చిక్కదు.

లక్ష్మి : అమ్మా! పూర్వాచారాలన్నీ పూడ్చిపెట్టి, స్వేచ్ఛాచారాన్ని స్వీకరించా లన్నమాట.

యోగిని : ఔను. ఇదియే స్త్రీస్వాతంత్ర్యమునకు ముఖ్యసాధనము.

గౌరి : సౌఖ్యానుభవమే జన్మసాఫల్య మనుమాట మాకు సంతోషమే కాని, తోడు లేక, బజారునుగూడఁ దొంగిచూడ లేని యీయంగన లెట్లింత ధైర్యము వహింతురు? స్వాతంత్ర్యసుఖముల నెట్లు సాధింతురు?

యోగిని : నిక్కముగ నీవిషయ మడుగఁదగినదియే! సహజౌన్నత్యము చాటుపడి చాన లింతటి పిఱికిగుండెఁ గలిగియుండుట యే నెఱింగియే, సర్వశక్తులు సమకూర్చుకొని, మిమ్మన్నివిధముల విశ్వాసినుతలఁ జేయుటకే నే నిటకు వచ్చితిని. నాకుఁగల సర్వసామర్థ్యములు మీ కొసంగి, వనితాజనోద్ధరణమునకు మిమ్మెల్లర నా ప్రతికృతులుగ సిద్ధముచేసికొందును.

సీ. వీక్షాంచలమున నే వీక్షింప నెనలేని
ఘనసంపదున్నతుల్ గలుగకున్నె?
యొక యక్కరము చెవి నూది వెన్నటిన
వివిధవిద్యాప్రౌఢి వెలయకున్నె?

కరమున స్పృశియించి కైదువు నొసఁగిన
వజ్రాయుధంబయి వరలకున్నె?
కడఁగి యించుక రక్ష కై దండఁగట్టిన
వెఱపఱి వీరతల్ వెలయకున్నె?

గీ. మగువ మగవాఁడు మగఁడన్న మాట విడచి
శౌర్యధైర్యోన్నతస్థితుల్ జగతి నింపి
లీల నదలించి ప్రభు, భువి నేలకున్నె?
కూర్మి స్వాతంత్ర్యలక్ష్మిఁ గైకొనకయున్నె?

కాంతామణులారా! ఇఁక మిమ్మెల్లర విద్యామూర్తులఁ దేజోమూర్తుల, శస్త్రాస్త్రప్రవీణల, సకలకార్యధురీణలఁగా సిద్ధపఱచెద. నాయనుగ్రహమున మీరు సర్వసామర్థ్యములు గలిగి ప్రభుసన్నిధి కేగి పరిపాలనమునఁ బాల్గొన నున్నతపదవు లిమ్మని ప్రతికాముఖమునఁ గోరుఁడు. ఇంతియేగాక కోటిమాడలతో నే నిచట స్థాపింపఁబోవు స్త్రీస్వాతంత్ర్యపాఠశాల కిచ్చుట వలయు స్థల ముచితముగ నిమ్మనికోరుఁడు. అతఁ డేమిప్రత్యుత్తర మిచ్చునో తెలిసికొనవలయును. అదియే తేపటి కార్యక్రమము.

గౌరీసో: అమ్మా! మీమాటఁ గాదననేరము. కాని మాప్రభువు మాకు దర్శన మిచ్చి, మమ్మాదరించు నన్నయాశ కలుగుటలేదు.

యోగిని: సోమిదేవమ్మా! అతఁ డంత యవివేకి కాజాలఁడని నాతలంపు. ఐన మన కర్తవ్య మిది. తప్పక దాని నెఱవేర్పవలయును.

ఉ. స్త్రీలన నెవ్వరో యెఱిఁగి, చేవయుఁ బాండితి, శక్తి, నెంచి భూ
పాలుఁ డమాత్యముఖ్యపరిపాలకులందున మిమ్ముఁ జేర్చునో,
హేలఁగ బల్కునో, యెఱుఁగు టెంతయు కర్జము, మేఱమీఱ నే
నే లయమూర్తినై నృపతి నీడ్వనె? రాజ్యము మీకుఁగూర్పనే?

కాన నీ విషయమున మీ రెంతమాత్రము జంకఁ బనిలేదు. నిశ్శంకముగఁ బోయిరండు.

శివశారద: అమ్మా! మీయనుగ్రహబలమున మేము సర్వము సాధింతుమన్న నిశ్చయము కలుగుచున్నది. కాని కాశీపట్టణమున వేదవిరుద్ధమార్గమునకుఁ దావుండదని, యేశాస్త్రజ్ఞులు శాస్త్రబలమును నితరు లితరమతములను నిలుపుకొనువారు లేరని, కాశికి నోటమి కలుగదని యొకప్రతీతి. ఏరూపముననైనఁ బరమేశ్వరుఁడే వచ్చి యవమానించునేమో యన్న శంక గలుగుచున్నది. అప్పు డేమి సేయవలయునో తెలియనేరము.

యోగిని: సోదరీమణులారా! ఇప్పు డిచ్చటఁ బండితులుగాని ప్రభువుగాని త్రిదశులుగాని త్రిలోకధారులుగాని నన్నెవ్వరును జయింపనేరరు. మీ రింక నిర్భయముగఁ బ్రవర్తింపవచ్చును. కాక, నన్ను జయింప నే చతుర్దశభువనాధీశ్వరుఁడైనఁ బుట్టిరావలయును. అట్టి పనియే జరిగి,

మ. నను శాస్త్రార్థములన్ జయించి కడిమిన్ నాశక్తులన్ మించి మ
ద్ఘనతల్ దూల్చెడువా డెవండయిన నీకాశీపురిన్ వెల్గ, నా
తని నే దైవ మటంచు, నా విభుని పాదం బంటి, పెండ్లాడి, మే
లెనయం జేయనె యెల్లధర్మముల? మీ యిష్టంబు లీడేర్పనే?

కాన నిప్పుడే మిమ్మెల్లర సర్వసిద్ధిసంపన్నలఁ జేసి రాజసమక్షమున కేగు విధము వివరింతును. దేవీసన్నిధికిఁ బోవుదము, రండు.

అందరు: చిత్తము [నిష్క్రమింతురు.]

## నవమాంకము - మూడవరంగము

[అనంగమోహిని, ఢుంఢిభట్టారకుఁడు ప్రవేశింతురు]

అనంగ: [విచారముతో] భట్టారకవర్యా! పుత్రునివ్యాధి, సర్వగృహపరిచారికానిష్క్రమణము, ఆర్యపుత్త్రుని ప్రజోపద్రవనివారణప్రయత్నము, యోగిని యసాధారణశక్తిసామర్థ్యములు కూడి యొక్కమాఱుగ నాలుగు సముద్రములు పొంగిపొరలి నన్ను ముట్టడించుచున్నట్లున్నది. నాకు భయకంపములు కలుగుచున్నవి.

ఏది యెట్లున్నను ఆర్యపుత్రులకుఁ గుశలమేకదా! సర్వజ్ఞులు తాము సెలవీయవలయును.

డుంఠి: అమ్మా! సార్వభౌముల కేవిధమైన యపాయములేదు. కాని దేవతలతోఁ బంతగించుట, తగరు కొండను దాకిన ట్లున్నదనక తప్పదు. మహారాజు శస్త్రాస్త్రబలసంపత్తి యంతయు దేవతామయము. దీపముచేత సూర్యునిఁగాల్చ నెవ్వరికి సాధ్యము? ప్రజావిప్లవరంగవిముఖులై సార్వభౌము లాస్థానమునకు వచ్చి యున్నారు. ఇంక మీరు లోని కరుగుఁడు. నేనును బోయి వచ్చెదను. [పరిక్రమించును.]

[దివోదాసు, డుంఠి, మంత్రి, విష్ణుమిత్రులతోఁ బ్రవేశించును.]

దివో: భట్టారకవర్యా! మీమాట లన్నియు సత్యములు. నే నిప్పు డస్త్రశస్త్రసంపద్విహీనుఁడను.

డుంఠి: విచారపడకుఁడు. ఇంకొక్క విషయముకూడ మీ మనస్సును గలఁత పెట్టకమానదు. అటు పిమ్మట సర్వభద్రము.

దివో: కానిండు. ఏదియైనను విచారములేదు. [నిట్టూర్చుచు] విష్ణుమిత్రవర్యా! పట్టణవిశేషము లేమి?

విష్ణు: ప్రభూ! ఏమిచెప్పను? పూమాలయని చేతఁబుచ్చుకొనఁ గాలాహియై కాలుగఱచినట్లు యోగినీప్రబోధము వారణాసికిఁబట్టిన దుర్యోగముగ నున్నది.

దివో: ఏమీ? అంతకటువుగ నున్నదా?

విష్ణు: ప్రభూ! బౌద్ధచార్వాకమతప్రబోధమదిరాపానమునఁ జొక్కి పరిమదలు చేయు విరుద్ధకార్యము లసంఖ్యాకములు. త్రేతాగ్నుల నార్పు సోమిదమ్మలు, గృహకృత్యములను వీడిన గేస్తురాండ్రు, ఇండ్లు వదలి తిరిగెడు హేలావతులు, పతులపైఁ బిల్లలఁ బడవేసి పరువిడు వనితామతల్లులు, పురుషదూషణలు, స్వేచ్ఛా సంభాషణములు రాజధానియం దంతటను గొల్లకొల్లలు. దీని నివారింప మా తరము కాదు. ప్రభువులే శరణ్యులు.

దివా : [తలపంకించుచు] రాష్ట్రమా విధము, రాజధాని యీవిధమునా? కానిమ్ము.

భటుడు : [ప్రవేశించి] జయము జయము మహారాజులుంగారికి.

దివా : ఏమిరా, అది?

భటుడు: నలుగురుస్త్రీలు సార్వభౌములుంగారి దర్శన మపేక్షించుచుంటి మని మనవిచేయుమనుచున్నారు, ప్రభూ!

దివా : [స్వ] వనితలు రాఁగోరుటయా? ఇది యపూర్వము. [తలపంకించుచుఁ బ్రకాశముగా] కానిమ్ము, ప్రవేశపెట్టుము.

భటుడు : చిత్తము [నిష్క్రమించును.]

దివా : వీరిరాకవలన 'యోగినీవ్యాపారవిశేషములు మఱికొన్ని తెలియనగును. [నిట్టూర్చుచు శిరఃకంపము చేయుచుండును.]

స్త్రీలు నలుగురు : [ప్రవేశించి]

జయము జయము మహారాజులుంగారికి.

[ నమస్కరింతురు. ]

దివా: [మంత్రివంకఁ జూచును].

మంత్రి: వనితామణులారా! ఇటు గూర్చుండుఁడు.

స్త్రీలు: చిత్తము. [అని యుపవిష్ట లగుదురు.]

దివా : సోదరీమణులారా! కంటికిఱెప్పలవలె నిరంతరము మిమ్మోము పతిపుత్రు లుండఁ దామింతవఱ కేల ప్రయాసపడి వచ్చితిరి?

శివశారద: సార్వభౌమా! మేమింకఁ బరాధీనతను వదలి స్వాతంత్ర్యమును బ్రకటించుటకును, మాస్వకార్యములనేగాక, నిఖిలరాజకార్యములనుగూడ నిర్వహించుటకును, మేమై తమసన్నిధికి వచ్చితిమి. అబలల మని మమ్మనాదరింపక, మా బలాబలవిచారణ చేసి, మాకుఁగల సర్వశక్తులను బరీక్షించి, సార్వభౌముల యాస్థానకార్యనిర్వాహకవర్గమున మాకుఁగూడఁ గొన్ని ముఖ్యస్థానములొసంగవలె నని ప్రభువరేణ్యుల మిక్కిలి ప్రార్థించుచున్నాము. [అందఱును లేచి, వినతిపత్రముల గ్రహించి] ఈవిజ్ఞాపనపత్రము

లను దివ్యచిత్తమునఁ జిత్తగించి మాయభీష్టముల నెఱవేర్పఁ గలందులకు మీఘనమును మిక్కిలి గొనియాడుచున్నాము. [అని నమస్కరించి పత్రము లీయఁబోవుదురు].

దివో : ఇవి మా మంత్రివర్యున కిచ్చి మీనామములను మీయభీష్టములను దెల్పుఁడు.

శివశారద: చిత్తము [అందఱు నమస్కరించి పత్రములు మంత్రి కిత్తురు]. ప్రభూ! నాపేరు శివశారద.

దివో : ఈపేరు స్త్రీపురుషసూచకముగ నున్న దేల?

శివశారద: కొంతపిత్ర్యముఁ, గొంత స్వార్జిత మగుటచేత.

దివో : అది యేమి?

శివశారద: నేను బుత్త్రుఁడనై పుట్టినప్పుడు మాతల్లిదండ్రులు పెట్టినపేరు శివశర్మ.

[అందఱు ఆశ్చర్యపడుదురు.]

దివో : తరువాత.

శివశారద : మహారాజా! స్త్రీవేషమున శారదానామమునఁ బుత్త్రార్థినై యోగినిగారి నర్థింప, నావేషనే నాస్వరూపమై, ప్రస్తుతము వచ్చిన పేరు శారద. వెరసి శివశారద.

దివో : [ఆశ్చర్యముతో] ఏమీ! మీరు యోగినీప్రభావముననా స్త్రీలగుట?

శివశారద : ఆతల్లియే యీరూప మనుగ్రహించి, వీక్షణమాత్రమున సర్వసిద్ధులు, సకలశక్తులు మాకందఱ కొసంగినది. ఇప్పుడు నేమెల్లరము నిఖిలశక్తిసంపూర్ణలము. కలిగినలాభము వ్యర్థమేల గావలయునని, లోగడ నే నాస్థానోద్యోగి నగుటచేఁ బ్రస్తుత మీశక్తిసామర్థ్యములతో మంత్రికార్యనిర్వహణము చేయఁగలనన్న ధైర్యముతోఁ దమ యనుగ్రహ మపేక్షించుచున్నాను.

దివో : ఏమీ? లోఁగడ మాకడ నుద్యోగమా? [అనిమంత్రినిజూచును.]

మంత్రి : ప్రభూ! మనధనాగారమున మూడ లిచ్చువాఁడే శివశర్మ. ఈతఁడిట్లగుట యుదయము తెలిసెను.

శివశారద : నే నాపదవికిఁ దగుదునో లేదో నన్నుఁబరీక్షించి ప్రభువులు నన్ననుగ్రహింపవలయును.

దివా : శివశర్మవు శివశారద నైతివి. ఇంక నా యోగినీప్రభావము, నీశక్తి సామర్థ్యములు, వేఱుగ విచారింపఁబనిలేదు. మీరుగూర్చుండుఁడు. [శారద కూర్చుండును.]

దివా : [గిరిజవంకఁజూచి] అమ్మా! మీపతినామధేయము, మీయభీష్టమును జెప్పుఁడు.

గిరిజ : ప్రభూ! వీరే నాభర్తగారు. నా పేరు గిరిజ. తమ యాస్థానవైద్యస్థాన మనుగ్రహింపవలయును. ఆయుర్వేదమున నేగాదు, నన్నన్ని విద్యలలోను బరీక్షింపవచ్చును.

దివా : ఇప్పుడుగూడ మీకీ శివశారదమ్మయే భర్త యగునా?

గిరిజ : అవును ప్రభూ! స్వల్పకాలములోనే యీ యమ కేవలము పురుషుఁడు కాఁగలఁడు. మాకు సంతానప్రాప్తియుఁగలుగును. ఇది యంతయు నా యోగినికరుణ. అందుచేత శివశారదమ్మగనే నా భర్త.

దివా : అటులనా. [శిరఃకంపముఁ జేయుచు] మంచిది. మీరుకూర్చుండుఁడు. [గౌరమ్మ లక్ష్మమ్మల వంకఁజూచి] మీభర్తల నామధేయములు, మీనామములు, మీకోరికలు దెల్పుఁడు.

గౌరిసో : మా స్త్రీస్వాతంత్ర్యమునఁ బతినామములతోఁ బనిలేదు. మగవారి పేరు లుచ్చరించి బ్రతుక నెంచుటకు మే మొప్పము. నేను సకల శస్త్రాస్త్రప్రవీణను, యుద్ధవిశారదను. వ్యూహములఁబన్ని సైన్యముల నడిపించుచు యుద్ధరంగమున వెనుదీయక శత్రుకోటి నోడింతును. కత్తి నాకొసంగి పేరుగల మీసైన్యాధిపతితోఁ బోరించి నా సామర్థ్యమును బరిశీలించి నాకు సేనాపతిత్వమునొసంగఁగలందులకు మిక్కిలి ప్రార్థించుచున్నాను.

దివో : అమ్మా! మీరింకఁ గూరుచుండుఁడు. [లక్ష్మివంకఁ జూచి] మీశక్తిసామర్థ్యములు చెప్పనక్కరలేదు. కోరికనుమాత్రము దెల్పుడు.

లక్ష్మి : నాపేరు లక్ష్మి. నాకుఁ దమ యాస్థానపండితపదవి నిప్పింపుఁడు. ఇదియే నా కోరిక [అని కూరుచుండును.]

దివో : ఇవియేనా మీ యభీష్టములు ?

శివశారద : ప్రభూ ! మాయోగినిగారు గాశీపట్టణమున కోటిమాడలతో స్త్రీస్వాతంత్ర్యవిద్యాశాలానిర్మాణము సేయుదురు. దానికిఁ దగినంతస్థలము తా మొసంగవలయును.

దివో : సోదరీమణులారా! మనరాజధానికి విచ్చేసి ప్రజలకెల్లర కారోగ్యభాగ్యము ననుగ్రహించిన శ్రీమతి విజ్ఞానకౌముదీయోగినీమణి శక్తిసామర్థ్యములు నేఁడు మీమూలమునఁ జక్కఁగ నెఱింగితిని. ఆమె మారాజధానికిఁ జేసిన మహోపకారమునకు మేమెంతయుఁ గృతజ్ఞులము. అందుల కామెను సన్మానించుట మావిధి. మా మంత్రులవలన వారియవకాశము నెఱింగి వారిని గౌరవింతుము. అప్పుడు మేము, మాపండితులు, వారియాశయముల నన్నిటి నెఱిఁగి, పిమ్మట మీరు కోరిన పదవుల విషయమున మా యభిప్రాయములఁ దెలియచేయుదుము. వారివిద్యాలయవిషయము గూడ వారితో ముచ్చటింపఁగలము. కాని ప్రస్తుతస్థితినిబట్టి మాహృదయావేగము నొకింత మీకు నివేదింతును. వేఱుగఁ దలంపవలదు.

అందఱు : ప్రభువుల యాజ్ఞకు బద్ధులము. తప్పక సెలవిండు.

దివో : కాంతలారా! ప్రస్తుతము మీకుఁగలిగిన పదవీవ్యామోహములు గాని, యందులకుఁ దగిన శక్తిసామర్థ్యములుగాని, మీస్వాతంత్రములుకానేరవు. అయినఁ గొంతపాటుపడినమీలౌకికవ్యాపారములలోఁ గొంతవఱకు సామర్థ్యము గణింపవచ్చును. కాని, యిట్టి సామాన్యదృష్టితో మీయౌన్నత్యమును మీరెఱుంగఁజాలకుంటిరేమో యని నాతలంపు.

గౌరిసో : అది యెట్లు?

దివా : తల్లులారా! మీ కన్నసంతానమేగాక, లోకసామాన్యమేగాక, యెంతటిపండితులు నెట్టిప్రభువులుగూడమిమ్మమ్మాయనినోరారఁ బిలుతురే! మీపవిత్రహస్తప్రదత్తప్రసాదమునకు మీపతిసుతులేగాక, భిక్షుకుఁడు మొదలు, దేవతలవఱకు, నిత్య మెదురుజూచుచుందురే! ప్రపంచమున, బీజప్రదానముమాత్రమే పురుషకృత్యముగాని,గర్భధారణము స్తన్యదాననేగాక,బాల్యముగడచువఱకు మాతృదేవతయే లేకున్న నే జంతువైన బ్రతుకనేర్చునా? ఆ తల్లుల రక్తమాంసశల్యభూయిష్ఠమై సంతతిరూపమున లోకమంతయు స్త్రీమయముగాక వేఱుండనేర్చునా? తాను బుత్రుఁడై యుదయించునపుడు సైతము,తన ధర్మపత్ని తనకు మాతృస్వరూపిణియై విరాజిల్లునే! అట్టిమాతృదేవత యగు స్త్రీ, లోకము నుద్ధరించుమంగళదేవత,గృహమున కలంకారము, గేహమునకు లక్ష్మి, వేశ్మపాలనమునకుఁ బ్రభ్వి,గృహస్వరూపిణి, సకలజగత్స్వరూపిణి; అట్టి యుత్తమస్త్రీగర్భముక్తాఫలములే గదా దేవతలు, ఋషులు, పండితులు,చక్రవర్తులు,సర్వమానవులు. అట్టి తమయంశస్వరూపులగు పురుషులు లోకకల్యాణకారణములగు జగత్పాలనాది సర్వకార్యములఁ బ్రవర్తిల్లుచుండ “సర్వత్ర జయ మన్విచ్ఛే త్పుత్రాదిచ్ఛే త్పరాజయమ్” అను నార్యోక్తి చొప్పున, వారిగౌరవోన్నతుల కానందించుచు, వారిచే సర్వదా సేవింపఁబడవలసిన మాతృదేవతలగు మీరు మీకన్నసంతతిని గొల్వఁ గోరుటయా? ఆహా! మీయుదరగేహముల వసించి, మీగర్భశయ్యలఁ బొరలి, మీ యన్నరసమునఁ బెఱిగి, మీ స్తన్యమున జీవించి, మీజోలలకుల్లసిల్లి, మీయనురాగాతిశయమున నడుగుఁబెట్టనేర్చిన పురుషనాముఁ డెవ్వఁడైన, మి మ్మతినీచ మగు నీసేవావృత్తికి నియోగింపనేర్చునా? మీకొలువు నంగీకరించునా? తల్లులారా! మీరు మీగృహదేవాలయవిరాణ్మూర్తులు. మీ బిడ్డ లుత్సవవిగ్రహములు. మీపిల్లలు స్వర్ణకిరీటాంగదతుల్యులు. మీరు వానిపై

నలరారఁదగిన మహామణిసదృశలు. అట్టికాంతారత్నములు స్థానభ్రష్టమైన, వానికి విలువలేదు. విరాణ్మూర్తులు బైటఁబడిన, వాని కింక దేవతాత్వ ముండనేరదు. దేశమున కున్నతిలేదు. సుఖములేదు. ఈవిషయము మీరుగూడ యోజించి, కార్య రంగమునకు దిగవలె నని మిమ్ము ప్రార్థించుచున్నాను. ఇంక మీరు వెళ్ళవచ్చును.

అందఱు : చిత్తము. [అని పోఁబోదురు.]

డుంఠి : సుందరులారా! ఒక్కమాట.

అందఱు : [వెనుకకుఁ జూతురు].

గౌరి : ఏమది?

డుంఠి : మీయోగినీమణి యిక్కడఁ దన్నెవ్వరు జయింపలేరని, యెవ్వఁడో పుట్టిరావలెనని కాదు చెప్పినది?

గౌరి : అవును. సందేహమేమి?

డుంఠి : అట్టివాఁడు లోఁగడనే పుట్టియుండెనని, నిన్ను జయించునని, యీ కాశీనగరమున డుంఠిభట్టారకుఁడు మీపెండ్లి చేయించిపంపునని నేను జెప్పితినని యీయోగినికిఁ జెప్పుఁడు.

శివశారద: ఏమీ? అంతసాహసమా? అయినఁ జూతము. [అని స్త్రీలందఱు శిరఃకంపముతో నిష్క్రమింతురు.]

దివో : భట్టారకవర్యా! ఏమి యిట్టి సందేశ మంపితిరి ?

డుంఠి : కాకున్న మీధర్మపరిపాలనము, వారణాసీప్రభావము, నిట్టి మర్మతవ్యాప్తికిఁ దావౌసంగునా ప్రభూ! నిజముగ నామెకుఁ బెండ్లిచేయించితేని తీరుదును. సందేహము లేదు.

దివో : అటులనా? మంచిది. పండితులవారు వచ్చిన, వర్తమానము దెల్పుఁడు.

విద్యాధరుఁడు:[ప్రవేశించి] గురూత్తమా! పుణ్యకీర్తిపండితులవారి ప్రధాన శిష్యులు వినయకీర్తిపండితులును, మఱికొందరు శిష్యులు నొక భద్రగజము, రెండు ఒంటెలు, నాలుగు హయరాజములు, మఱి

కొన్నిశకటములతో, గంగాతీరమునకు వచ్చుచున్నారు. పండితుల వారు రేపు తప్పక విచ్చేయుదురఁట.

దివో : విద్యాధరమహాశయా! మంచిమాటఁ జెప్పితివి. కూర్చుండుము. భట్టారకవర్యా! కర్తవ్యము?

భటుఁడు: [ప్రవేశించి] ప్రభూ! పుణ్యకీర్తిపండితులవారిశిష్యులఁట, యిద్దరు వచ్చియున్నారు.

దివో : భట్టారకవర్యా! మీరు వెళ్ళి వారిని దోడ్కొనిరండు.

డుంఠి : [శిష్యునితో నిష్క్రమించును].

దివో : పండితులవారి శిష్యులు ముందువచ్చుట యొకవిశేషము.

డుంఠి : [పండితశిష్యులతోఁ బ్రవేశించును].

దివో : [ఆసనమునుండి లేచి] పండితవర్యులకు దివోదాసనాముఁడు నమస్కరించుచున్నాఁడు.

[అందఱు పీఠములనుండి లేచి నమస్కరింతురు.]

వినయ, శిష్యు: అభీష్టావాప్తి రస్తు. [అని అక్షతలు చల్లి ఫలములు సమర్పింతురు.]

డుంఠి : మహాప్రభూ! వీరు పుణ్యకీర్తిపండితులవారి ప్రధానశిష్యులు, వినయకీర్తిపండితులు. అన్నిటను గురుసదృశులు.

దివో : పండితవర్యులు మాకు దర్శన మిప్పించుట మిక్కిలిసుకృతము. ఇందు దయచేయుఁడు. [ఆసనములు చూపును. ఉపవిష్టులగుదురు.]

వినయకీర్తి: సార్వభౌమా! మా గురుదేవులు తమరాజధానికి రేపుదయమున విచ్చేయఁగల మని శ్రీవారికి విన్నవింప మాకనుజ్ఞ నిడిరి. విశేషవిషయములు పత్రికాముఖమునఁ దెలియఁగలరు.]

దివో : [సంతసముతో] మాకు మిక్కిలిశ్రవణపర్వం బొనరించితిరి. మంత్రివర్యా! పండితులవారికి, వారిపరివారమునకు, నుచితవసతుల నేర్పఱచి, యేలోపములు లేకుండ నితరవిషయములన్ని యుఁజక్క చేయుము. వినయకీర్తిపండితులవారితో విచారించి మహాపండి

తులవారు ప్రప్రథమమున నిచటికి వచ్చునట్లు వారి యిష్టాను సారము సర్వసన్నాహములు చేయుఁడు. భట్టారకవర్యా! మీరును మంత్రివర్యులకుఁ దోడ్పడి యన్నివిషయములు విచారించి యొకమాఱు నాకడకుఁ దిరిగి రాఁగోరుచున్నాను.

అందఱు : చిత్తము. [నిష్క్రమింతురు]

[ తెర వ్రాలును ]



# దివోదాసనాటకము

## దశమాంకము

[రాజభవనప్రాంతమున విద్యాధరుఁడు ఢుంఠి ప్రవేశింతురు]

ఢుంఠి: విద్యాధరా! వినయకీర్తి మొదలగు శిష్యవర్యుల కన్ని వసతులు ననుకూలములే గదా!

విద్యా: మహారాజాదరమున శిష్యులెల్లరు రాజకుమారులై యుండ, నింకను వారి కానుకూల్య మడుగవలెనా గురూ!

ఢుంఠి: అట్లయిన మంచిదియే. మఱి నేటి కార్యక్రమము?

విద్యా: పండితరాజును మహారాజగౌరవముతోఁ బ్రభుభవనమునకుఁ గొనిపోవ మంత్రిముఖ్యులు, వినయకీర్తియు మార్గమున కెదురేగుచున్నారు.

ఢుంఠి: అట్లయిన నీవును బండితులవారి కెదురేగుము. నేను సార్వభౌముని సన్నిధి నుండెద.

విద్యా: చిత్తము. [ఇరువురు నిష్క్రమింతురు].

### దశమాంకము - రెండవ రంగము

[రాజదంపతులు ప్రవేశింతురు. దివోదాసు విచారముతో నుండును]

అనంగ: ఆర్యపుత్రా! యోగినీపరికల్పితమగు స్త్రీస్వాతంత్ర్యోద్యమ మసదృశము. రాష్ట్రవిప్లవముకూడ నామె వ్యూహాబీజావాపమునకు దున్నిన క్షేత్రమైనది. ఢుంఠిభట్టారక ప్రవేశము, ఆయన యసాధారణమేధావైభవము, సర్వజనవశీకరణము, మనయంతఃపురపరిచారికానిర్గమనముఁ జూడ మనకేదియో మహాపత్కాలము సన్నిహితమైనట్లున్నది?

దివో: [నిట్టూర్చుచు] అవును.

అనంగ: ప్రభూ! కర్మబలము, తపోబలము, యోగబలముఁ గలిసి, ముమ్మూర్తు లొక్కటై యున్నట్లు ప్రజ్వరిల్లు మీరిట్లు కుంఠీభూతాఖిలశక్తిసంపన్నులై కడుపునఁ గన్న యొక్కపిన్నవాని

వ్యాధి తెన్నుసైత మెన్నలేకుండిరన్న, నింతకంటెఁ గష్టతరమే మున్నది ? చతురాననాద్యులనుగూడ నలరింపఁజేసిన మీ సర్వసామర్థ్యముల నతిక్రమించిన దొక మహత్తరశక్తి మిమ్మాక్రమించుచున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. అదియే యీశ్వరశక్తి యని, యది యీరూపమున సన్నిహితమగుచున్న దేమోయని నాకు భయమగుచున్నది.

దివో : దేవీ! ఈశ్వరశక్తి యనునది వేఱుగ లేదు. కర్మఫలమే. అయ్యది నాశక్తి నాక్రమించిన నాక్రమించుఁగాక! ఈ రాజ్యభారమును వదలి మఱల సర్వశక్తిసంపూర్ణుఁడ నయ్యెదను. విచారమేల ?

అనంగ: ఆర్యపుత్రా! కల్పములను, యుగములను ద్రిప్పు కాలమహార్ణవమునఁ బదివేల సంవత్సరము లొకబిందువు మాత్ర మైనను గానేరదే! ప్రభూ! మఱల వనవాసము, శక్తిసంపాదనము, మఱల రాజ్యపరిపాలనమేనా మన జీవితపరమార్థము ? ఇంద్రాదులు సైతము క్షీణపుణ్యులై మర్త్యలోకమునకుఁ దిరిగి వచ్చుచుండుట మనము వినుచుండుట లేదా? స్వసంపాద్యకర్మఫలము లెప్పటి కప్పుడు ప్రక్షీణము లగుచుండఁ దిరిగి చర్వితచర్వణముగఁ గాలాధీనుల మగుట పరమపురుషార్థము కానేరదు. కర్మసిద్ధాంతము మీకుఁ బరమప్రమాణము. వ్యక్తిశక్తినిబట్టియు శ్రోతృసామర్థ్యము ననుసరించియు నుపదేశములలో వ్యత్యాస ముండును. అవస్థాభేదమునుబట్టి యధికారసంపత్తియు మాఱుచుండును. మఱల మీరొక్క పర్యాయము జిజ్ఞాసువులై ప్రజ్ఞాచక్షువును విప్పారఁజేయవలయును. ఇదియే నా ప్రార్థనము. ఎంతదూరమో పోనక్కఱలేదు. సర్వసమర్థులు, మన డుంఠి భట్టారకులే కలరు.

దివో : దేవీ! నీమాటఁ గాదననేరను. పుణ్యకీర్తిపండితుఁడు తనకంటెనుమహామహిమోపేతుఁడనిభట్టారకుఁడుచెప్పుచున్నాఁడు.

ఆతనిరాక కెదురుచూచుచున్నాను. అవసరమునుబట్టి కర్తవ్యమును యోజింతును.

మంత్రి: [ప్రవేశించి] ప్రభూ! పండితులవారు వచ్చినారు. వారు మిక్కిలి ప్రశాంతగంభీరులు. శ్రీవారి యెడల మిక్కిలి యాదరము. అందుచేతనే యిక్కడికి వచ్చుట కంగీకరించిరి. సింహద్వారము కడకు వచ్చినారు.

దివో: చాల సంతోషము. దేవీ! నీ వా కలశమును గొని తెమ్ము. భట్టారకు లేరి?

భట్టా: ఇదిగో, ఇక్కడనే.

దివో: దయచేయుఁడు [అని పుష్పమాల గ్రహించి] మంత్రిశేఖరా! ముందు నడువుము. [అని పండితు నెదుర్కొని పుష్పమాలాలంకృతుని జేసి తీసికొనివత్తురు. విష్ణుమిత్ర వినయకీర్తిముఖ్యులు కూడ వత్తురు.] పండితేంద్రా! దీని నలంకరింపఁజేయుఁడు. [అని యాసనము చూపును. పుణ్యకీర్తి యాసీనుఁడగును.]

పుణ్యకీర్తి: అభీష్టావాప్తి రస్తు. సార్వభౌమా! ఇటు గూర్చుండుఁడు. మీరెల్ల రాసీనులుగండు. [అందఱు గూర్చుందురు].

దివో: పుణ్యకీర్తిపండితేంద్రా! మా డుంఠిభట్టారకవర్యులవలనఁ దమ మహోన్నతు లన్నియు మాకు శ్రవణపర్వము లైనవి. మాసుకృతవిశేషమువలనఁ దమదర్శనభాగ్యము లభించినది. మాభవనము పవిత్రమైనది. నేఁడు కడుంగడుసుదినము. మేము మిక్కిలి ధన్యులము.

పుణ్యా: సార్వభౌమా! నీయశశ్చంద్రికలు దిగంతవ్యాప్తములు. నీధర్మపాలన మసమానము. మీవంటి పండితప్రభువుల దర్శించినపుడే మావిద్యలు సార్థకములు. మీవినయము ప్రాభవమున కమూల్యాలంకారముగ నున్నది. చిరంజీవి యువరాజకుమారుని యనారోగ్యస్థితిని మహామంత్రులవలన విని, దానివిషయ మప్పుడే యోజించితిని. అది మా కసాధ్యము కాదు.

దివో : తమవలన మాచిరంజీవి కారోగ్యభాగ్యము కలుగునన్న నిశ్చయమే మాప్రాణధారణ కాలంబనమైనది. నేఁ డాపుణ్యము కలిగినది. ఒక్కమాఱు మాపుత్రునిపైఁ దమయమృతవీక్షణములఁ బ్రసరింపఁజేయఁ బ్రార్థించుచున్నాను.

పుణ్య : కుమారమహారాజువిషయమై, మీ రేమియు భయపడనక్కఱలేదు. [శిష్యునివంకఁజూచి] వినయకీర్తీ! [గమ్మని సంజ్ఞ చేయును.]

[వినయకీర్తి పుణ్యకీర్తిని సమీపించును].

పుణ్య : [శిష్యుని చెవిలో నేదియో చెప్పుట నభినయించి] ఆవిధ మొనర్చి, కుమారమహారాజును నాకడకుఁ గొనిరమ్ము.

వినయ: చిత్తము. [అని రాజదంపతులతో లోని కరుగును].

పుణ్య : [ఉత్సాహముతో] భట్టారకవర్యా! ఇటురమ్ము. [అనియాదరమున దుంఠినిఁ బక్కనఁ గూర్చుండఁ బెట్టుకొని] ఎంతకాలమైనదోయి నిన్నుఁజూచి! [అనిసాదరముగ బుజముపైఁ జేయి వేయుచు] నీవివిధవిద్యావిశారదత్వము, నీశాస్త్రార్థచాతుర్యము, సమయస్ఫూర్తి, మహోజ్జ్వలమగు వాఙ్మాధుర్యము, ఒక్కటేమి? పుంరూపమున విలసిల్లు శారదవలె మాకు సంతసమును గలిగించితివి. ఆయానందమును నేను మఱవనేరను. [అని లాలించుచు] నాజ్ఞాపకార్థము బహూకరించిన కంకణముల నుంచితివా? ఏవి? [అని చేతులు చూచును.]

దుంఠి : పండితేంద్రా! హనుమంతునిముందుఁ గుప్పిగంతులా? యన్నట్లు తమదయచే వినయకీర్తిముఖ్యులతో వాక్యార్థమొనర్చి మిమ్ముఁ గదలించుటకు గుండెలేకపోయెఁ గదా! తమకుఁ బండితలోకమంతయు జోహారుచేయవలసియుండ నేనెంతవాఁడను? నేఁడు తమదర్శనము సాక్షాద్భగవద్దర్శనము. తమబహూకరణ ముంచుకొనవలసినదే కాని, బ్రహ్మచారికి రత్నకంకణధారణ మంతగ న్యాయము కాదని, నేను నొక మహాపండితున కలంకరించితిని. ఇక విషయ మెట్లున్నను దాము దయచేసినందులకు మాప్రభుకు

రులు బాధావిముక్తులైన మేమెల్లరము బ్రతికినట్లు. [అనుచుండఁ బుత్రునితో రాజదంపతులు వినయకీర్తియుఁ బ్రవేశింతురు.]

పుణ్యకీ : [బాలునిఁజూచి సంతసముతో] వత్సా! కుమారమహారాజా! ఇటురమ్ము.

బాలుఁడు : [పుణ్యకీర్తికి నమస్కరించును.]

పుణ్యకీర్తి : సుఖీభవ!

వినయ : [బాలునిఁ బుణ్యకీర్తి చేతి కిచ్చును.]

పుణ్యకీర్తి : [లాలించుచుఁ గనులు తుడిచి] బాబూ! నేనెలా వున్నానో యెవరినో చెప్పు.

సమరం : [నీరసముగ] మీరు మెఱుస్తూవుండే బంగారుబట్టలు ధరించి మణికిరీటము, భుజకీర్తులు, మకరకుండలాలు, మణిహారాలు, పూల మాలలు తాల్చి, చేతికలశంలోనించి నామీద పాలచుక్కల వంటివి చల్లారు. నేను నోరు తెరిచా. ఆచుక్కలు నాలుకమీద పడి తీయగాఉన్నై. మీరేమిటో నల్లనల్లగా, అందంగా, ఓ దేవుడులాగున్నారు. పేరు తెలియదు.

దివా : [కుమారునిఁ గవుఁగిలించికొని] పండితేంద్రా! చిరంజీవినోట నమృతవర్షము గురిపించి మాప్రాణములు దక్కించితిరి.

అనంగ : పుత్రభిక్షపెట్టి మావంశము నిలిపినారు. నిజముగా మీరు భగవత్స్వరూపులే. మీఋణముఁ దీర్పలేము. [అనినమస్కరించును]

పుణ్యకీ : బాలునకు మంత్రదేవత, ధన్వంతరి, సాక్షాత్కరించి యమృతము చల్లినాఁడు. ఇంక నీతఁడు నిరామయుఁడై చిరంజీవి కాఁగలఁడు. ఇంకేమియుఁ బలుకరింపక నిదురింపనిండు. నిద్రలేచినతోడనే పూర్వస్థితిగ నుండును. లోనికిఁ గొనిపొండు.

అనంగ : చిత్తము. [అని నమస్కరించి బాలుని లోనికిఁ గొనిపోవును]

మంత్రి : పండితేంద్రులు మహానుభావులు. మామహారాజుకుటుంబమును మమ్ము మాదేశమును రక్షించినారు.

విష్ణుమి : పుణ్యకీర్తిపండితులు సాక్షాద్ధన్వంతరిస్వరూపులు. నేమెల్లరము ధన్యులము.

దివో : ఈభాగ్యము కలిగించినది మాకు, మా డుంఠిభట్టారకులు. వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. [అని నమస్కరించును]

పుణ్యకీర్తి : భట్టారకా! యోగిని యిందే యున్నదిగదా!

డుంఠి : ఉండుట యూరకయుండుటయా? అందఱునొకయెత్తు, అగస్త్యుఁ డొకయెత్తనునట్లుగ నున్నది. బౌద్ధమతప్రచారము, స్త్రీస్వాతంత్ర్యోద్యమములవలనఁ గాశీపట్టణమును గగ్గోలుచేయుచున్నది.

పుణ్యకీర్తి:ఆమెశక్తినిఁ బరీక్షింప నిచ్చవొడముచున్నది. పోయివత్తమా?

దివో : స్వామీ! మీతో నేను గొంచె మేకాంతముగఁ బ్రసంగింపవలయును. పిమ్మట నందఱమును వెళ్లవచ్చును.

పుణ్య : భట్టారకా! మేము తరువాత వత్తుము. నీవును వినయకీర్తియు ముందుగఁజని యామె విద్యాపటిమను బరీక్షించుచుండుఁడు.

డుంఠి : చిత్తము. మీయండ యున్నచో నేను గొండలు సైతము పిండి చేయుదును. సెలవిండు, పోయివత్తుము.

[ పుణ్యకీర్తి దివోదాసులు దక్క నెల్లరును నిష్క్రమింతురు. ]

పుణ్యకీర్తి : సార్వభౌమా! ఉత్తమవస్తుసందర్శన మైనప్పుడు, పండితుల నోరూరకొనుట యుచితముకాదు. నీధైర్యస్థైర్యము లసమానములు. నీరాజ్యపాలనావిధాన మసదృశము.

మ. త్రిదశుల్ నీకు విరోధులైనను, మహాదేవాదృతిఁ బీడినన్
బదివేలేండ్లుగ రాజ్యపాలనవిధుల్ భ్రంశంబు గాకుండ నే
కొదువ ల్లేక ప్రజల్ సుఖంబుఁ గన నీక్షోణీభరం బూని యెం
త దృఢప్రజ్ఞ! యదెంత ధీరత! దివోదాసప్రభూత్తంసమా!

మ. అవనీకాంత సుఖోన్నతుల్ గనిన మా కానంద, మెంతేని నా
జవరా లీయెడఁ ద్వద్భుజాగ్రవిలసత్సౌధాంతరాప్తిఁ మహో
త్సవలీలల్ వెలయంగఁ గాంచి, తదె మాసంతుష్టి, యద్దాన సం
స్తవపాత్రుండవు మాకు నీ వొగి, దివోదాసాగ్రణీ! ధీమణీ!

దివో : [విచారముతో] పండితవర్యా! మీయీప్రశంసావాక్యములు కొంతవఱకు నాపూర్వస్థితి కనుకూలించునేమో కాని, ప్రస్తుత స్థితిలో నీపొగడిక కేనెంతమాత్రము తగను.

పుణ్యాకీ : మహారాజా! అట్లనెదవేల?

దివో : నాకు వనవాసము, నాధాత్రీసతికిఁ గడగండ్లు సిద్ధమైనవి.

పుణ్యా : ఏల యిట్లనియెదవు?

దివో : సర్వజ్ఞులు, మీరెఱుంగనిది లేదు. యథార్థమును మఱుగుపఱచి పండితానుగ్రహమువడయువాఁడెవ్వఁడును లేఁడు. మీకడసత్యము దాఁచనేరను. ధర్మము రాజ్యలక్ష్మీరక్షణమునకు వజ్రకవచము. అది ప్రీలినది.

పుణ్యా : ఎందుచేత?

దివో : రాజ్యసంపదలు ప్రజానురాగమూలములు. ప్రజలు ప్రభుత్వా కాంక్షచేఁ దెగలు తెగలుగఁ జేరి ప్రభువును దిరస్కరించుచున్నారు. ఇంక దేశమున రాజనువాఁడుండ వీలుండదు. నేనింక సింహాసనమును వదలవలయును. అందులకై విచారింపను.

పుణ్యా : మఱి?

దివో : సామాన్యప్రజ లల్పాశయులు. తదల్పావలంబనంబున వెలుంగు నాయకులు తాఱుమాఱగుట సహజము. వారందఱు రాజు నడంచుటయేగాదు. ఒక తెగవారి నొక తెగవా రడంపఁ బ్రయత్నించుట మిక్కిలి యుపద్రవకరము. అట్టిస్థితిలో రాజ్యకాంతాందోళిక, నాయకు లను బోయీలకు దుర్భరమై, విడువఁబడుచుండ నారాజ్యకాంత నిలువ నియతి లేక, మిగుల గాసిపడునని నాహృదయము మిక్కిలి గలఁత నొందుచున్నది.

పుణ్యా : మహారాజా! ఇంతియేనా? మఱియేమైన నుపద్రవకారణము లున్నవా?

దివో : ఆర్యా! కలదు. అది మఱియుఁ బులిమీఁదఁ బుట్ర.

పుణ్యాకీ: ఏమది?

దివో : స్త్రీస్వాతంత్ర్యము. దానిమూలమున నీవారణాసిలో నిప్పటి కప్పుడే ఆఁడ మగ, మగ ఆఁడ అయినది. ఇంకొక వారము దినములలో నాకై నేను రాజ్యము సైతము మర్పింపకున్నఁ, బడఁతులే నన్నింకేఁ బదభ్రష్టునిఁ జేయుదు రనుటకు సందియ ముండదు.

పుణ్యకీ: ప్రభూ! నే నొకించుక మిమ్ముఁ బ్రశ్నింపవచ్చునా?

దివో : అవశ్యము.

పుణ్య : మహారాజా! మీపరిపాలనమునఁ బ్రజాప్రభుత్వవిషయములు గాని, స్త్రీస్వాతంత్ర్యమునుగూర్చికాని యెంతకాలమునుండి మీరు వినుచున్నారు?

దివో : ఎంతకాల మెక్కడ? వారములు, దినములు.

పుణ్య : సర్వప్రజారంజకముగ మీప్రభుత్వ మన్యదుర్నిరీక్ష్యమైయుండ, నింతశీఘ్రకాలమున నిట్టివిపరీత మెట్లు కలుగఁగలదు?

దివో : ఇక్కడ యోగినివలెనే రాష్ట్రమున జనోద్వేగకారకు లుందురని, వారు దివ్యులని నాయభిప్రాయము.

పుణ్య : నీయూహ సత్యదూరము కానేరదు. కాని నీకును దేవతలకును, వైరకారణము, అగ్ని మొదలగువారు స్వశక్తి నుపసంహరించుకొనుటయే మొదలుగదా!

దివో : అవును.

పుణ్య : నీవు వేదమార్గప్రవర్తకుండవై హవ్యకవ్యాదులచే దేవతల నర్చించుచుండ వారుమాత్ర మేల నీపైఁ బగబూనుదురు?

దివో : కారణము దురూహముగ నున్నది.

పుణ్య: అట్లైన లోకపాలకులును ధర్మశీలురు నగు దేవతలు, నిరంతరము నీప్రభుత్వవిధానమునకు సంతసించు దేవతలు, నీపై నకారణవైర మెందులకుఁ బూనిరో బాగుగ విచారించుకొనుము.

దివో : ఎంత విచారించినను నావలన వేల్పుల కపరాధ మేమియు జరుగలేదు. ఈశ్వరనిరాకరణముమాత్రము జరిగినది.

పుణ్య : అటు లేలఁ జేయవలసివచ్చినది?

దివో : కర్మఫలములగు పుణ్యాపాపములే నిఖిలజీవసుఖదుఃఖనిర్వాహకము లగుచుండునని, యింక నీశ్వరునితోఁ బనిలేదని చెప్పు పూర్వమీమాంసకనిశ్చయమున నేనట్లు జేసితిని. ఇందేమిదోషము?

పుణ్యా : ఓహో! అటులైన నాపూర్వమీమాంసకులు వేదమునంతయుఁ బ్రమాణముగ నంగీకరింతురా?

దివో : అంతయు నంగీకరింతురు.

పుణ్యా : ఎవనితలంపువలననే నిఖిలజగంబులు సృజియింపఁబడునో, యెవని భయమువలనఁ బవనుఁడు వీఁచునో, సూర్యుఁడుదయించునో యను నర్థము కల యుపనిషత్తుల కభిప్రాయ మేమనవలయును?

దివో : కర్మానుష్ఠాతను స్తుతిచేయుట యనవలయును.

పుణ్యా : అయిన స్తుతి యెందులకు?

దివో : మహత్తరశ్రమమూలకములగు కర్మలయందు జీవునకుఁ బ్రరోచన మొనరించుటకు.

పుణ్యా: అటులైన నేకర్మలచేతఁగూడ వృద్ధిక్షయములు లేవని, పురుషుఁడసంగుఁడని, యాతనికి దేహేంద్రియాదిసంబంధము లేదని చెప్పుటకుండ నాజీవుని స్తుతించుటయే యందువా?

దివో : [నిట్టూర్చి, యోజన నభినయించును]

పుణ్యా : మహారాజా!

మ. పురుషుం డాతఁడసంగుఁ డెప్డుఁ, గరణంబుల్ కార్యముల్ లేవటం
చు రహిన్ దెల్పఁగఁ, గార్మికస్తుతిగ నాశ్రుత్యంతవాక్యంబు లే
కరణిన్ జెప్పఁగనొప్పుఁ? గర్మ లెటులన్ గావింపనౌ! ధర్మత
త్పరతన్ బ్రీల్చెదుఁగాక! యుక్తమె యిటుల్ పల్కంగ? రాజాగ్రణీ!

దివో : దేవా! సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసిన విశ్వామిత్రమహర్షి యసంగతకు భంగము వాటిల్లెనా?

పుణ్యా : తపోమూలకమగు మహత్వమునఁగదా యావిశ్వామిత్రసృష్టి?

దివో : అవును.

పుణ్యా: అవునా! ఏకర్మలచేతఁగూడ వృద్ధిక్షయములు లేవని చెప్పుచుండ, మహత్త్వన్యూనత్వము లెట్లతనికి సంభవించునో నిర్ణయించి చెప్పుము.

దివో: [నిట్టూర్చి] అవును. ఇవి పరస్పరవిరుద్ధములు.

పుణ్యా: అటులైన, సర్వజ్ఞకల్పములును సకలజగదుద్ధారకములు నగు నిఖిలవేదములకు నిదానభూతుఁడును, అలుప్తాపరతంత్రాఖిలశక్తిమంతుఁడు నగు పరమేశ్వరు డొకఁ డుపనిషత్ప్రతిపాద్యుఁడై సర్వసంసేవ్యుండై యుండునని మేము చెప్పవచ్చునా?

దివో: [తల పంకించుచు] చెప్పవచ్చును. కాని కర్మఫలములగు పుణ్యపాపము లనెడి యపూర్వములే సకలజీవసుఖదుఃఖనిర్వాహకము లగుచుండఁ బ్రత్యేకముగ నీశ్వరు నంగీకరించుట యనావశ్యక మనెడి పూర్వమీమాంసకసిద్ధాంతమును మీ రేమందురు?

పుణ్యా: ఏమందుము ? సకలశ్రుతిప్రసిద్ధుఁడును, సర్వశక్తిసమన్వితుఁడగు నీశ్వరుఁడుండ, నూహామాత్రకల్ప్యమును జడమునగు నీయపూర్వమునకు ఫలప్రదాతృత్వమును గల్పింపఁబూనుకొనుట, పెఱటి కల్పక ముండ, జిల్లేడుచెట్టు నాశ్రయించిన ట్లుండునందుము. ఊహాకల్ప్యమైన యీయపూర్వము నంగీకరింతమన్నను జడమైన యపూర్వము ఫలమొసంగుట వృషభాదిసంబంధము లేక యచేతనమగు శకటాదులు స్వతంత్రముగ నడువసాగినట్లుండునందుము. కాన నీయపూర్వ మప్రామాణికము, అసంగతము.

దివో: అయినఁ జేసినవెంటనే నశించు కర్మలవలనఁ గాలాంతరభావికర్మఫల మెట్లు సమకూరును?

పుణ్యా: సేవకుని సేవానురూపమగు ఫలము, సేవ్యుఁడగుప్రభు వాతని కొసంగునట్లు, నిఖిలజగన్నాయకుఁడును, సర్వాంతర్యామియు నగు నాపరాత్పరుఁడే నీచేయు సుకృతదుష్కృతముల ననుసరించు ఫలప్రదాత యగును. కాన నపూర్వమును నమ్మి యీశ్వరుని నిరాకరింపఁబూనుట మిక్కిలిసాహసము, మూర్ఖత్వము.

దివో : అయినఁ బుణ్యాపుణ్యములు లేవా?

పుణ్యా : లేకపోవుట యేల? వేదవిహితప్రతిషిద్ధకర్మలే పుణ్యాపుణ్యములు కావచ్చును.

దివో : ఐనఁ గర్మజన్యమైన యపూర్వమునే మీరంగీకరింపరా?

పుణ్యా : సకలహృదయాంతర్యామియు యజ్ఞదానతపోయోగాదినిఖిల సాధనపరమార్థఫలస్వరూపియు నగు పరమాత్మ కవిరుద్ధమగు నీ యపూర్వమే కాదు, సకలశాస్త్రప్రమేయములును అభ్యుపేత్యవాదముగ మా కంగీకార్యములే యగును.

దివో : పండితేంద్రా! ఇంక నీశ్వరునిఁ దలంపక కావించు సత్కర్మాచరణమునకుఁ బ్రయోజన ముండదా?

పుణ్యా : ఏల లేకపోవును? కామ్యకర్మలెల్ల నిహపరలోకసుఖసాధనమాత్రములై దురంతములగు నిరంతరజననమరణదుఃఖములకుఁ గారణము లగుచుండును.

దివో : [సిగ్గుజెందై] దేవా! నిజముగఁ దాము సెలవిచ్చినట్లు నా సత్కర్మఫలములు, నా యోగశక్తిభాండాగారములు, నాతపోధనరాసులు సర్వమును బ్రక్షీణము లైనవి. ఎయ్యవి సంపాద్యఫలములో, యయ్యవి నశించునన్న వేదవాక్య మిప్పుడు నా యనుభవమునకు వచ్చినది. సర్వము కర్మమూలక మన్న పూర్వమీమాంసకోక్తి మానవు నుద్ధరింపఁజాల దన్నమాటయే నాకు సిద్ధాంతముగఁ దోఁచుచున్నది. ఇంత యేల?

మ. చిరకాలంబుగ ధారుణీరమణి నాచేతన్ విరాజిల్లె, నే
కొఱంత లేక సుఖంచి రెల్లరును, గర్వోలయ్యె నాసర్వమున్,
బరమోత్కృష్ట మఁటన్న ధర్మ మదె మత్పాపాకరం బౌచు దు
ర్నరకంబందునఁ ద్రోయు, దానినెటు లోర్వన్‌వచ్చు విద్వన్మణీ!

పుణ్యా: మహారాజా! ఏల యిట్లు బేలవయ్యెదవు. ధీరుఁడవు. కర్తవ్యము నిర్ణయించుకొనుము.

దివో : పండితేంద్రా! ఎంతధైర్య మవలంబించియుందమన్నను నాచిత్తమున కూఱట కల్గుట లేదు. ఈభూపరిపాలనము నన్ను మిక్కిలి

సంకటపెట్టుచున్నది. "రాజ్యాంతే నరకంవ్రజే" త్తనెడియార్యోక్తి కూడ నీయభాగ్యునియెడల సార్థకమగునట్లు తోఁచుచున్నది. మీరు సర్వజ్ఞులు. సకలకార్యధురీణులు. నాయీప్రార్థనము దయతో నంగీకరింపవలయును.

పుణ్యా : ఏమది?

దివో :

శా. దాచంబెట్టినముల్లె గాఁదగిన నాధర్మంబధర్మంబుగా,
నీచోక్తుల్ వినిపింపఁగా జనతతుల్, నీరేజపత్రేక్షణల్
సాచివ్యాదులొనర్పరాఁగ, నేటు లే సాగింతు రాజ్యం బికన్?
నీచేఁ బెట్టి, వనిన్ వసింతు, వసుధ న్నీ వేలు, విద్వన్మణీ!

పుణ్యా : మహారాజా! ఏల త్వరపడియెదవు. ఇంతలో నింత తాలుమా జేల? ఈశ్వరానుగ్రహమున సర్వమును సమీకృతము కాఁగలదు.

దివో : పండితోత్తమా! పాపాత్మున కీశ్వరానుగ్రహమా? అయ్యది నాకు గగనకుసుమాలంకరణము. అజ్ఞానమున నేఁజేసిన యీశ్వరాపరాధము నన్ననేకవిధముల బాధించుచున్నది. నాహృదయమును మిక్కిలి దహించుచున్నది. నేనింక సింహాసనాధిష్ఠితుఁడను గానేరను. తామీరాజ్యభారమును వహింపుఁడు. వనవాసమునకు నాకాజ్ఞ నిండు [అని నమస్కరించును].

పుణ్యా: రాజేంద్రా! నీవి ట్లాలోచింపకుము. పరమేశ్వరుఁ డెట్టివారికి నెన్నఁటికి దుర్లభుఁడు కాజాలఁడు. ఆతఁడు శరణాగతవత్సలుఁడు. కరుణాసముద్రుఁడు. సర్వాంతర్యామి. ఆ విశ్వనాథుఁడే యనుగ్రహించును. నీవే రాజ్య మేలఁగలవు.

దివో : పండితరాజా! ఏల యీ యడియాస? ఇంక నాయీశ్వరుఁ డనుగ్రహించుటయును, నేను రాజ్య మేలుటయునా? ఇదియంతయు నసంభవము. ఇంక నే నా రాజ్యపీఠము దరికైనను జననేరను. దేవతాపచారిని, ఈశ్వరాపరాధిని, నాకీ ప్రకృతియంతయువిరుద్ధము.

శా. కాశిం బాయఁగఁ జేసినట్టి ఖలు నా గౌరీవిభుం డొప్పునే?
క్లేశం బందిన యన్నపూర్ణ కృప వీక్షింపఁగఁ దానెంచునే?
యీశూరుల్ ప్రమథాగ్రగణ్యులు ననున్ హర్షింతురే? దివ్యులా
క్రోశంబుల్ విరమింతురే? మఱల నే క్షోణీభరం బూనఁగన్.

పుణ్య: రాజేంద్రా! నీ వెంతటి దేవేశ్వరాపరాధివైనను, నీ పశ్చాత్తాప పరాకాష్ఠయే నిన్ను విశుద్ధు నొనరించినది. సర్వదేవదేవుం డగు నాసర్వేశ్వరుఁడు నిన్నుఁ దప్పక యనుగ్రహించును.

చ. శివు నెడఁ జేయు దోసమును జెందఁగనీక యొకింతయేని; నా
భవుఁడు భవానియున్ మిగుల భావ మెలర్పఁగ నిన్నుఁ గన్గొనన్,
దివిజులు తోడునీడలయి దిమ్మరునట్లుగ, లోకు లెల్లరున్
స్తవము లొనర్ప, శ్రేయమును సంధిలఁ జేసెద నమ్ము, రాణ్మణీ!

దివో: [ఆశ్చర్యముతో] పండితేంద్రా! నీయనుగ్రహ మెంతకైనను జాలును. నీవు సాక్షాద్విశ్వనాథప్రభుఁడవో, లేక యంతటివాఁడవో కావలయును. కాకున్న నిట్లన నేరరు. నాయపరాధముల మన్నించి, మీనిజస్వరూపమును జూపి, నన్ను ధన్యునిఁ జేయుఁడు. ఇదియే నాప్రార్థనము. [అని పాదములు పట్టికొనును]

పుణ్య: [లేవఁ దీసి] రాజేంద్రా! నన్నుఁ జూడ నేర్తువా?

దివో: మీయనుగ్రహమున నేనేమి చేయనేరను? దేవా! నన్ననుగ్రహింపుము. మీదివ్యరూపసందర్శనము చేయింపుము.

పుణ్య: మంచిది. దివోదాసా! ఇటురమ్ము. [కన్నులు తుడిచి] విష్ణుదేవుని ధ్యానించుచు క్షణమాత్ర మట్లేయుండుము. [అని నిష్క్రమించును].

దివో: [క్షణమాఁగి సంభ్రమాశ్చర్యములతోఁ బరికించుచు] ఆహా! నీలనీరదశ్యామలమై శంఖచక్రగదాపద్మవిలసిత చతుర్భుజవిరాజితమై, తటిత్కనత్కమనీయకనకచేలాలంకృతమై, మణిమయ కంకణహారకేయూరకుండల కిరీటాద్యనేక దివ్యభూషణభూషితమై, నానావిధపరిమళమిళితచందనచర్చితమై, కౌస్తుభాలంకృతమై, వన

మాలావిభాస్వరమై యతులితానందసంధాయకంబై యీదివ్యమూర్తి యెంతయుఁ గన్నుల మిఱుమిట్లు గొల్పుచున్నదే! ఔరా! ఏమియీయద్భుతము! అనంతకోటిసూర్యచంద్రప్రభాభాసురమై, దుర్నిరీక్ష్యమై, యీ యనుపమ తేజోరాశి, దిగ్దిగంతముల నాక్రమించి, గ్రహమండలముల నతిక్రమించి, ధ్రువమండలము సైతమావరించి, యాకసమంతయుఁ గబళించుచున్నదే! ఆహా! ఇమ్మహత్తరరూపమున నెన్నివింతలు! ఎన్నివిలాసములు! అబ్బ! ఎంత యద్భుతము! త్రిలోకములు, త్రిమూర్తులు, త్రిశక్తులు, నెల్లరు సపరివారముగ నొక్కెడనే గన్పట్టుచున్నారు. ఆప్రక్క గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, యక్షులు, నిఖిల దేవగణములు. ఈప్రక్క భూతప్రేతపిశాచరాక్షసులు, శాకినులు డాకినులు. అచ్చట మునులు, యోగులు. భక్తులు. ఇదిగో ఇచ్చట నదీనదములు, ఉరగములు, నగరములు, పురములు, దేశములు, పండితేంద్రుఁడుపుణ్యకీర్తిమహాశయుఁడు, నాప్రజలు, నాలోకము, సర్వము నిందే విరాజిల్లుచుంటిమి. సర్వజగదాకీర్ణంబగు నీజగన్మంగళవిగ్రహము నెవ్వరు తేఱిచూడఁగలరు? ఎవ్వరు వర్ణింపఁగలరు!

మ. శశిసూర్యాగ్నిపరంపరల్ ఋషిసహస్రంబుల్ మనువ్రాత మింద్రశతంబుల్ వసుకోటులుఁ హరిహరబ్రహ్మాధినాథుల్ చతుర్దశలోకంబు లనంతసంతతులుగా దైవార నీలోన, నావశమే చూడఁగ నీదుతేజ? మిఁక దేవా! ప్రోవు శ్రీవల్లభా! దేవా! విష్ణుదేవా!

మ. అవనీదేవుఁడు పుణ్యకీర్తి యటు నీయం దీ దివోదాసుఁడున్, భువనవ్రాతములున్ గనంబడుచుఁ బోవున్ జూచుచుండంగ నల్లె, వినూత్నాద్భుతముల్ సెలంగుఁజను, నేనెవ్వాఁడ, నెందుంటినో వివరింపన్ వచియింప లేను, గరుణన్ వీక్షింపు, విశ్వాత్మకా! జగత్ప్రభూ! ఇంక నీదివ్యరూపమును జూడఁజాలను, నిలువనేరను, నన్ననుగ్రహింపుము. నన్నురక్షింపుము. [అని చేతులుజోడించును]

పుణ్యా : [విష్ణురూపమునఁ బ్రవేశించి] దివోదాసా ! స్వస్థచిత్తుఁడవు కాఁగలవు. [అని వెన్నుదట్టును]

దివో : [కనులు దెఱచి భయసంభ్రమానందములతో] ఆహా! సాక్షాద్విష్ణుస్వరూపము. నేను ధన్యుఁడను. భగవానుఁడా! మీప్రభావ మమేయము. పుణ్యకీర్తినాముఁడవై యిచ్చటి కరుదెంచి నాయజ్ఞత నడంచి నన్ననుగ్రహించిన నీ దయామయత కెంతయుఁ గృతజ్ఞుఁడను. ప్రభూ! మహత్తరమగు మీదివ్యరూపమున మానవుఁడనైన నాచేనిర్మితములగు సూర్యచంద్రాదికల్పనలణుమాత్రమును గాజాలవు. మనుష్యతుల్యుఁడే యీశ్వరుఁడని భావించిననాయజ్ఞానము సమూలోన్మూలితమై "సర్వం విష్ణుమయం జగ" త్తను వాక్యము మీయెడ నిగూఢమైనదికాని, యీశ్వరాపరాధమున సర్వసుకృతములను గోల్పోయిన యీయభాగ్యునియందుఁ దమ యవ్యాజకరుణాప్రసార మెట్లుగలిగెనో తెలియనేరను.

విష్ణు : [చిఱునవ్వుతో] దివోదాసా! ఇదియే తెలియఁదగిన ధర్మసూక్ష్మము. నీ వీశ్వరునిఁ బరిగణింపకున్నను స్వార్థరహితమగు నీధర్మపాలనము, నీయోగనిష్ఠ, తపోబలము, సర్వస్వము ప్రజారక్షణకై వినియోగించితివి. ఆ ప్రజలు, దేశము, కాలము, సర్వము నేనే. అదియంతయు నీ పశ్చాత్తాపపూర్వకమగు భగవచ్ఛరణాగతివశమున నాకే చెందినది. దాన నేనెంతయు సంతుష్టి నందితిని. కాన నీసంశయమును విడనాడి యభీష్టమెద్దియైనఁ గోరికొనుము.

దివో : జగత్ప్రభూ! మీయనుగ్రహమున మీసమిష్టిదివ్యరూపమును జూచితిని. కృతార్థుఁడ నైతిని. ఈ త్రైలోక్యమందుఁగూడ నాకింకఁ గోరఁదగినది లేదు. నిఖిలవేదసమధిగమ్యములగు నీ విశ్వవిలాసము లన్నియుఁ గల్పాంతమాత్రపర్యవసానములు. కాన నో మహానుభావా! సర్వవేదాంతసంవేద్యమై, విశ్వాతీతమై, సచ్చిదానందాత్మకమగు మీవిష్ణుస్వరూపమును నా కనుగ్రహింపుము. ఇదియే నాపరమాభీష్టసర్వస్వము.

విష్ణు : [సంతసముతో]వత్సా! ఇట్టి నీ యీ శుభేచ్ఛచే, నీవు నీ ప్రజలు గూడ ధన్యులు. నీయభీష్టము నావలననే సమకూరవచ్చును. శివకేశవుల మగు మా కఖండపరమార్థతత్త్వస్వరూప మొక్కటియే యైనను, సాధకలోకానుగ్రాహకములుగ గోచరించు నీ మాయామయరూపములు మాత్రము భిన్నములు. అందుచేత నీవారణాసీక్షేత్రమున దత్త్వోపదేశ మొనరింప క్షేత్రపతి శ్రీవిశ్వనాథుఁడే యర్హుఁడు.

[తెరలో]

జయము జయము లక్ష్మీవల్లభునకు.

[అనుచుఁ జతుర్ముఖేంద్రగణపతి, కుమార, వీరభద్ర, భైరవ, వైనతేయముఖ్యులు, గౌరీసోమిదేవమ్మ మొదలగు పౌరవనితలతో లక్ష్మీదేవినిఁగూడి ప్రవేశింతురు. దివోదాసు అందఱను జూచి నిశ్చేష్టుఁడగును.]

అందఱు: చతుర్దశభువనాధినాథునకు జై. [అని విష్ణువునకు నమస్కరింతురు.]

గణ : ప్రభూ! పుణ్యకీర్తిస్వరూపులైన తమచే సర్వవిధముల నోడింపఁబడి మీచేఁ బాణిగ్రహణము కావింపఁబడిన యోగినీరూప,మీవిజయలక్ష్మి, విష్ణుస్వరూపులుగ నున్న తమకడకు, లక్ష్మీస్వరూపమున విచ్చేసినది. ఇంక నామె ననుగ్రహింపుఁడు.

లక్ష్మి: హృదయేశ్వరునకు నమస్కారము.

విష్ణు : [ఆదరముతో లక్ష్మిని దగ్గరకుఁ దీసికొని] దేవీ! విఘ్నరాజా! ప్రమథనాయకులారా! బ్రహ్మేంద్రాదులారా! సమయమునకు వచ్చితిరి. మిక్కిలిసంతోషము.

దివో : [సంతసముతో] ఎల్లరకు నీదివోదాసు నమస్కరించుచున్నాఁడు.

అందఱు : [అభీష్టావాప్తి రస్తు]

దివో : మీరెల్లరు నిటు దయచేయుఁడు. [అని యాసనములఁ జూపును]

అందఱు: [ఉపవిష్టు లగుదురు]

దివో : [తెఱవంకఁ దిరిగి] చేటీ !

చేటి : ప్రభూ! [అని ప్రవేశించును]

దివో : సకలదేవతలు మనభవనమునకు విచ్చేసిరని, నా దేవినిఁబూజాపరి కరములతో, సమరంజయకుమారునితో, శీఘ్రముగ రమ్మంటినని చెప్పుము. మంత్రివర్యునితోఁ బండితుల నెల్లవారిని సత్కారముగఁ బిలిపింపుమని, సర్వోపకరణములతో రమ్మంటినని నాయాజ్ఞగాఁ దెలియఁ జేయుము.

చేటి : చిత్తము. [నిష్క్రమించును]

దివో : ప్రభూ! ఇదియేమినాటకము?ఏమిసన్నివేశము?ఎంత యద్భుతము! విష్ణుదేవా! మీరినందఱ నీవిధముగ రప్పించి నాభవనమును నాపుర మును బవిత్రమొనరించితిరి. నన్ను, నా వంశమును ధన్యము గావించితిరి.

అనంగ, మంత్రిముఖ్యులు: [పూజాపరికరములతోఁ గుమారునితో బ్రవే శింతురు. అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుందురు.]

దివో : దేవీ! కుమారా! మంత్రిముఖ్యులారా! మనయదృష్టము ఫలించి నది. చూడుఁడు! కనుల కఱవుదీఱఁ జూడుఁడు.

అందఱు : [నమస్కరించి యానందముతో నుందురు]

దివో : ప్రభూ! మీరినెల్లర వేఱువేఱుగ నెఱుంగఁగోరుచున్నాను.

విష్ణు : [నవ్వుచు] కుమారా ! తొల్లిపుణ్యబలంబున నుత్కృష్టతఁగాంచి జగత్కంటకులై ప్రవర్తించిన త్రిపురాసురుల నడంచుటకు బౌద్ధ ధర్మప్రచారకుఁడనైన నావలెనే, నేఁడు వైదికములగు పరమార్థ సాధనధర్మముల నెల్ల నవలంబించియుఁ దత్సాధ్యమగు పరమార్థ ధర్మస్వరూపుఁడైన యీశ్వరుని నిరాకరించుటచే,నీకును నీప్రజల కును వాటిల్లు మహానర్థమును దొలఁగించుటకే తెంచిన నాయర్థాం గియే యీ యోగిని. విశ్వరూపసందర్శనసమయమునఁ బౌరజన విశ్వాసముకొఱకు యోగినీవిజయాభినయముఁ గావించితిని. రాష్ట్రవిప్లవకారకులుగాఁ దోఁచిన ప్రజానాయకు లీ కుమా రేంద్ర వీరభద్రకాలభైరవాదులు. నీ యాస్థానవిద్వాంసుఁడు

డుంఠిభట్టారకుఁడే విఘ్నపతి. వినయకీర్తియే గరుత్మంతుఁడు. ఇక్కడ యజ్ఞకార్యనిర్వాహకుఁడై యున్న సోమయాజియే చతుర్ముఖుఁడు. నీయింటి దాసీగణమే యోగినీగణము.

దివో: [పశ్చాత్తాపముతో] ఇందిరాదేవీ! బ్రహ్మేంద్రాదులారా! అహంకారమున దేవదేవునిగాదని మీకెల్లరకు మిక్కిలి గష్టమును గల్పించితిని. అట్టి నాయపరాధమును మన్నింపవలయును.

మ. శ్రమఁ జేకూర్చితి మీకునెల్లరకు, మీశౌర్యోద్ధతుల్ సూప, రా ష్ట్రము, నే నెంత? చరాచరాత్మకముగా బ్రహ్మాండ మల్లాడ దే? శమముల్ బాయరు, మత్ప్రజల్ గెడప, రీ చందాన నన్నోచి రెం తమహాపుణ్యమొ! దాసుతప్పున కిదే దండంబు, నన్ గావరే!

[భార్యా పుత్రులతో నెల్లరికి నమస్కరించి పూలమాలలు, పుష్పాంజలులు సమర్పించును.

మంత్రిముఖ్యులు: [పుష్పాక్షతలు చల్లి] లక్ష్మీనారాయణులకు జై. బ్రహ్మేంద్రాదులకు జై.

బ్రహ్మ: పరమేశ్వరానుగ్రహప్రాప్తి రస్తు.

ఎల్లరు: తథాస్తు.

దివో: [వినయముతో] లక్ష్మీవల్లభా! మీయనుగ్రహమున సర్వదేవతానుగ్రహము కలిగినది. ఇంకఁ గాశీపురాధీశ్వరుని కరుణనడయు టెట్లనునదియే నామనస్సును గలంచుచున్నది.

విష్ణు: వత్సా! విచారపడకుము. భక్తిచే భజింపకున్నఁ బరమేశ్వరుఁడు దూరస్థుఁడు. భక్తిగలిగి సేవించిన నాపరమేశ్వరుఁడే సమీపస్థుఁడు, ఆత్మభూతుఁడు. కాన, భక్తిభావమునఁ బ్రార్థించుటయే యీశ్వరాగమనమునకు ముఖ్యసాధనము.

దివో: చిత్తము. దేవదేవా! కాశీనాథా! నాయపరాధములు క్షమింపవలయును. నన్ననుగ్రహింపవలయును.

శా. కైలాసంబునకన్న మిన్నయగు మీ కాశీపురావాసముల్
దూరల్ జేసితిఁ గాసినెట్టితి మహాద్రోహంబుఁ గావించితిన్

నాలోపంబుల నన్నిఁటిఁ మఱచి నన్పాలింప, వేవేగ రా
వే! లా వేదెఁ గడుం గలంగె మది, తండ్రీ! విశ్వనాథప్రభూ!

[ధ్యానించి] అన్నపూర్ణాసహితుఁడవై సపరివారముగ దయ
చేయుము. న న్ననుగ్రహింపుము.

[తెరలో ఘంటానాదములు,శంఖధ్వనులు,జయజయధ్వానములు
వినఁబడును]

ఎల్లరు : కాశీనాథునకుజై. విశ్వనాథప్రభునకుజై. అన్నపూర్ణాదేవికి జై.
[త్రిశూలధారి యగు భృంగితో నన్నపూర్ణాసహితుఁడై విశ్వే
శ్వరుఁడు ప్రవేశించును]

దివో : [సంభ్రమముతో భార్యాపుత్రులతో నెదురేగి ప్రణమిల్లి పుష్ప
మాలాలంకృతులఁ జేసి] పురాణదంపతులారా! దయచేయుఁడు.
[అని యాసనముల నలంకరింపఁ జేయును. అందఱు నమస్క
రింతురు.]

విశ్వే : అభీష్టావాప్తి రస్తు. లక్ష్మీనారాయణులారా! గణపతిముఖ్యు
లారా! మీరెల్లరు గూర్చుండుఁడు. [అందరు ఉపవిష్టు
లగుదురు.

దివో : తండ్రీ! విశ్వనాథప్రభూ! తల్లీ! అన్నపూర్ణాదేవీ!

ఉ. మోక్ష మొసంగుదాత, భువిఁ బ్రోచుచునుండెడు వేల్పుగిడ్డి, ఫా
లాక్షుఁడు విశ్వనాథుఁ డని యాత్మఁదలంపక, కొంచెముగ విశా
లాక్షి మహత్వ మెన్న, కటు లాసురవృత్తిఁ గలంచితిగ, కృపా
దీక్షితు లీరు, నాదు పరిదేవన మెన్నరె! నన్నుఁ గావరే!

ప్రభూ! సర్వాపరాధములు క్షమించి, యీ సంసారమునుండి
న న్నుద్ధరింపవలయును. మీరే శరణ్యులు.

విష్ణు : విశ్వనాథప్రభూ! ఈదివోదాసు నీదాసుఁడు. పరమార్థతత్త్వము
నాకాంక్షించు చున్నవాఁడు. దయతో ననుగ్రహింపుఁడు.

విశ్వ : విష్ణుదేవా! నీ వీ మంగళదేవతంగూడి గణపతిముఖ్యులతో మనల
నొప్పని యీ దివోదాసు నింతవఱకుఁ దెచ్చితివి. జటాధారినై

యిచట నిరంతరము సందుగొందులఁ దిరుగుచుఁ బ్రాణోత్క్రమణసమయమం దెల్లజీవులకు నీ తారకమంత్రమునే గదా, బోధించి, ముక్తిప్రదాతృగౌరవమును నే నార్జించుకొనుట. ఇందు నీ కసాధ్య మేమున్నది? ఐన, నిచ్చటి నానిత్యవిధిని నాచే నెఱవేర్చ, నీపని నాకు మిగిల్చియుందువు. కానిమ్ము! ఇఁక నీ యిష్టానుసారమే ప్రవర్తించెదను.

విష్ణు : చిత్తము.

విశ్వ : దివోదాసా ! వైదికకర్మమార్గనిష్ణాతుఁడవు. వేదాంతైకసమధిగమ్య మగు బ్రహ్మానందపదము నభిలషించుచుంటివా?

దివో : ప్రభూ ! ఇదియే యీదివోదాసు పరమాభీష్టసర్వస్వము. దయతో ననుగ్రహింపుఁడు. [అని ప్రణమిల్లి సమాహితచిత్తుఁడై నిలుచును].

విశ్వ : [దివోదాసు దక్షిణకర్ణమున నుపదేశించుట నభినయించును.]

దివో : [కనులుమూసి] ధన్యోస్మి, ధన్యోస్మి. [కనులు దెఱచియానందముతో] ప్రభూ! తమ యనుగ్రహవిశేషమున నాకుఁగల యవివేక మడుగంటి చిదచిదాత్మకమగు లోకస్థితి నెఱుంగఁగలిగితిని.

విశ్వ : అది యెట్లు?

దివో : ఇదివఱకుఁ జూడఁబడు వస్తుసంతతి యంతయు దృశ్యమని, దానిని జూచు నేత్రము దృక్కని నానిశ్చయము. ఇప్పు డట్టులుగాక, నాకుఁ గనఁబడు ప్రపంచము, విష్ణుదేవుని విశ్వరూపమునఁ గనఁబడిన నిఖిలజగజ్జాలమువలె, వీనినిఁ జూచు నేత్రముసైతము మనస్సుచేఁ దెలియఁబడుటచే నిదియు దృశ్యమే. ఆమనోవృత్తులుకూడ గోచరించుటచే నవియును దృశ్యములే. వీనిని భాసింపఁజేయు తెలివియే దృక్కని, తత్ప్రకాశక మొండు లేకుండుటచే నదియే స్వప్రకాశ మగు చిదాత్మ యని, యదియే నేనని, నాచేఁ జూడఁబడు మనస్సు మొదలగు దృశ్యజాతమంతయు నాకంటె భిన్నమనియు నిశ్చయము గలిగినది.

విశ్వ : [సంతసముతో]కుమారా! నీనిశ్చయము మిగుల ప్రశంసనీయము. ఇపు డే యసంగచిన్మాత్రము నీకు నిజాత్మగా నిశ్చితమయ్యెనో, యయ్యదియే,పంచకోశముల కతీతమై,యవస్థాత్రయవిలక్షణమై, స్వయంప్రకాశమై, నిత్యమై,యవిద్యాపరిచ్ఛిన్న జీవవ్యవహారునకు ఆత్మ యనఁబడును. దానిప్రభావమే గాకున్న, జడములగు మనో బుద్ధులకు సంకల్పనిర్ణయశక్తులు, కేవలము సండగూపమగుకంటికి నిఖిలబ్రహ్మాండావగాహనశక్తి, శరీరమునకుఁ జైతన్యమునా? అట్టి పరమోత్కృష్ట జీవపరమార్థాత్మయే మాయానుయ చరాచర సర్వజీవ సమష్టిరూపేశ్వరవ్యవహారుల మగు మా కాత్మభూతమైన బ్రహ్మ మనఁబడును. అదియే, నీకును నాకును, నిఖిలబ్రహ్మాండ ములకును బరమార్థాత్మతత్త్వము. సత్యము, జ్ఞానము,అనంతము, అద్వితీయము. త్రికాలాబాధ్యము. రజ్జ్వజ్ఞానమువలనఁ దోఁచు సర్పము వలె భిన్నభిన్నముగఁ గనఁబడు జీవేశ్వరజగద్భావము లన్నియు మిథ్యాభూతములు. పరబ్రహ్మ మాత్రావశిష్టములు.

దివో : జగద్గురూ! ఈవిషయములన్నియు మిథ్యాభూతములన్న నిశ్చయ మున్నను, గంటికి యథాపూర్వముగనే గోచరించుచున్నవి. అను గ్రహించి దీని సమన్వయము నెఱింగింపుఁడు.

విశ్వ : కుమారా! దృశ్యము లెప్పుడును దృగ్విరహితములు కానేరవు. ఫేనబుద్బుదతరంగములు నామరూపములచే భిన్నభిన్నములుగ నున్నను జలవిరహితములు కావుగదా! కాన నవి యెంతగఁదోఁచు చున్నను సముద్రేతరములు కాఁజాలనట్లు, కటకకుండలకిరీటా దులు బంగారమునకంటెను, ఘటశరావాదులు మృత్తునకంటెను, వేఱు గానట్లు, గ్రాహ్యగ్రాహకాదిత్రిపుటీమాత్రములగు నిఖిల బ్రహ్మాండములు బ్రహ్మేతరములు కాఁజాలవు. ఇదియే నిఖిల వేదాంతప్రతిపాద్యమగు తత్త్వరహస్యము.

దివో : [ఆనందముతో] ధన్యుఁడను! ధన్యుఁడను. ప్రభూ! ఇట్టినిరతిశయా ఖండాత్మానందనిర్వికల్పసమాధి నోలలాడ నా కింక వనవాస మున కనుజ్ఞ నిండు. అన్నపూర్ణాదేవీ! లక్ష్మీనారాయణులారా!

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 5 | వెంకట | వేంకట |
| " | 17 | లత | వని |
| 6 | 18 | భృంగియని కలిపికొనఁదగు | |
| 10 | 16 | లెందఱో | అందఱో |
| 19 | 22 | మిత్థ | మిద్ధ |
| 23 | 9 | గూర్చి | గూర్చు |
| 39 | 5 | నిపు | నిప్డు |
| 46 | 5 | స్మశాన | శ్మశాన |
| 53 | 19 | షష్ఠమాంక | షష్ఠాంక |
| 54 | 20 | నిస్నైవ | న్నిస్నైవ |
| 57 | 26 | వ్రయ | వ్యయ |
| 58 | 20 | ముణోగల | వహానెడ |
| 59 | 25 | నెన్నియె | నెన్నియొ |
| 63 | 16 | రాక | లేక |
| 81 | 4 | శస్త్రాస్త్రంబుల్ | శస్త్రాస్త్రాల్ |
| 110 | 8 | త్రోద్యమ | త్ర్యోద్యమ |
| 113 | 20 | గార్మిక | కర్మఠ |
| 117 | 2 | వీక్షింపగ | వీక్షింపంగ |
| " | 9 | నొబ్రిచిరెం | నొబ్రిచుటెం |
| 123 | 25 | నాకాక్షించు | నాకాంక్షించు |
| 127 | 20 | నాబ్రహ్మంబు | తద్బ్రహ్మంబు |

## పీఠిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 9 | 3 | నెందావిద్యానిధి | దానావిద్యానిధి |
| 11 | 19 | నొప్ప | నొప్పు |
| 16 | 14 | సంబరంబు | సంబరము |

కార్మిక శబ్దము సర్వత్ర కర్మఠశబ్దముగా సవరించుకొనునది - తక్కిన అర్ధానుస్వారశకటరేఫాది దోషములు విజ్ఞులు సవరించుకొనవలయునని ప్రార్థన.